*Issued—8-10-1956.*




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

WEDNESDAY, 20TH JULY 1955

**VOLUME III - No. 3**

*CONTENTS*



PRINTED BY [illegible] KRISHNA [illegible]
FOR THE [illegible]

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Wednesday, 20th July, 1955.

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I.—QESTIONS AND ANSWERS.

## SHORT NOTICE STARRED QUESTIONS.

The Hon. Sri G. LATCHANNA :— Mr. Speaker, Sir, there are two short notice questions (178-A and 178-B) standing in the name of Sri M. Rajeswara Rao. They may be clubbed together as the subject matter is the same.

Mr. SPEAKER.— Yes.

*Harijan Hostels managed by private individuals* ·

178-A.

* 1259-A. Q —Sri M. RAJESWARA RAO :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) whether any orders were issued by the Government withdrawing recognition and aid to certain Harijan Hostels managed by private individuals,

(b) If so, the names of those hostels,

(c) The amount of grants assigned to each of those hostels during 1954-55, and

(d) the reasons for such withdrawal of recognition and aid?

The Hon. Sri G. LATCHANNA :—

(a) Yes, Sir.

(b) and (c) :—The information is placed on the table of the House.

(d) As the Government are convinced that the Hostels have been badly managed, they have been taken over by the Government.

*Harijan Hostels taken over by the Government.*

178-B.

* 1259-C · Q ·—Sri M. RAJESWARA RAO :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state: whether the Government have any proposal to take over the management of the Harijan Hostels managed by private individuals and subsidised by the Government in pursuance of the recommendation of the Harijan Welfare Committee, 1948, (appointed by the Government of Madras)?

**The Hon. Sri G. LATCHANNA** :—Yes Sir.

Twenty of the subsidised hostels, reported to be badly managed, have been taken over by the Government.

ఏప్రియల్ 28వ తేదీన జరిగిన హరిజన M L A ల conferenceలో చర్చించబడిన విషయాలదృష్ట్యా కొన్ని హరిజన హాస్టళ్లు ప్రభుత్వంవారి మేనేజిమెంటులోకి తీసుకోవడం అవసరమని ప్రభుత్వము అభిప్రాయపడినందువల్ల, ఏఏ హాస్టళ్లు ప్రభుత్వము, తనమేనేజిమెంటులోకి తీసుకోదలచుకొన్నదో, వాటికి సంబంధించిన recognition withdraw చేయడమయింది.

ప్రభుత్వము తీసుకొన్న హాస్టళ్లయొక్క పరిపాలన, వీటికి యిచ్చిన గ్రాంట్లయొక్క వివరాలు సభ్యులకు యిక్కడ టేబిల్ మీద పెట్టబడినవి. ఆ వివరాలు సభ్యులు చూచుకుంటె, తెలియగలవు.

ఈకర్నూలులో యిదివరకు జరిగిన సమావేశంలో పలువురుసభ్యులు చెప్పిన అభిప్రాయాలనుబట్టి పట్టణాలలో ప్రభుత్వము బాధ్యతవహించి హరిజన హాస్టళ్లను చాలా గౌరవప్రదముగా నడపటం అవసరమని ప్రభుత్వము అభిప్రాయపడినందువల్ల యీహాస్టళ్లను తీసుకోవడం అయింది.

**Sri M RAJESWARA RAO** —ఇక్కడ Table మీద పెట్టబడిన statement లో కొన్నిహాస్టళ్లకు recognition withdraw చేసినట్లుగా తెలియజేశారు అయితే గతసంవత్సరం యీహాస్టళ్లలో ఉన్న విద్యార్థులకు, అందులో ముఖ్యంగా eligible candidates కు యీసంవత్సరం తిరిగి వారు studies continue చేయటానికి ఏవైనా alternative measures తీసుకున్నారా? లేకపోతే మరి యేమేర్పాట్లు చేయడానికి ప్రభుత్వము సంకల్పించుకొన్నదో చెబుతారా?

**The Hon Sri G. LATCHANNA** —ఈ 20 హాస్టళ్లలో, పది ప్రభుత్వమే నడిపి, ఆహాస్టళ్ళలో వున్న విద్యార్థులందరికికూడా ప్రభుత్వము బాధ్యత వహించి నడపబోయే హాస్టళ్ళలో తప్పనిసరిగా ప్రవేశం వుంటుందని మనవిచేస్తున్నాను.

**Sri M. NAGI REDDI** .—ప్రభుత్వమువారు యిక్కడ చెప్పినదాన్ని బట్టి కొన్ని హాస్టళ్ళు మాత్రమే తీసుకున్నారు చాలా హాస్టళ్ళలో, చాలామటుకు mismanagement జరుగుతూన్నదని ప్రభుత్వదృష్టికి యిదివరకు తీసికొని రాబడ్డది. అందువల్ల యీహాస్టళ్ళు తీసుకొనే విషయంలో, యీసంగతి ప్రభుత్వానికి తెలుసా?

**The Hon. Sri G. LATCHANNA** :—ప్రభుత్వముయొక్క ఆర్థిక స్తోమతునుబట్టి వీలయినంతవరకు ప్రభుత్వమే కనీసము ప్రధాన కేంద్రములలోఉన్న హాస్టళ్లనుఅయినా నిర్వహించాలనే అభిప్రాయమునకు ప్రభుత్వమువచ్చింది. అయితే ప్రస్తుతమునకు యీఏడాది మాత్రము experiment గా ప్రభుత్వ ఆర్థికస్థితినిబట్టి యీఇరవై హాస్టళ్ళను నిర్వహించడము బాగావుంటుందని, ప్రభుత్వంనిశ్చయించింది

**Sri N. SRINIVASA RAO** :—ఇప్పుడు ప్రభుత్వమువారు తీసుకొన్న హాస్టళ్ళలో ఒకే village proper లో, మూడు నాలుగు హాస్టళ్ళు వుండగా, అందులో, రెండింటిని మాత్రమే కలిపి, తక్కినవి, విడివిడిగావుంచినట్లు ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Sri G LATCHANNA — శ్రీనివాసరావుగారు ఫలానా హాస్టళ్ళు అనిచెబితే నేను తెలుసుకోగలుగుతాను ఆవిధంగా కొన్ని తీసుకొని, కొన్ని విడిచిపెట్టడమనేది ఎక్కడాజరగలేదు కాని కొన్నిచోట్ల మాత్రం Girls Hostels, Boys Hostels వేరువేరుగా వున్నప్పుడు, Girls Hostels ను మాత్రమే తీసుకొన్నాము కాని అక్కడున్న Boys Hostels ను తీసుకోలేదు కొన్నిచోట్ల Boys Hostels ను తీసుకొని, Girls Hostels ను తీసుకోకపోవడము జరిగింది గాని, Girls Hostels తీసుకొన్నచోట మరొక Boys Hostels వుంటే, దానిని విడిచిపెట్టడంగాని, Boys Hostels ను తీసుకొన్నచోట మరొక Boys Hostelsను వుంటే, దానిని విడిచిపెట్టటంగాని జరగలేదు

Sri V KURMAYYA — హరిజన M L A ల మీటింగు మంత్రిగారు యేర్పాటుచేసి ఆలోచించిన సభలో mismanaged hostels మాత్రం తీసుకోమని సలహాలు చెప్పినమీదట అది వాస్తవం అని గమనించారా ? అయితే కొన్ని well-managed hostels గూడా తీసుకున్నట్లు తెలుస్తున్నది ఆవిధంగా తీసుకోటానికి కారణాలు చెబుతారా ?

The Hon Sri G. LATCHANNA — అవి well-managed అనీ, mismanaged అనీ, సభ్యులలో ఒకొక్కక్కరి అభిప్రాయమైతే అయివుండవచ్చు. కాని ప్రభుత్వానికి వచ్చిన రిపోర్టులు ప్రభుత్వమువద్ద వున్నవి

Sri V. KURMAYYA .— అవియేవో Table మీద పెట్టుతారా ?

The Hon Sri G LATCHANNA –సభ్యులుకోరితే, టేబిల్ మీద పెట్టటానికి అభ్యంతరములేదు.

Sri V. VISWESWARA RAO – ప్రభుత్వము యింతవరకు తీసుకున్న పట్టణాలలోవున్న హాస్టళ్ళలో యిదివరకువున్న విద్యార్థులసంఖ్య తగ్గించకుండా, విద్యార్థులందరికి అవకాశము కలుగజేస్తారా ? అదేపట్టణములో కొన్ని హాస్టళ్ళు తీసుకున్నారు Girls Hostel, Boys Hostel వున్నచోట ఒక్క Boys Hostel మాత్రమే తీసుకొని, Girls Hostel ను విడిచి పెట్టటానికి కారణమేమి ?

The Hon Sri G LATCHANNA —ఈ విషయములో నేను యిదివరకే మనవిచేశాను ప్రభుత్వానికి వున్న ఆర్థికస్థితి ప్రస్తుతము మనము ప్రారంభించేటప్పుడు కొంచెము జాగ్రత్తగా ఆలోచించిచేస్తే మంచిది అనే ఆలోచన ప్రభుత్వానికి వున్నది.

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా, ఎల్లకాలము హరిజనులకు ప్రత్యేకంగా హాస్టళ్లు, backward classesకు ప్రత్యేకంగా హాస్టళ్ళు,ఆదిమవాసులకు ప్రత్యేకంగా హాస్టళ్ళు వేరువేరుగా పెట్టటానికి ప్రయత్నం చేస్తున్నామని అంటారా? లేకపోతే వారందరిని చేర్చి సంయుక్తంగా ఒక్కహాస్టలును మాత్రమే పెట్టి నిర్వహించాలనే ఆలోచన ప్రభుత్వానికి వున్నదా ?

The Hon. Sri G. LATCHANNA —సంయుక్తంగా హాస్టలుపెట్టి నిర్వహించటానికి ప్రభుత్వానికి ఆలోచన వున్నదని యిదివరకే ప్రకటించబడ్డది. ఈసంగతి గౌరవసభ్యులకు తెలుసు ఆదృష్టితోనే యిప్పుడు private hostel లో కూడా హరిజనేతరులను గూడా చేర్చుకోవలసిందిగా ఏర్పాట్లు జరుగుచున్నవి.

Sri N. K. LINGAM — అధ్యక్షా, ంన్ నుంచి ంస్కూళ్ళు తెరవడం జరిగింది ప్రైవేటు మేనేజమెంటులో ఉన్న హాస్టళ్ళు జూన్ 7వ తారీఖున తెరువబడ్డవి 30వ తేదీన recognition రద్దుచేసినట్లు ప్రభుత్వము వుత్తరువు పంపించారు కాని యింతవరకు ంన్ని స్థలాలలో హాస్టళ్లు స్థాపించబడ లేదు అందువల్ల విద్యార్థినులు విధులు ఏధులు, యిల్లు యిలు తిరిగేస్థితి వచ్చిందని ప్రభుత్వదృష్టికి వచ్చిందా ?

The Hon. Sri G LATCHANNA —ఇప్పు సభ్యులు చెబుతున్న మాటలనుబట్టి నేను వింటున్నానేగాని, లిఖితపూర్వకంగా నావద్దకు మాత్రం ఏలాంటి ఫోగట్టా రాలేదు.

Sri S VEMAYYA — ఈ సంవత్సరం ఏమైనా recognition యివ్వటానికి ప్రభుత్వానికి ఆలోచనవున్న?

The Hon Sri G LATCHANNA — అది ఆయాప్రాంతాల పరిస్థితు లనుబట్టి ప్రభుత్వానికివున్న అవకాశాలను బట్టి వుంటుంది

Sri M BAPAIAH CHOWDARY — అధ్యక్షా, కొన్ని హాస్టళ్ళలో పరిపాలన దుర్వినియోగము చేయబడుతున్నదని తెలిసి, వాటిని ప్రభుత్వము స్వాధీనము చేసుకున్నదని సెలవిచ్చారు ఆప్రకారం దుర్వినియోగము చేస్తే, ఆహాస్టల్ యొక్క recognition తీసివేయకుండా ఊరకున్నారా ? లేకపోతే యిం కను ఆహాస్టలు మేనేజరుమీద కఠినచర్య తీసుకోటానికి గూడా ప్రభుత్వము పూనుకున్నదా?

The Hon. Sri G. LATCHANNA ఎటువంటి సంగతికి ఏఏచర్య అవసరమోచూచి, అందుకు తగినచర్య ప్రభుత్వము తీసుకుంటుంది

Sri P. VENKATASUBBAYYA.—వెనుకబడిన తరగతుల వారి హాస్టళ్లు అన్నీ కలిపి ఒకేహాస్టలుగా పెట్టాలని ప్రభుత్వముయొక్క అభిప్రాయమని అంటున్నారు అందులో ఎంత percentage, వెనుకబడిన పిల్లలుంటారు? ఎంత percentage హరిజనపిల్లలు వుంటారు? వారికి ప్రత్యేకంగా యిచ్చే గ్రాంట్లు ఏమైన వున్నవా ? లేకపోతే ఆ ఖర్చు హరిజన నిధినుంచే ఖర్చుపెట్టుతారా?

The Hon Sri G. LATCHANNA — హరిజనుల అభివృద్ధిని గురించి ప్రత్యేకించబడిన గ్రాంటును హరిజనేతరుల గ్రాంటుకింద ఖర్చుచేయబడదని నేను యిదివరకు ఈశాసనసభ సమావేశంలో మనవిచేసి యున్నాను. వెనుకబడిన తరగతులవారికి అందరికి వున్నగ్రాంట్లకు లోబడే, వారికి ప్రత్యేకమైన అవకాశాలు యివ్వబడుతాయని మనవిచేశాను.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, ఆర్థికంగా, సాంఘికంగా, విద్యావిషయకంగా అన్ని విధాలా వెనుకబడిన అన్ని తరగతులకు కూడా సమాన మైన అవకాశం కలగటానికి ప్రభుత్వం పూనుకోదా?

The Hon. Sri G. LATCHANNA — కేంద్ర ప్రభుత్వంవారు ఆదేశిస్తే, అభ్యంతరము వుండదు. కానికొందరు వెనుకబడిన జాతులని, కొందరు scheduled tribes, అని, కొన్ని, నిర్ణయాలు Constitution లోనే ఏర్పాట్లుచేశారు. కాబట్టి దానినే యిప్పా ప్రభుత్వం అనుసరిస్తుంది.

Sri G. BUSSANNA — ఇదివరలో హరిజనహాస్టలుకోసం పోయిన సంవత్సరం ఆదోని మునిసిపాలిటీవారు మూడువేల రూపాయలు శాంక్షను చేసే దానిని ప్రభుత్వం ఎందుకు cancel చేశారు ?

The Hon. Sri G. LATCHANNA —అది ప్రత్యేక సమస్య వేరే ప్ర వేయండి

Sri S NARAYANAPPA .- ఈ హరిజన వసతి గృహాలలో యింతవరకు నాల్గవతరగతి, ఐదవతరగతి విద్యార్థులు చదువుతున్నారు వారికి గ్రాంట్లుకూడా యిచ్చుచుండిరి ఇప్పుడిప్పుడు ఈ నాలుగు అయిదు తరగతుల విద్యార్థులను అందులో చేర్చుకోకూడదా ? వారికి అట్టి వుత్తరువులు పంపించారా ? ఈ విష యంలో ప్రభుత్వము ఆలోచించి అట్టి ఉత్తరువులు రద్దుచేస్తారా ?

The Hon. Sri G LATCHANNA —చేర్చుకోకూడదు, అనేది యేమీలేదు. అయితే అయిదవతరగతి లోపల చదువుకునే వారు గ్రామాలలోనే వుండి చదువ టానికి అవకాశాలుంటున్నవి కనుక వారికి హాస్టల్ గ్రాంటు యిచ్చేదానికంటే ఆ డబ్బు యింకా ఎక్కువమంది చదువటానికి కాలేజీలకు వెళ్ళుతున్న విద్యార్థులకు middle schools కు, హైస్కూల్సుకు వెళ్ళేవారికి సహాయము చేస్తే ఎక్కువ ఉపయోగకరంగా వుంటుందని ప్రభుత్వము అభిప్రాయపడ్డది

Mr. SPEAKER :— No more supplementaries on this. You can discuss it at great length on Harijan Demand.

## STARRED QUESTIONS.

*Report of the Special Officer regarding the Boundaries of the State*

179—

* 495. Q :—Sri S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Special Officer appointed to collect information regarding the boundaries of the State has submitted his report ; and

(b) If so, whether it will be placed on the Table ?

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) "No, Sir."

(b) "Does not arise".

Sri S VEMAYYA :— ఇంతకుముందు నెల్లూరు కలెక్టరుగావున్న బసవరాజుగారిని ఈ బౌండరీ డిస్ప్యూట్సు ఎంక్వైరీచేసి రిపోర్టు అందచేయ వలసిందిగా అప్పాయింటు చేసినట్లు తెలిసింది, వారు యింతవరకు ఏమిపని చేశారు? తాత్కాలికంగానైనా ప్రభుత్వానికి ఏదైనా report అందజేశారా ?

The Hon. Sri B. GOPALA REDDI:- ఆయన రిపోర్టు ఏమీ తయారు చేయ్యలేదు. [illegible] ఇవ్వలేదు, భోగట్టా సేకరించి ప్రభుత్వా నికి అందజేస్తారు.

Sri A KALESWARA RAO – శ్రీ బసవరాజుగారు తయారుచేసినటు వంటి భోగట్టామీదనే రిపోర్టు ఇచ్చింది లేనిది మాకు తెలియదు ఆభోగట్టాను వెనుకటి ప్రభుత్వమువారు దానిని పూర్తిగా అంగీకరించి ఫజలుఆలీ కమీషను వారికి సమర్పించినారన్న సంగతి మంత్రివర్గానికి తెలుసునా ?

The Hon Sri B. GOPALA REDDI -భోగట్టామీద నివేదిక యిచ్చిన సంగతి నాకు తెలియదు ఆయనమాత్రం రిపోర్టుయివ్వలేదు

*Officers in the Public Works Department.*

180-

* 56 Q .—Sri S. VEMAYYA —Will the Hon. the Deputy Chief Minister be pleased to state ·

(a) (1) the number of Executive Engineers;

(2) Assistant Engineers,

(3) Supervisors (Junior Engineers) in the State now, and

(b) the number of Harijans out of clauses (1) to (3) now?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) (1) 114.

(2) 438.

(3) 1445.

(b) 2, 6, and 26 respectively.

Sri S. VEMAYYA ·— ఈశాఖలో వుద్యోగాలు యిచ్చేటప్పుడు హరిజనులకు రూల్సు relax చేసి ఎక్కువమందిని తీసుకోడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఇది ఇంజనీరింగు డిపార్టుమెంటు. ఈరూల్సును relax చేస్తే ఒక్కటూరే డాములుకట్టే యింజనీరు కాబోడు. ఈరూల్సు relax చేయాలని సభ్యులకోరిక అయితే నాకేమీ ఆక్షేపణ లేదు. ఒక పర్యాయమే Chief Engineer గా వేస్తాము.

Sri VAVILALA GOPALAKRISHNAYYA.—ఈ గ్రేడ్లు నిర్ణయం చేప్పుడుచాలా గజిబిజిగా చేస్తున్నారు 1953 లో ప్యాసు అయిన వాళ్ళను తీసుకొనకుండా 1954 లో ప్యాసు అయినవాళ్ళను తీసుకుని నియమిస్తున్నారు. ఇవి వరసగా జరుగకపోవడానికి కారణము ఏమిటి ?

The Hon. Sri N. SANJEEVA REDDI – ఈవిషయంలో వారికి తెలియకపోయి వుండవచ్చు దానికి సమాధానము చెబుతాను. ఈ selection Service Commission వారుచేస్తారు ఇంజనీరు department వారిని ముందుకు వెనక్కు నెట్టడంచేతగాదు. ఇంజనీర్లు ఆపని ఎప్పుడూ చేయరు. Service Commission వారు rank ను fix చేసారు.

*Report of the Committee on the Hindu Religious and Charitable Endowments.*

181-

* 331. Q —Sri VAVILALA GOPALAKRISHNAYYA ·-Will the Hon. the Minister for Revenue be pleased to place the report

of the Committee on the Hindu Religious and Charitable Endowments headed by Sri T. Viswanatham on the table?

The Hon. Sri K. CHANDRAMOULI :— The Committee submitted its report on 10-6-1955. The report is now under print. It will be placed on the table of the House as soon as printed copies are received.

రిపోర్టు అచ్చు అగు చున్నది. అచ్చుకాగానే సభ్యులకు అందజేయ బడుతుంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA·— దానిని పూర్తిచేసి అమలు జరుపడానికి ఏమైనా విచారణలు జరుపుతున్నారా?

The Hon. Sri K. CHANDRAMOULI — అది పబ్లిష్ కానిదే విచారణలు జరుగవు పబ్లిష్ అయిన తరువాత విచారణలు జరిపి తగిన చర్యలు తీసుకుంటారు.

*Block Development Officers etc. in the State.*

182–
*21. Q ·—Sri S VEMAYYA ·—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state .

(a) the number of Block Development Officers in the State ,

(b) the number of Social Education Organisers in the State ; and

(c) the number of Harijans out of clause (a) and (b) now?

The Hon. Sri K. VENKATA RAO :—

(a) 29.

(b) 72.

(c) (a)1.
(b)11.

Sri S. VEMAYYA :–ఈ Block Development Officers ను వేసేప్పుడు, Social Executive Officers కు గాను చాలామందిని departmentalగా కాకుండా directగా కూడా తీసుకున్నారు. ఈ Block Development Officers యొక్క gradeతహసీల్దారు గ్రేడుగాయున్నది మనరాష్ట్రంలో ఒకతహసీల్దారుకూడా హరిజనుల నుండి లేడు. కనీసము కొత్తగా ఈ Block Development Officers ను వేసుకొనేప్పుడు హరిజనులను తీసుకోడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

The Hon. Sri K. VENKATA RAO ·—ఈ తహసీల్దారుల విషయం నాకు తెలియదు, రెవిన్యూమంత్రిగారిని అడగాలి BlockDevelopment Officersగా వున్నటువంటివాళ్ళు మాత్రము తహసీల్దారులుగా వుంటారు అందువల్ల మురియిక అక్కడ ప్రయత్నం చేసుకుంటే తరువాత అది మీకు రావడానికి వీలుంటుంది.

*Andhra State Labour Advisory Board.*

183—

*536. Q: Sri S. VEMAYYA:—Will the Hon. the Minister for Electricity and Welfare be pleased to state:

(a) whether the Government have constituted Andhra State Labour Advisory Board, and

(b) if so, the names of the Members on the Board?

The Hon Sri G. LATCHANNA:—(a) Yes, Sir.

(b) A statement showing the names of the members is placed on the table of the House.

*Building Co-operative Societies in the State.*

184—

*303 Q.—Sri S VEMAYYA:—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state·

(a) the number of Building Co-operative Societies in the State now, and

(b) the number of Harijan Societies out of clause (a)?

The Hon. Sri D. SANJIVAYYA:—

(a) There are 114 Urban Housing Societies and 26 Rural Housing Societies in the State.

(b) One Society, viz., the Korlammapeta Harijan Co-operative Building Society at Rajahmundry in East Godavari District.

Sri PRAGADA KOTAIAH:— మన ప్రకాశంనగర్ కాలనీలో కొన్ని యిండ్ల గోడలు పగిలిపోయి, దూలాలు వంగిపోయినవని తెలిసినది దానివిషయంలో కర్నూలు కో-ఆపరేటివు బిల్డింగు సొసైటీవారి మీద ప్రభుత్వం ఏమైనా చర్యతీసుకుంటుందా?

The Hon. Sri D. SANJIVAYYA:—శ్రీకోటయ్యగారు ఈవిషయంలో ఒక short notice ప్రశ్న ఇచ్చారు. దానికి జవాబు తయారైనది. రేపో ఎల్లుండో వస్తుంది

*District Board Elementary School Teachers in Chittoor District.*

185—

*599. Q: Sri P. RAJAGOPAL NAIDU·—Will the Hon. the Chief Minister be pleased to state whether the Government have issued orders for payment of salaries of District Board Elementary School teachers in Chittoor District for the month of February and March, 1955?

The Hon. Sri B. GOPALA REDDI.—The answer is in the affirmative.

*Assistant Engineers etc., in Highways Department.*

186-

* 103. Q Sri S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) (1) the number of Assistant Engineers (Highways); and

(2) Section Officers (Highways); and (b) the number of Harijans out of clauses (1) and (2) in the State now working?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) (1) 76 (Seventy six)

(2) 255 (Two hundred and fifty five)

(b) (Three and Eleven respectively)

Sri S. VEMAYYA :— Section officers నుంచి పైకి ప్రమోషనులు యిచ్చేప్పుడు ఏప్రాతిపదికపై యిస్తున్నారు ?

The Hon Sri N. SANJEEVA REDDI — Supervisors నుంచి Assistant Engineers గా ప్రమోటుచేసేప్పుడు వాళ్ళ సర్వీసునుబట్టి, వారి record ను బట్టి వారి క్వాలిఫికేషనుబట్టి ప్రమోటుచేస్తున్నారు.

*Land Reforms Committee.*

187-

* 398. Q · Sri P. RANGA REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) the progress made by the Land Reforms Committee so far ; and

(b) when its report is expected ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The Committee has received replies to the questionnaire issued by it to the public, and has also completed its tour of the districts and consultations with the representatives of the various interests concerned. The Committee is now engaged in finalising its conclusions

(b) The Committee's report is expected by about the end of July 1955.

Sri P. RANGA REDDI :- ఈ కమిటీ ఇస్యూచేసిన ప్రశ్నావళి మన స్టేటులో వున్నవాళ్ళకేనా? లేక, మన దగ్గరవున్న మద్రాసు, మైసూరు ప్రభుత్వ ప్రతినిధులనుంచి గాని, లేక అనధికార ప్రతినిధులనుంచి గాని ఈ ప్రశ్నావళిపై అభిప్రాయములను ఈ కమిటీ తీసుకోవడము జరిగిందా ?

The Hon. Sri K. CHANDRAMOULI:- వేరే ప్రశ్న వేస్తే సమాధానము చెబుతాను.

Sri A. KALESWARA RAO·— ఈకమిటీ రిపోర్టు ప్రభుత్వానికి అందేప్పటికి చాలా కాలము పట్టేటట్టువుంది. కనుక ఈలోపలవున్న రైతులను వెళ్ళగొట్టకుండా రైత్వారీ రైతులక్రింద వున్నటువంటి రైతులను రక్షించుటకు ప్రభుత్వం ఏమైనా బిల్లు తీసుకురావడము గాని, ఆర్డినెన్సు పెట్టడముగాని చేస్తారా?

The Hon. Sri K. CHANDRAMOULI — ఈకమిటీ రిపోర్టు జూలై ఆఖరుకు వస్తుంది. అది తొందరగానే వస్తోంది కాబట్టి అటువంటి అవసరములేదు,

Sri P SUNDARAYYA — జూలై ఆఖరుకు ప్రభుత్వానికి చేరుకోగానే సభ్యులకు అందచేయగలరా?

The Hon Sri K. CHANDRAMOULI — అది అంతా అచ్చు వేయాలి అందువల్ల సరియైనతైము చెప్పడానికి వీలులేదు, సాధ్యమైనంత త్వరలో అందజేస్తాము.

Sri P. SUNDARAYYA — వచ్చే సెషను సెప్టెంబరు ఆప్రాంతంలో వుంటుంది కాబట్టి ఆసమయానికైనా అందచేయడానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri K. CHANDRAMOULI — సాధ్యమైనంత తొందరలో అందజేయగలమని చెప్పాను

Sri P SREE RAMULU — ఈకమిటీ భూములను సంస్కరించడానికిమాత్రమే సూచనలు చేయవచ్చునా? లేక అనేక ఇతరవిధాలుగా కరుడుగట్టినటువంటి ఆస్తులన్నింటినిగూడా సవరించే సూచనలు చేయుటకు అవకాశము గలదా?

The Hon. Sri K. CHANDRAMOULI .— ఇది భూసంస్కరణల కమిటీ. ఆస్తులు సంస్కరించే కమిటీకాదు.

Sri B. SANKARAIAH — ఇప్పుడు చెప్పినటైము మంత్రిగారి దృష్టిలో చాలా తక్కువ కావచ్చును కల్టివేషనుసీజను దృష్ట్యా చాలమంది రైతులు వెళ్ళగొట్టబడుతారు కాబట్టి ఎవిక్షనులేకుండా చర్యలు తీసుకుంటారా?

Mr. SPEAKER — It is a matter of opinion.

*Industrial Schools in the State.*

188-

*289. Q. Sri S. VEMAYYA . Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the number of Industrial schools (i) Government (ii) subsidised and the amount granted to them in clauses (i) and (ii) respectively for the year 1954-55?

The Hon Sri K. VENKATA RAO :—

There is one Government Industrial School. It is attached to the Andhra Polytechnic, Kakinada. The expenditure on the school forms part of the expenditure on the Polytechnic. The question of payment of grant to the school does not therefore arise. Besides the Government Industrial School there are 15 aided Industrial schools in the State. No grants for 1954-55 have as yet been paid to these aided institutions.

Sri S. VEMAYYA .— సబ్సిడీకోసము ఎవరైనా ధరఖాస్తులు పెట్టుకోలేదా? పెట్టుకుంటే డబ్బులేదని reject చేయడము జరిగిందా?

The Hon. Sri K. VENKATA RAO :- డబ్బులేదని యివ్వకపోలేదు. ఇతరకారణముల చేతకూడా యివ్వలేదు క్రిందటి ఏడాదిది ఈ ఏడాది ఇచ్చారు. ఈ ఏడాదిది ముందు ఏడాది ఇవ్వడము సంప్రదాయము ఎవరైనా అర్హత ఉన్న వాళ్ళకు subsidy లు యిస్తాము

Sri N VENKAIAH - నిరుద్యోగవ్యాప్తి ఎక్కువగా ఉన్నది కాబట్టి Industrial schools ను అధికము చేయటానికి ప్రయత్నము చేస్తారా ?

The Hon Sri K. VENKATA RAO -Industrial schoolsఅక్కర లేదు Polytechnic లు పనిచేస్తున్నాయి వాటిని చాలా విస్తృతము చేస్తున్నాము

Sri PRAGADA KOTAIAH -అధ్యక్షా! ఈ ఉన్న industrial schools యొక్క వివరములు ఏమిటి ? వాటికి ఎంత మొత్తము ఇవ్వవలసి ఉంటుంది?

The Hon Sri K. VENKATA RAO :—

(1) St Eloysius Industrial School, Visakhapatam.

(2) School of Arts and Crafts, Vijayanagaram.

(3) St. Joseph's Industrial School, Gunadala, Bezwada.

(4) Andhra Jatheeya Kalasala Industrial School, Masulipatam.

(5) Harijan Industrial School, Bhimawaram, West Godavary.

(6) U L C. M. Rural reconstruction School, Guntur.

(7) Krishnasramam Industrial School, Guntur.

(8) St Michael's Industrial School, Guntur.

(9) St. Joseph's' Organised Industrial School, Guntur.

(10) Saradanikethan Industrial School, Guntur.

(11) Kutumbayya District Board Industrial School, Pedapudi, Guntur.

(12) District Board Industrial School, Macherla, Guntur.

(13) Takkarbaba Vidyanilayam, Isukapalli, Repalle Taluk Guntur District

(14) Sri Kasturi Devi Industrial School, Nellore

(15) American Arcot Mission Industrial School, Chittoor District.

ఇన్నిస్కూల్సు ఉన్నవి వీటిలో printing, sculpture, carpentry, cabinet making, general mechanics, blacksmithing, agriculture, మొదలైనవి నేర్పుతారు.

Sri SHEIK MOULA SAHEB :— అధ్యక్షా, ఇన్ని schools Guntur కు ఉత్తరదిశగానే పెట్టారు. మిగిలిన districts ప్రభుత్వ దృష్టిలో ఉన్నవా ?

The Hon. Sri K. VENKATA RAO — ఇవి ప్రభుత్వము పెట్టినవి కావని సభ్యులు యిదివరకే తెలుసుకొని ఉండవలసినది. ఈ స్కూల్సును పెట్టింది

private సంస్థలే గుంటూరు జిల్లావారు అదృష్టవంతులు కాబట్టి గుంటూరుజిల్లాలో ఎక్కువ స్కూల్సు పెట్టారు

Sri P SATYANARAYANA — Kakinada Industrial School లోఉన్న weaving section లో finer counts నేసేవిధానము కూడా ప్రవేశ పెట్టడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri K VENKATA RAO — ఉప్పాడలో ఉన్న చేనేత పారిశ్రామికులు అభ్యంతరము పెట్టకపోతే ఆలోచిస్తాము

Sri VAVILALA GOPALAKRISHNAYYA— • గుంటూరు జిల్లా బోర్డు సత్తెనపల్లిలో Industrial school పెట్టవలసినదిగా ప్రభుత్వాన్ని కోరి donations కూడా ఇచ్చారు పైగా పాకలుకూడా వేశారుకాని Government పర్మిషన్‌కు వ్రాసితిమి కాని పర్మిషన్ క్రిందటి సంవత్సరము రాలేదు. ఈసంవత్సరము వచ్చినదోరాలేదో అనుమానముగానున్నది కనుక దానిని వెంటనే ఏర్పాటు చేయిస్తారా?

The Hon. Sri K. VENKATA RAO — ఇప్పటికే గుంటూరుకు ఎక్కువగా Industrial Schools ఉన్నాయని ఉదయగిరి సాహెబుగారు బాధ పడుచున్నారు. ఇంకా గుంటూరులో పెడితే ఏమనెదరో అని భయముగానున్నది.

Sri P. VENKATASUBBAYYA – కాకినాడలోని Industrial school లో చదివే విద్యార్థులకు యోగ్యతలు ఏమాత్రము ఉండాలి వాళ్లు సంవత్సరమునకు ఏదో కొంతమొత్తము కట్టవలసి ఉండునా ? Stipend విధానముతో కూడా విద్యార్థులను పెట్టెదరా ?

The Hon. Sri K VENKATA RAO:- అందరి Polytechnic students కు ఎటువంటి యోగ్యతలు కావాలో వీరికికూ అట్లాంటి యోగ్యతలే కావాలి.

Sri P. PARTHASARATHI:- రాజంపేట తాలూకాలో 10 వేలుపైగా land-looms ఉన్నవి అక్కడ Textile School పెట్టడానికి ప్రభుత్వమువారు ప్రయత్నిస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO:-చీరాల పట్టణములో 20 వేలు land looms ఉన్నవి. అక్కడ పెట్టిన బాగుండునుగాని రాజంపేటలో పెట్టిన ఏమిలాభము ? అవుసరములేదు.

Sri G. NAGESWARA RAO .- అధ్యక్షా ! ఈ industrial schools private management వారు పెట్టుకుంటామని ఎవరి వద్దనుండి అయినా application వచ్చినవా? గుంటూరునుంచి ఇంకేమైనా వున్నవా ?

The Hon Sri K. VENKATA RAO :- నా record లో ఏమీలేవు. మెంబర్లు సిఫార్సుచేసి పంపిస్తే గోపాలక్రిష్ణయ్యగారు పంపినదీ, మీరు పంపినది ఆలోచిస్తాము.

Sri B. APPALASWAMY :- కాకినాడ Polytechnicలో pass అయిన విద్యార్థులకు ఉద్యోగాలు దొరుకుచున్నవా ?

The Hon Sri K. VENKATA RAO - pass అయిన వాళ్ళకు ఉద్యోగాలు దొరికతే పిళ్ళకు కూడా ఉద్యోగాలు దొరుకును

Sri S. VEMAYYA - అనేకమంది ఆంధ్ర విద్యార్థులు technical courses కు సీట్లు దొరకక, బాధపడుచున్నారు అటు మద్రాసులోనో ఇటు మైసూరులోనో మన విద్యార్థులను చేర్చుకోడానికి ఏదైనా చర్య తీసుకుంటారా? దానికి ఆంధ్రవిద్యార్థులను ఎంతమందిని పంపించుటకు వీలుపడుతుందో చెప్పెదరా?

The Hon. Sri K VENKATA RAO —ఈ ప్రశ్నకు సంబంధించిన ప్రశ్న కాదు

Sri A C. SUBBA REDDI —Kasturidevi Industrial school బాడుగ ఇంటిలో ఉన్నది దానికి ఏమైన building grant యివ్వడానికి గవర్నమెంటు ఆలోచిస్తుందా ?

The Hon. Sri K VENKATA RAO —¾వంతు వారు వసూలుచేస్తే మిగతాది గవర్నమెంటు యివ్వడానికి ఆలోచిస్తుంది

Sri A. C. SUBBA REDDI — మ్యునిసిపల్ చైర్మెన్‌గా భూమి యిచ్చాను గవర్నమెంటుగా మీరు grant యివ్వండి

The Hon. Sri K. VENKATA RAO — మ్యునిసిపల్ చైర్మెన్‌గా గ్రాంటుగా ఎవరిభూమి యిప్పించారో నాకింకా తెలియదు

*Cost of living index.*

189-

* 744. Q · Sri P. GOPALAKRISHNA REDDI ·—Will the Hon. the Chief Minister be pleased to state .

(a) whether the Government follow the cost of living index to increase or decrease the dearness allowance to the Public Servants of our State , and

(b) If so, what the cost of living index now is and what it was in the corresponding period of last year ?

The Hon. Sri B GOPALA REDDI ·—

(a) The allowance is intended to compensate Government servants for the higher cost of living, but it has not been regulated strictly with reference to the cost of living index

(b) Does not arise.

Sri P. RANGA REDDI :—May I ask Sir whether it has come to the notice of the Chief Minister of a news item published in certain newspapers that the Government are contemplating to cut the dearness allowance of certain Government servants ? If so what amount of truth is there in that news ?

The Hon Sri B GOPALA REDDI:— పత్రికలలో నేను చూడలేదు కాని publish అయినట్లు విన్నాను. దానికి ఎటువంటి ఆధారము లేదు

Sri P. SUNDARAYYA.— ఈ dearness allowance అని చాలా సంవత్సరములనుండి యిస్తున్నారు. ధరలు మీరు అనుకొన్న దానికంటె చాలా ఎక్కువగా ఉంటున్నవి అందుచేత D. A ను జీతముతో కలపడానికి ప్రభుత్వానికేమైన అభ్యంతరమున్నదా ?

The Hon Sri B. GOPALA REDDI —ఒక్కటే అభ్యంతరము ఆర్థిక అభ్యంతరము. D A ను salary తో కలిపినట్లయిన పెన్షను ఎక్కువగును Sundarayya garu చెప్పిన విషయంలో cost of living తగ్గింది May, 1954 నాటికి విశాఖపట్టణంలో 369 ఉంటే 1955 May నాటికి 321 కు తగ్గింది ఆవిధముగానే ఏలూరులో 1954 May నాటికి 444 ఉంటే, 1955 May నాటికి 393 కు తగ్గింది. కనుక cost of living index తగ్గుచున్నది అప్పుడే salary ని D. A. తో కల్పడమనేది ఉదయించదు.

Sri P. SUNDARAYYA:— Cost of living index 3 రెట్లు ఉన్నప్పుడు యిచ్చిన allowance 2 రెట్లు వున్నది. కాబట్టి దీనిని దృష్టిలో పెట్టుకొని అయినా D A ను జీతముతో కలుపుతారా ?

The Hon. Sri B GOPALA REDDI:— కొంతవరకు గడ్డుదినములు గడచిపోయినవి అప్పుడు చేయనిది ఇప్పుడుచేస్తే న్యాయముగా ఉండదేమో అని చేయలేదు. అదిగాక నేను మొదట చెప్పినట్లు ఆర్థికమైన కష్టాలు ఉన్నవి. అందువల్ల చేయడములేదు

Sri P. SUNDARAYYA:— కనీసం రు 100 లు లోపు జీతం సంపాదించుకునే వాళ్ళకైనా చేస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI:— పైన వుండేవాళ్ళకు చేస్తే ఎక్కువేకాదు రు 100 ల లోపువాళ్ళకు చేస్తేనే ఎక్కువ ఖర్చు అవుతుంది.

Sri B. G M. A. NARASINGA RAO — అధ్యక్షా, కరువుభత్యం అనేది శాశ్వతంగా వచ్చి కూర్చున్నదనే సంగతి ప్రభుత్వం గుర్తించిందా ?

Mr. SPEAKER:— Please repeat the question.

Sri B. G. M. A. NARASINGA RAO — Do the Government recognise that the cost of living index has become a permanent feature ?

The Hon. Sri B. GOPALA REDDI — We do not consider it so. Cost of living index తగ్గితే D. A. కూడా తగ్గించవచ్చునని ప్రభుత్వం అనుకుంటోంది.

Sri B SANKARAIAH.— ఇతర ప్రభుత్వాలలో కంటె Central Government pay scales కంటె మన scale తక్కువగా వున్నదనే దృష్టితో అయినా D. A. జీతంలో కలుపుతారా ? [illegible]

The Hon. Sri B. GOPALA REDDI'— ఈవిషయంమీద చాలా చర్చ, చాలారాద్ధాంతాలు జరిగాయి. మనం మద్రాసు ప్రభుత్వంలో వుండగానే, Government of India లో ఇచ్చే D. A మద్రాసు ప్రభుత్వంవారు ఇవ్వాలని చాలాసార్లు చెప్పారు అది సాధ్యంకాదని ఆపుడు అభిప్రాయంపడ్డారు. 1948 నుంచి ఇప్పటివరకు, అంటే 7 సంవత్సరాలు ఇదే D. A. అమలులోవున్నది.

*Construction of District Offices at Srikakulam.*

190-

* 560. Q. Sri P. GUNNAYYA:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state

(a) whether the Land Acquisition has been made for constructing the District Offices and Officers' quarters at Srikakulam; and

(b) If not, when this will be taken up?

The Hon. Sri N. SANJEEVA REDDI :—(a) No

(b) Proceedings for the acquisition of land will be initiated shortly.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా, శ్రీకాకుళం జిల్లా headquarters. 7 సంవత్సరాల నుంచి కోర్టులేకుండా చాలా యిబ్బంది పడుతున్నాము. స్థలం acquire చేయటానికి ఇపుడు Budget లో 8 లక్షలు కేటాయించారు ఒక సంవత్సరం లోపుగా భవనం కట్టడానికి ప్రభుత్వం ఏమైనా వేరే ఏర్పాటు చేసారా?

The Hon. Sri N. SANJEEVA REDDI –8 లక్షలు బడ్జెటులో వుండడమే ఏర్పాటుచేసినట్లు. Acquisition proceedingsకు ప్రయత్నాలు చేస్తున్నారు. త్వరలో భూమి సేకరిస్తారు.

*Sub Collector's Office at Tekkali.*

191-

* 562. Q. Sri P. GUNNAYYA :— Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) the amount of monthly rent paid by the Government for the buildings of the Sub Collector's office at Tekkali, and

(b) From how long the above rent is being paid?

The Hon. Sri K. CHANDRAMOULI .—

Clause (a) Rs. 500/-

Clause (b) Since 20-4-1951

*Starting of a Cotton Growers' Co-operative Spinning Mill at Tadipatri.*

192-

* 872. Q Sri PRAGADA KOTAIAH :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) whether there is a proposal to start a Cotton Growers' Co-operative Spinning Mill at Tadipatri in Anantapur District, and

(b) If so, the kind of help that will be extended by the Government for the starting of such a mill ?

The Hon. Sri K VENKATA RAO :—

(a) Yes Sir

(b) This is under the consideration of Government.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, అచటి ప్రజలు 17½ లక్షలు వసూలుచేస్తే మన ఆంధ్రప్రభుత్వం 17½ లక్షలు వాటా ధనం ఇవ్వడానికి నిర్ణయించిందని చాలాసార్లు పత్రికల్లో వచ్చింది. అది యదార్థమా ?

The Hon Sri K. VENKATA RAO :—నిర్ణయం జరుగలేదు. మాట్లాడిన మాట నిజమే

Sri C. SUBBARAYUDU :—ఇప్పుడు ఈ విషయంలో capital float చేయడానికి ఒక Deputy Registrar గారిని వేయాలని కోరిక Steering Committee తెలిపింది. దానిమీద ప్రభుత్వం ఏమైనా చర్యతీసుకున్నదా ?

The Hon Sri K. VENKATA RAO :— 84 వేల రూపాయలు వసూలు చేశారు లక్షలు వసూలుచేయాలి కనుక ఇంకా కొంచెం వసూలు చేశాక Deputy Registrar సహాయం ఇస్తాము.

Sri PRAGADA KOTAIAH :— ఎన్ని వేల కదుళ్ళతో ఈ మిల్లు ప్రారంభించాలని; దానికి మొత్తం పెట్టుబడి ఎంతకావాలి ? మిగతా పెట్టుబడిని సమకూర్చడానికి ప్రభుత్వం ఏమిచేస్తుంది ?

The Hon Sri K VENKATA RAO :— 35 లక్షల రూపాయలవరకు పెట్టుబడికావాలని అనుకుంటున్నారు ఇందులో ప్రభుత్వం ఇచ్చేడబ్బు అక్కడ వసూలుచేసే డబ్బు కలిపితే చాలావరకు దానికి కావలసిన వ్యవహారం జరుగుతుంది మామూలుపెట్టుబడికి సహకార సంస్థలు సహాయం చేస్తాయి.

Sri P. VENKATASUBBAYYA.- ఈ Society యొక్క objects ఉద్దేశాలు ఏమిటో సెలవిస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO — పండించిన ప్రత్తిని మిల్లు ద్వారా నూలుక్రింద వడికి చేనేత పారిశ్రామికులకు ఇచ్చి బట్ట నేయిస్తే సుబ్బయ్యగారు కట్టుకుంటారని ఆశ.

Sri. C SUBBARAYUDU — మిల్లు management, constitution ఏవిధంగా వుంటుందనేది ప్రభుత్వం తెలిపితే షేరు మొత్తాలు వసూలుచేయడానికి బాగుంటుంది ఆ constitution గురించి నమూనా తయారుచేసి ప్రభుత్వం ప్రజలముందు పెడుతుందా ?

The Hon. Sri K. VENKATA RAO :— Constitution తయారు చేస్తాము. దానిలో చాలా మజిలీలు వున్నాయన్నే సంగతి గౌరవసభ్యులకు తెలుసు ఇవన్నీ పెడతాం అని రెండవ పంచవర్ష ప్రణాళిక మొదటి దశలో వున్నది. ఇవి

అ శేపు చర్చ వచ్చినపుడు చెబుతాను ఇవన్నీ ఢిల్లీ వెళ్లాలి, వారు అంగీకరించాలి, అనుకున్న ప్రకారం వారు ఇవ్వాలి. షరతులు అంగీకరించాలి, దీనికి అంతకీ కొంత ఆలస్యం అవుతుంది.

Sri PRAGADA KOTAIAH :- అధ్యక్షా, దాదాపు 50% పెట్టుబడిని ప్రభుత్వం ఇందులో పెట్టడానికి సంకల్పించినపుడు, management లో ప్రభుత్వానికి సంపూర్ణమైన బాధ్యత వున్నదని ప్రజలకు తెలియచేస్తే వాటాధనం సులువుగావసూలు అవుతుందనే అభిప్రాయంవున్నది. దానికి అనుగుణ్యంగా దీని నిర్మాణంగురించి నిర్వహణగురించి తెలియచేస్తే బాగుంటుందేమో ? ఆంధ్ర దేశానికి సన్ననూలు ఉత్పత్తి అదనంగాకావాలి కాబట్టి ముతకనూలు ఉత్పత్తిచేసే కదుళ్లుకాకుండా సన్ననూలుకదుళ్లు ఏర్పాటుచేయడానికి ప్రయత్నిస్తారా ?

The Hon Sri K. VENKATA RAO:—ఇదిCottonGrowers'Society. వారుఎలాంటి ప్రత్తిపండిస్తే అటువంటి నూలువస్తుంది. ఈవిషయంలో తాడిపత్రి మిల్లు అంతవీలుగావుండదు రెండవది, దీనిలో ప్రభుత్వానికి ఎప్పుడు shares వున్నాయో,అప్పుడు management లో control విషయంలో ప్రభుత్వానికి ఘనమైన చేయి వుంటుంది మూడవది, constitution గురించి ఎటువంటి control వుండాలనే దానిపైముందు వచ్చేకొద్దిరోజుల్లో నిర్ణయంచేస్తాము.

*Muslim Wakf Act in the State.*

193-

* 828. Q: Sri V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government have received any representation from the Muslims to give effect to the Muslim Wakf Act in our province ;

(b) if so, the action taken by the Government thereon, and

(c) whether the Government will be pleased to lay on the Table of the House a list of Muslim Wakf properties in the province ?

The Hon. Sri K. CHANDRAMOULI .—(a) Yes.

(b) The Act came into force in this state on 1-4-1955. The Government have decided to appoint one Commissioner of Wakfs and three Assistant Commissioners of Wakfs for the purpose of making a survey of Wakf properties. All steps are being taken to implement the Act in this State.

(c) The particulars of Wakf properties are not readily available. They will be placed on the table of the House after the survey is completed.

Sri V. VISWESWARA RAO — Commissioner ను appoint చేస్తారు. ఆయనకు సలహాయివ్వడానికి కమిటీ appoint చేస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— మొదట particulars సేకరించిన తరువాత రాష్ట్రం మొత్తంమీద ఒక non-official సంఘాన్నికూడా వేస్తారు.

Sri SHEIK MOWLA SAHEB :— అధ్యక్షా ! ఈ కమిటీని ఎంత కాలంలో నిర్ణయిస్తారు ? ఇందులో రాష్ట్రంలోని National Muslims ను ఎవరినైనా గౌరవసభ్యులుగా తీసుకుంటారా?

The Hon. Sri K. CHANDRAMOULI :— సాధ్యమైనంత త్వరలో వేస్తాము. దానిలో మహమ్మదీయులలో అన్నిశాఖలవారికి కూడా ప్రాతినిధ్యం ఇవ్వడానికి ప్రయత్నం చేస్తాము.

Mr. SPEAKER :—Sri B. Appalaswami has given notice of an adjournment motion. The matter can be discussed on the Education Budget today. He has another opportunity of discussing this in the Harijan Welfare Budget. It anticipates a discussion of these two demands and so I rule it out of order.

[Note. An asterisk* at the commencement of a speech indicates revision by the Member].

## II. BUDGET FOR THE YEAR 1955-56.

*Voting of Demands for Grants for 1955-56 (Continued).*

### DEMAND XV- EDUCATION.

The Hon. Sri B. GOPALA REDDI :—Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a sum not exceeding Rs. 5,23,16,700 under Demand XV — Education".

అధ్యక్షా, ఈడిమాండును ప్రతిపాదిస్తూ చేయవలసినటువంటి ఒకస్టేటుమెంటు యింగ్లీషులో గౌరవ సభ్యులందరికి పంచిపెట్టబడింది. కాని మరల తెలుగులో చెప్పమని కోరుతారు కాబట్టి తెలుగులో ప్రస్తావన చేస్తున్నాను. ఈడిమాండు ఒక electricity క్రింద 13 కోట్ల రూపాయలను మినహాయిస్తే కొదమ అన్ని డిమాండులకంటె కూడా పెద్దదైనటువంటిది. మనరాష్ట్రంలో యీనాడు 5 కోట్లకుపైన యీవిద్యమీద ఖర్చుపెడుతున్న విషయం మీకందరకు తెలిసినదే. ఇంకా ఎన్నోస్కూళ్ళు అనేకచోట్ల పెట్టవలసిన అవసరం వున్నది. కాలేజీలు, అందులో మొన్న బడ్జెటు discussion మీద సుందరయ్యగారు చెప్పినట్టుగా స్త్రీల విద్యా సౌకర్యం కూడా ఎక్కువకావాల్నని వారు కోరుతున్నారు. ఇంకా techincal education, training schools వగైరాలు అనేకం పెట్టాల్సిన అవసరంవున్నదని ప్రభుత్వంవారికి తెలుసును అయినప్పటికిన్నీ యీనాడు కేంద్రప్రభుత్వంవారు నిర్ణయించిన దామాషా అంటే దాదాపు మనం చేసినటువంటి వ్యయంలో 20 percent అయినా యీచదువుమీద మనం పెట్టవలసిన భావంగా ఒకప్పుడు వారు చెప్పియున్నారు. ఆమాదిరిగా మన ప్రభుత్వంవారు పెట్టేటువంటి ఖర్చుల్లో యించుమించు 20 percent మనం

Vide appendix at i to vii pages infra.

యీనాడు ఖర్చు పెడుతూన్నామేమో ననిపిస్తున్నది. Revenue Account క్రింద అయ్యేటటువంటి ఖర్చు దాదాపు 25 కోట్లున్నది ఆదాయము 22 కోట్లుకంటె తక్కువ అయేటటువంటి ఖర్చు 25 కోట్లు విద్యకు 5 కోట్లు చిల్లర. Percentage యింతమటుకు ఎక్కువగా వున్నదేమో అనిపిస్తున్నది ఏమయి నప్పటికీ యిప్పుడు ముఖ్యంగా యీ Demand లో వున్నటువంటి పెద్దవిషయాలు యీనాడు చర్చ జరుగుతాయి వీటిలో aided schools విషయంలో కొంత మంది గౌరవసభ్యులు cut motions యిచ్చినారు వారు యీవిషయం గురించి ఎక్కువగ చెబుతారనుకుంటాను ఈస్కూళ్ళన్నీ ఒకేసారి గవర్నమెంటు తీసుకుని ఒకే agency క్రిందకి పెట్టమని ఒకఉద్దేశ్యము ఇవికొన్ని local boards క్రింద, 54 percent స్కూళ్ళు యింకా private agency క్రింద వున్నాయి వీటన్ని టినీ తీసుకుని వారికందరికి జిల్లాబోర్డు భత్యములు, గవర్నమెంటు భత్యములు యివ్వడానికి కొన్ని లక్ష॥ రూపాయలవుతుంది పోయినప్రభుత్వం వున్నప్పుడు యీవిషయమై తీవ్రమైన ఆందోళన వున్నటువంటి విషయం గవర్నమెంటువారికి తెలుసును దాని సాధకబాధకములు అంతాకూడా విచారిస్తున్నాను కాని కుప్పు స్వామి కమిటీ సిఫార్సులు తోడనే అంగీకరించడానికి వీలులేదేమో, కాని దానిని మేము అంగీకరించడం లేదని చెప్పడంలేదు దానికి వున్నటువంటి సాధకబాధక ములు మీరేమి చెబుతారో కూడా వినాలని కుతూహలంగా కూడా వున్నది.

ఇక ట్రెయినింగు స్కూల్సు విషయంలో ప్రభుత్వంవారు యీ హయ్యరు గ్రేడు ట్రెయినింగు సాధ్యమైనంత త్వరలోనే రద్దుచేయాలనే వుద్దేశం వున్నది. కుప్పుస్వామి కమిటీ చేసినటువంటి సిఫార్సు కూడా మొత్తంమీద వున్న టీచర్సు అందరూ కొద్ది కాలంలో సెకండరీ గ్రేడు టీచర్సుగానే వుంచేనే మంచిది ఈ హయ్యరు గ్రేడు టీచర్సు Eighth Standard, III Form pass చేసి ట్రయినింగు అయివచ్చేటటువంటి టీచర్సు సక్రమంగా చెప్ప లేరని కూడా మనకుకొంతవరకు తెలుసును అందువల్ల అందరూకూడా సెకండరీ గ్రేడుటీచర్లయి వుండాలన్న వుద్దేశంక్రింద యీసంవత్సరంనుంచీ ఆవిధానం కొంత వరకు ప్రారంభమైనది కొన్ని కొన్ని స్కూల్సు సెకండరీ గ్రేడు ట్రయినింగు స్కూల్సుగా మార్చబడినవి. అందువల్ల ఆ పద్ధతి 2, 3 సంవత్సరాలలో పూర్తవు తుందని ఆశిస్తున్నాను - ఇంక, ఒకజిల్లాబోర్డు హైస్కూలులో స్కూలు ఫైనలు పెట్టినారు ఫోర్తుఫారం abolish చేసినారు అని సూర్యనారాయణరాజుగారు మొన్న చెప్పినారు అది ఒకరకంగా వాస్తవమే. ఒక రకంగా కొంత అతిశయోక్తి కూడా నేమో అనిపిస్తున్నది. మొత్తంమీద ప్రజలదగ్గరనుంచి వచ్చేసహాయం చాలసంతోష దాయకంగా వున్నది 242 స్కూల్సు వాగ్దానాలు చేసినా ఆవాగ్దానా లను నెరవేర్చకుండా వున్నవి జిల్లాబోర్డులక్రింద 242 వున్నాయి. దాంట్లో 197 స్కూళ్లు యీనాడు మూడోవంతు దామాషాకట్టినారు. కొదముదామాషా కూడా కట్టడానికి మెంబర్లు అక్కడ వాళ్లకు చెప్పి పూనుకుంటారని ఆశిస్తున్నాను ఈ 197 స్కూళ్ళ విషయంలో ఎలాంటి అభ్యంతరంలేదు. ఇక 31స్కూళ్ళ విషయంలో కలెక్టర్లు వాళ్ళయొక్క discretion ఉపయోగించి ప్రయత్నం చేసినారు. కాల మాన పరిస్థితులనుబట్టి తోడనే అంతా చెల్లించలేకుండా వున్నారు. కాబట్టి 31 స్కూళ్ళు వుంచవచ్చుననే వుద్దేశంతో 31 స్కూళ్ళ విషయం కలెక్టర్లు చెప్పి

నారు. 14 స్కూల్సు ఎలాంటి ప్రయత్నం చేయలేదు అనేటటువంటి మాటగా చెప్పినారు అందువల్ల యీ 14 స్కూళ్ళ విషయంలో కొంత తకరారుగా వున్నది జూలై 1వ తేదీని కట్టినప్పటికీ ఫోర్తుఫారం పెట్టవచ్చునని మొన్న ఉత్తరువులు చేసినాము ఈ 14 స్కూల్సు కూడా యింకో వారంరోజులలో నైనా వారుకట్టి ఫోర్తుఫారం close అయిపోయింది అనేటటువంటి మాట లేకుండా చేసుకోడం వాళ్ళకుగాని ప్రజలకుగాని ఉత్తమంగా వుంటుందని నేను ఆశిస్తున్నాను ఈ 14 లో బహుశః మీకు వచ్చిన రిపోర్టు తరువాత యింకా కొన్ని స్కూళ్ళు open అయినట్టు కనపడుతున్నది కాబట్టియిక్కడ మొత్తంమీద యీ మిగిలిన 7, 8 స్కూళ్లుకూడా మూడోవంతు దామాషా కడితే చాల సంతోషంగా వుంటుంది ఇక text-books విషయంలో అక్కడక్కడ కొంత అలజడి వున్నట్లు గవర్నమెంటువారికి తెలుసును క్రిష్ణాజిల్లానుండి టెలిగ్రాంలు వగైరాలు వచ్చినవి. ఇతర జిల్లాలలోకూడా చాలా ఆందోళనగా వున్నది అందువల్ల కుప్పుస్వామి కమిటీ చెప్పిన ప్రకారంగా text-book అంతాకూడా గవర్నమెంటు తయారుచేయడానికి నిశ్చయించుకొని దానికి తగినటువంటి ప్రణాళికను యివ్వమని తిరుపతి యూనివర్సిటి వైస్చాన్సలరు గోవిందరాజులు నాయుడు గారి chairmanship క్రింద ఒక కమిటీ యీ వారములోనే నిర్ణయించినారు. రెండు మాసములలో text-books ఏరకంగా publish చేయాలి, ఏరకంగా అమ్మించవలెను అనేటటువంటి అంశాలు discuss చేసి రిపోర్టు యివ్వండి అని చెప్పి గోవిందరాజులు నాయుడు కమిటీ ఏర్పాటు చేసినాము. అది వస్తుండగానే సాధ్యమైనంతవరకు కొన్ని పుస్తకాలైనాసరే ప్రభుత్వము publish చేయడానికి పూనుకుంటుందని ఆశిస్తున్నాను S S. L C. విషయంలో మనప్రాంతాలలో దానిని యిటీవల రివ్యూకూడ ప్రభుత్వం చేసినది మొత్తంమీద 38 percent మాత్రం యీ సంవత్సరం pass అయినారు. Moderation అయిన తరువాత మదరాసు యూనివర్సిటీలో అంతకన్నా ఎక్కువ pass అయినారు ఈ 38 percent pass కావడం గవర్నమెంటువారికి, ఎవరికికూడా సంతోషదాయకంగా లేదు. అంటే యింకా ఎక్కువ moderation సులభం చేయమని గౌరవనీయులైన సభ్యులు చెప్పరని అనుకుంటాను. మన headmasters, parents, students అందరూకూడా ఆసక్తిచూపించి యీసెకండరీ ఎడ్యుకేషన్ స్కూలు ఫైనలులో ఎక్కువమంది pass కావడానికి సక్రమమైన మార్గాలలో ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. మొత్తంమీద 38 percent చాల low గా వున్నది. దాదాపు 50 స్కూళ్ళు 20 percent వున్నటువంటివి వున్నవి. West Godavari జిల్లాలో ఒకచోట ఎంతమంది పోయినారో అంతమంది fail కావడం జరిగింది యివన్నీకూడా కొంతవరకు చూచేవారికి, వినేవారికి విషాదంగా వుంటుంది. పాలకొల్లులో ఎంతమంది విద్యార్థినిలు పోయినారో అంతమంది fail కావడం తటస్థించింది. 50 స్కూళ్ళలో 20 percent కన్న తక్కువ fail అయినారు కాని కడపజిల్లాలో బద్వేలు హైస్కూలులో highest percentage results pass అయినారు ఈమాదిరిగా హైస్కూలు results అంతా చురుకుగా అవుగాక అని ఆశిస్తున్నాను. దానికి వారుకూడా అటువంటి ప్రయత్నాలు చేస్తారని కూడా ఆశిస్తున్నాను. ఇక హిందీ విషయంలో

ఏదో మీరు pass అయితేకావచ్చు లేకపోతే మానివేయవచ్చునని ఇదివరకుండే మాదిరిగా కాకుండా compulsory గానో లేక optional గానో examination subject గా చేస్తున్నాం ఇక తిరుపతి యూనివర్సిటీ విషయంలో University Grants Commission చెప్పినటువంటి విషయాలు అంగీకరించడం జరిగింది బహుశః అనుకున్న ప్రకారంగా అయితే 22 లక్షలరూపాయలు యివ్వడానికి పంపించినటువంటి ప్రతిపాదనలు మంజూరు చేసినట్లయితే వాళ్ళగ్రాంటు బహుశః 22 లక్షల రూపాయలవరకు రావచ్చు ననిపిస్తున్నది ప్రభుత్వంకూడా 7½ లక్షల రూపాయలు—అంటే మొదట పార్లమెంటులో పెట్టిన బడ్జెటు కంటెకూడ ఎక్కువగా తిరుపతి యూనివర్సిటీకి యివ్వడానికి నిశ్చయించారు. ఇంకా కొన్ని ట్రయినింగు కాలేజీలు ఎక్కువచేసినారు. Women's College, Rajahmundry, Nellore Training College ఇవిపెట్టినటువంటి విషయం మీకందరకు తెలిసినదే అట్లాగే వైజాగులో ఇంజనీరింగు కళాశాల పెట్టడం విషయంకూడా గౌరవనీయులైన సభ్యులందరికి తెలుసును. ఈ విధంగా కొంత technical education కూడా ఎక్కువచేయడానికి ప్రభుతంవారు ప్రయత్నం చేస్తున్నారు. ఇక యిప్పుడు సంస్కృత విషయంలో వాదోపవాదములున్నాయి వాటిలో నేను ఏమీ పాల్గొనదలచుకోలేదు మొత్తంమీద చెప్పేవారంతాకూడా కంపల్సరీగా చేస్తే చిక్కులున్నవి కనుక దానికి తగినటువంటి ప్రోత్సాహం యివ్వండి అనేటటువంటి విషయంలో ఎలాంటివివాదం లేకుండావుండటం సంతోషించవలసిన విషయం ఏమయినప్పటికీ నవంబరు 11 వ తేదీని All India Sanskrit Conference జరుగుతుంది. పోయిన సంవత్సరం జరుపదలచారు కాని జరగడానికి వీలులేకుండా పోయింది. ఈ సంవత్సరం నవంబరు 11 తేదీ ప్రాంతాలలో జరుగుతుంది దానికి U P. గవర్నరైన K. M. Munshi గారు President గా వున్నారు. డాక్టరు రాజేంద్రప్రసాదుగారు కూడా బహుశః ఆ Conference కి వస్తామని అంగీకరించారు సంస్కృత అభిమానులందరూకూడా ఆ సమావేశంలో అనేకవిషయాలు చర్చించి, సంస్కృతంకు ఎటువంటి ప్రోత్సాహం యివ్వాలో, తెలుగుకు ఎంతవరకు సంస్కృతం కావాలో తెలుగు ఏ రకంగా బలిష్టమైన subject గా చేయడానికి వీలవుతుందో యివన్నీకూడా ఆలోచించవలసి యుంటుంది. ఈ Demand క్రింద రామకృష్ణరాజుగారు వగైరాలకు ఆసక్తివున్న సంగీతం నృత్యం మొదలైన విషయాలు కూడా ఉన్నాయి.

Sri R. B. RAMAKRISHNA RAJU.—మంత్రిగారికి ఆసక్తిలేదండీ?

The Hon. Sri B. GOPALA REDDI.—మంత్రిగారికి ఉండే ఆసక్తి జగద్విఖ్యాతం. అది నేను వేరే చెప్పనక్కరలేదు ఈవిషయంలో మెంబర్లు చెప్పవచ్చు. ఆవిషయంలో కూడా ఎంతవరకు వీలున్నదో అంతవరకు చేయడానికి సంగీతనాటకఅకాడమీ పెట్టడానికి-తద్వారా కళలనంతాపోషణ యివ్వడానికికూడా ప్రభుత్వమువారు ఆలోచిస్తున్నారు. ఆవిషయంలోకూడా మనమందరము శ్రద్ధ వహించవలసియుంటుంది.

ఇంకా Scout movement, N C C. వగైరాలకు కూడా ఈ సంవత్సరం కొంత ప్రభుత్వంవారు ప్రోత్సాహం ఇవ్వడానికి నిశ్చయించింది ఈN C C ని ఇంకా ఎక్కువ కాలేజీలలో పెట్టడానికి, ఎక్కువ Units తయారుచేయడానికి, కూడ ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు ఈ scouting కూడ ప్రతి స్కూలులో వస్తే మంచిది అనేటటువంటి ఉద్దేశంకూడా ఉన్నది అందువల్ల ప్రాముఖ్యమైన ఈవిషయాలంతాకూడా ఈ 5 కోట్ల చిల్లర డిమాండులో ఉన్నవి కాబట్టి మెంబర్లు దీనిని సక్రమంగాఆలోచించి ఈవిషయంలో గవర్నమెంటు వారికి ఏమిచెప్పవలెనో చెప్పి, తర్వాత వారి సలహాలు, హితోపదేశాలు అన్నీ చేస్తారని ఆశిస్తు ఈ Demand ను నేను ప్రతిపాదిస్తున్నాను.

Mr SPEAKER .— Motion moved—

"That the Government be granted a sum not exceeding Rs 5,23,16,700 under Demand XV - Education."

There are a number of cut motions and some of them are inadmissible. I will read one after another and the members may move the admitted cut motions.

Sri P. SUNDARAYYA:-Sir, I beg to move-

To reduce the allotment of Rs 5,23,16,700/-for Education by. ... . ... Rs. 100

(విశ్వవిద్యాలయాలలో తెలుగులో విద్యాబోధన చేయడానికి ఇంతవరకు చర్య తీసుకోనందులకు.)

Sri P. SUNDARAYYA - Sir, I beg to move-

To reduce the allotment of Rs 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(మొదటి ఫారమునుండే హిందీని నిర్బంధముగా ప్రవేశపెట్టినందులకు.)

Sri P. SUNDARAYYA :-Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(విద్యాలయాల సన్నిధిని ప్రభుత్వమే నడపడానికి పూనుకోనందులకు.)

Sri P. SUNDARAYYA.- Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(14 సంవత్సరాలవరకు మూడవఫారము వరకయినా ఉచితంగా విద్యాబోధన చేయడానికి పూనుకోనందులకు.)

Sri P. SUNDARAYYA.- Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(సెకండరీ విద్యను 14—17 సంవత్సరాల వయస్సుగలవారిలో సూటికి 6 మందికి మాత్రమే అవకాశమున్ననూ, క్రొత్తపాఠశాలలు మరింత అదనంగా తెరవడానికి బదులు ఉన్నవానినికూడ కొన్నిటిని మూసి వేస్తున్నందులకు, సెకండరీ ఉపాధ్యాయుల జీతాలు పెంచనందుకు.)

Sri P. SUNDARAYYA:- Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by .. ... .. . Rs. 100

(చదువదలచుకున్నవారి కందరికీ, ఇంజనీరింగు, వైద్యము, ఇతరవృత్తి కళాశాలలలోను, తదితర యూనివర్సిటీ కోర్సులలోను ప్రవేశము దొరికేటట్లు సదుపాయాలు చేయజాలనందులకు )

Sri P. SUNDARAYYA - Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... .. ... ... Rs. 100

(స్త్రీవిద్య చాల వెనుకబడి ఉన్ననూ, దానిని అభివృద్ధి చేయడానికి తగిన కృషి చేయనందుకు.)

Sri K. V. S PADMANAPHA RAJU — Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(To discuss about the system of granting scholarships to poor students).

Sri D. GOPALA RAO :—Sir, I beg to move—

To reduce the allotment of Rs 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(To discuss about the starting of a Public School in the State).

Sri S. RANGANATHA MUDALIAR :—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(To discuss the absence of facilities for education of the Tamils of this State in their mother tongue).

Sri M. NAGI REDDI :— Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... .. ... Rs. 100

(గురజాల డిప్యూటీ యిన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు ఉపాధ్యాయులకు పెడుతోన్న ఇబ్బందులను, లంచగొండితనం గురించి చర్చించుటకు.)

VOTING OF DEMANDS FOR GRANTS—(Contd.)

DEMAND XV EDUCATION

[20th July 1955

Sri V. VISWESWARA RAO :—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... .. Rs 100

(ఎయిడెడ్ స్కూల్సు మేనేజిమెంట్‌ను ప్రభుత్వం స్వాధీనం చేసుకోక పోవడంను గురించి చర్చించుటకు.)

Sri V. VISWESWARA RAO :—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by .. ... .. ... Rs. 100

(నిర్బంధ ఎలిమెంటరీ విధానం ప్రవేశపెట్టజాలకపోయిన విషయంగురించి)

Sri B. RATNASABHAPATHY SETTY — Sir, I beg to move-

To reduce the allotment of Rs 5,23,16,700/— for Education by . ... .. ... Rs 100

(To discuss policy).

Sri B. RATNASABHAPATHY SETTY :—Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by .. ... ... ... Rs. 100

(To discuss the failure of the Government to implement the long pending Kuppuswamy Committee Report in respect of the Elementary Education, particularly regarding the improvement of the conditions of the Elementary School Teachers.)

Sri B. RATNASABHAPATHY SETTY:—Sir, I beg to move-

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(To discuss the failure of the Government to utilise the surplus funds in the religious institutions and charitable endowments for spreading mass education in the State).

Sri G. SURYANARAYANA —Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by . ... ... ... Rs. 100

(To discuss the failure of the Government to provide free education to all the citizens in the State at least upto the Middle School stage).

Sri B. P. SESHA REDDI :—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(To discuss the working and condition of the Elementary Education)

Sri G. NAGESWARA RAO :—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... .. ... ... Rs. 100

(సెంకడరీస్కూళ్ల అసౌకర్యాల విషయములోను, ఎలిమెంటరీ స్కూళ్ల ఉపాధ్యాయుల కష్టాల విషయములోను, ఎయిడెడ్ స్కూళ్ల మేనేజిమెంటు విషయంలోను, ప్రభుత్వ విద్యావిధానాన్ని చర్చించేందుకు )

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by .. .. ... ... Rs. 100

(7వ ఫారం హైస్కూళ్లలో ప్రారంభించడంతగదని.)

Sri VAVILALA GOPALAKRISHNAYYA .— Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by .. ... ... ... Rs 100

(గుంటూరులో లా కాలేజీ, ఇంజనీరింగు కాలేజీ యేర్పాటు చేయించమని.)

Sri S. VEMAYYA ·—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16,700/- for Education by ... ... ... ... Rs. 100

(ఇంగ్లీషు భాషలో ఒకటి రెండు మార్కులు తగ్గిన ఉత్తీర్ణుల చేయనందుకు.)

Sri A KALESWARA RAO :—Sir, I beg to move—

To reduce the allotment of Rs. 5,23,16.700/- for Education by ... ... ... .. Rs. 100

(విశ్వవిద్యాలయములో తెలుగు భాషలోనే సమస్తశాస్త్ర విజ్ఞానము నిచ్చుటకు తగిన ఏర్పాట్లు చేయుట )

Mr. SPEAKER .—The main Demand and the cut motions are now before the House for discussion

*Sri VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా, విద్యామంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ Education Demand కు వందరూపాయలు కోత ప్రతిపాదిస్తూ నేను చర్చ ప్రారంభిస్తున్నాను

మన ఆంధ్రరాష్ట్ర బడ్జెటు మొత్తములో కూడ దీనికి చాలా పెద్ద మొత్తము ఇస్తున్నామని మంత్రిగారు చెప్పారు. ఒకవేళ వారు చెప్పినట్లుగానే, రివిన్యూ బడ్జెటు వరకు చూస్తే, ఇది పెద్దమొత్తమే కావచ్చును కాని, ఆంధ్రరాష్ట్రం మొత్తం అభివృ

ద్ధిని గురించి, విద్యావిధానంలో వెనుకబడినటువంటి మనచరిత్రను మనము జ్ఞప్తి ఉంచుకొంటె, దీనికి కేటాయించిన మొత్తము ఒకమొత్తమే కాదు అని అనుకోవలసి వస్తుంటుంది ఉదాహరణకు, Travancore-Cochin State తీసుకోండి, అక్కడ ఏవీధికి వెళ్లినప్పటికి కూడా, ఎక్కడకు పోయినా, ప్రాథమిక పాఠశాలలు కనపడతాయి అక్కడ వందలకొలది, వేలకొలది విద్యార్థులుంటారు. నేను కుప్పుస్వామి కమిటీలో సభ్యుడుగా ఉన్నప్పడు, ఆ సందర్భంలో ఆప్రదేశము చూడడం తటస్థించింది. అక్కడ పాఠశాలలు చూస్తే, అసలు మన colleges కు కూడ అటువంటి buildings ఉంటాయా అని ఆశ్చర్యం వేసింది. అక్కడ వేలకొలది విద్యార్థులు ఎట్లాఉంటారని కూడ ఆశ్చర్యం వేసింది దీనివిషయం గురించి వారిని అడిగితే, ఆ పాఠశాలకు ఒకపూటే పిల్లలువస్తారు, రెండోవపూట వేరే set వస్తుంది. ఆవిధంగా ఏర్పాటుచేస్తేనే ఈవిధంగా ఉండగలము అని వారుచెప్పారు. ఆపరిస్థితులతో పోల్చి మన ఆంధ్రదేశాన్ని చూచుకొంటె, కొన్ని గ్రామాలలో అసలు పాఠశాలలే లేవు. ఉన్నవాటిలో తగిన సౌకర్యాలు లేవు. విద్యార్థులకు అంతకన్నా సౌకర్యాలు లేవు చదువు చెప్పుచున్న teachers కు మరీ సౌకర్యాలు లేవు మన Constitution లో కొద్దిసంవత్సరాలలో, అనగా 10 సంవత్సరాలలో, school going age children అందరు కూడా స్కూలునుంచి విడివడకుండా ఉండాలని, విద్యావిధానంలో మనం అభివృద్ధి కావాలని ఒక అంచనా వేసుకొని ఒక ప్రాతిపదిక ప్రారంభించారు. దానిని ఉద్దేశించి రాజగోపాలాచారి గారు ఇదిగో మేము మార్పుచేస్తున్నామని ఒక shift పద్ధతిని అవలంబించారు. అప్పుడే గవర్నమెంటు ఆ పద్ధతిని ప్రారంభించింది కాని ప్రజలెవ్వరుకూడ దానిని స్వీకరించలేదు ఆ విధానం ప్రవేశపెట్టినందుకు దేశములో ఉన్నటువంటి ప్రజలందరు ఎంతో ఆందోళనచేశారు. తత్ఫలితంగా ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత మన ప్రభుత్వము దీనిని పరిశీలించుటకు ప్రత్యేకంగా ఒక కమిటీని, కుప్పుస్వామిని అధ్యక్షులుగా ఏర్పాటుచేసింది ఈ షిఫ్టుసిస్టమ్‌ను ఆలోచించి, మరియొక విధానమేమైనా అమలు జరిపితే బాగుంటుందేమో అదికూడ సూచించవలసిందిగా ఈ కమిటీని కోరారు. ఆ కమిటీకి చాల తక్కువ time ఇచ్చారు. అయినప్పటికీ ఆ కమిటీ చాలా పెద్దకృషిచేసి ఒక విధమైన రిపోర్టు ఇచ్చింది. దానిని చాలామంది కూడ ప్రశంసించారు ప్రభుత్వముకూడా "మీరు unanimous report గనుక యిచ్చినట్లయితే మేము వెంటనే ఆలోచనకూడా లేకుండా ఆ శిఫార్సులను implement చేస్తామని హామి ఇచ్చింది బహుశా, ఈ కమిటీలో అన్ని పార్టీల వారు ఉన్నారు. బయట తగాదా పడినట్లే దీంట్లోకూడా తగాదాపడి ఒక unanimous report ఇవ్వలేరని అనుకొని ఈ విధంగా చెప్పారేమోనని అనుకొంటాను కాని ఆంధ్రులు ఒక constructive side కు వచ్చేటప్పటికి, ఉమ్మడిగా నిలబడి ఒక నిర్మాణవిధానంలో ఉండగలరు అని రుజువుచేయడానికి ఈ ప్రాథమిక విద్యావిధానం ప్రాతిపదిక అనే ఉద్దేశ్యంతోటి అందరుకూడ కలసి ఏకగ్రీవంగా అభిప్రాయం ఇచ్చారు. ప్రభుత్వానికి ఆ రిపోర్టు వచ్చింది వచ్చినవెంటనే ఆ రిపోర్టునుగురించి ఆలోచించడానికి time లేదని మొట్టమొదట చెప్పారు దానిమీద మాకు ఇంకా time ఇస్తారా అని అడిగితే, అది వెంటనే అమలు జరపాలి కాబట్టి time ఇవ్వలేమని అన్నారు. అందువల్ల ఈ రిపోర్టులో ముఖ్యమైనవాటిని వెంటనే

అమలుజరుపుతారని మేము అనుకొన్నాము రిపోర్టు ఇవ్వటం జరిగింది ఇచ్చిన వెంటనే shift system ఎత్తివేశాము అన్నారు దానితో మేము చాలా సంతోష పడి, ఈ కమిటీ సూచనలు అమలు జరుపుతారేమోనని ఆశించాము. కాని ఇది కాదు మేము అమలు జరుపబోయేది, పూర్వము ఏదైతే ఉన్నదో దానినే అమలు పరుచబోతున్నామని అన్నారు ఇంతకూ మనకు ఈ కమిటీ వేయ వలసిన అవసరమేమో అర్థంకాదు ఈ కమిటీయొక్క ఉపయోగమే లేక పోయిందన్నమాట రాష్ట్రోత్సవ సందర్భములో గత అక్టోబరులో సంజీవరెడ్డి గారు ఈ కమిటీగురించి మాట్లాడుతూ కుప్పుస్వామి కమిటీ రిపోర్టును మేము అంగీకరించాము అని రేడియో speech లో ప్రభుత్వము తరపున చెప్పారు. మేమంతా చాలాసంతోషించాము తప్పక అమలుజరుపుతారు అని అనుకొన్నాము. కాని ఏమీ అమలు జరుపకుండానే ఆ ప్రభుత్వము దిగిపోవడం తటస్థించింది. ఈ ప్రభుత్వము వచ్చిన తరువాత దీనిని ఆలోచిస్తామని చెప్పారు నిన్నటిరోజున ఈ రిపోర్టులోని 42 ప్రాతిపదికలు మీద మేము అంగీకరించాము అనిచెప్పి కరపత్రాన్ని ఇచ్చారు అసలు ఆలోచిస్తున్నాము అని, కొంతవరకు అంగీ కరించాము అని చెప్పినందుకు మొట్టమొదట గవర్నమెంటువారిని అభినందించవల సిన అవసరమున్నది అయితే వీరు 42 విషయాలలో అంగీకరించారు అని అంటు న్నారేగాని, అవన్నీగూడ చాలా చిన్నవిషయాలు ఏదైతే ఈ విద్యావిధానానికి ప్రాతిపదికయో, ఏదైతే దానికి జీవమువంటిదో, అది మినహాయించి తక్కినవన్నీ ఒప్పుకొన్నాము అన్నారు ప్రస్తుతము ఈప్రాథమిక విద్యావిధానము ఏవిధముగా ఉన్నదో ముఖ్యముగా అందరు గమనించవలసి యున్నది. ఈనాడు మనరాష్ట్ర ములో ప్రాథమికవిద్య అనేది అనేకమైనటువంటి మేనేజిమెంటుల క్రింద ఉన్నది. అనేకపద్ధతులలో ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. వీళ్లజీతాలు కూడ అనేక విధాలుగా ఉంటున్నవి అందువల్లనే కుప్పుస్వామి కమిటీ ఒక విధానాన్ని సూచిం చింది వారు సూచించినటువంటి విధానమునకు Integrated Scheme of Education అని పేరుపెట్టడం కూడ జరిగింది విద్యార్థులు చదువుకొనే పద్ధతులలో గాని,curriculum విషయంలోగాని,అన్ని విషయాలుచూచి,మనకు integratedగా ఒక సమగ్రమైనటువంటి ఒకే ఒక విధానం ఉండాలనే ఉద్దేశ్యంతో ఆ కమిటీ ఆవిధంగా ఒక సమగ్రమైనటువంటి విధానాన్ని సూచించింది దానికిగాను తాలూకా కమిటీలు ఏర్పడాలని, అవి ప్రభుత్వ యాజమాన్యమున నడవాలని, దానికి కావలసిన సభ్యులను వేసుకోవలసి యుంటుందని, aided schools గాని; labour schools గాని, జిల్లాబోర్డు schools గాని, అన్నీకూడ గవర్నమెంటు తీసుకొని, వారి management క్రిందనే ఇవి మొత్తంగానడవాలని చెప్పారు ఇది ఏకగ్రీవంగా చెప్పడం జరిగింది ఈసూచన బాగా ఉన్నదని అందరు హర్షము చూపించారు. కాని ప్రభుత్వము అన్నిటికంటె ముఖ్యమైన ఈవిషయాన్ని వదలి పెట్టి, 80 points లో 48 ఒప్పుకొన్నామని చెపుతున్నారు రెండవది జీతాల విషయం గురించి సూచించబడినది అసలు ఈవిషయం గురించే ఆందోళనవచ్చింది. దానినుండే ఇదంతావచ్చింది. విద్య నేర్చుకొనేటటువంటి విద్యార్థికి ఉపాధురావలె నంటె చదువు చెప్పేటటువంటి ఉపాధ్యాయునికి కూడ ఉపాధుఉండాలి. కనుక

అతని తిండికి కూడ మనంకొంచెము అవకాశమివ్వాలి ఉన్నదాంట్లో అవకాశం చూచి ఇవ్వవలసిఉంటుంది అందువలన Higher Grade teacher కు 30 రూపాయలు ఇస్తూఉంటే, మేము మొత్తం 35 రూపాయలు ఇవ్వాలని recommend చేశాము అది అమలు జరుపుతారనే ఆశ చాలాఉండబట్టే ఆ రిపోర్టు ఏకగ్రీవంగా వచ్చింది లేకపోతే ఈవిధంగా వచ్చేదికాదు ఏవిధంగా అయినా సరే విద్యావిధానములో మార్పు తీసుకురావలసిన బాధ్యత మనపై ఉన్నది అని ఆరోజు మేమందరు అనుకొని ఆవిధంగా ఏకగ్రీవంగా సూచించాము ఆరిపోర్టు ప్రభుత్వానికి వచ్చిందిగాని, అది అమలు జరుపబడలేదు మద్రాసు ప్రభుత్వము ఈప్రాథమిక ఉపాధ్యాయులకు 2, 3 రూపాయలు ఇటీవల హెచ్చించారు అందుకని ఇక్కడి ఉపాధ్యాయులు "మేము మద్రాసులో ఉన్నా మాకు అదివచ్చి ఉండేది ఇక్కడ అదికూడ లేకపోయింది ఏదో ఇక్కడ ఐదు రూపాయలు ఎక్కువ వస్తుందని అనుకొన్నాము, ఏమిరాలేదు అని చాలా నిరుత్సాహంతో ఉంటున్నారు మన దేశంలో విద్యావిధానం చాలా ముఖ్యమైనటువంటిదని, ఇది దేశీయ సమస్యగా తీసుకొని, ఇందులో సరియైన మార్పులు తీసుకొనిరావలసిన అవసరమున్నదని కమిటీలో అందరు ఉత్సాహంతో పనిచేసి ఏకగ్రీవంగా ఒకసమగ్రమైనటువంటి రిపోర్టు ఇవ్వగా, దాంట్లో ముఖ్యమైనది విడిచిపెట్టి 48 points ఒప్పుకొన్నామని మీరు అంటున్నారు ఉపాధ్యాయులకు గాని, విద్యార్థులకుగాని ఏమి ఉపయోగంలేకుండాపోయింది ఇక మాకు మిగిలింది చీవాట్లు మాత్రమేనని మనవి చేస్తున్నాను ఆ కమిటీ steps తీసుకున్నప్పుడు, వాటిని ప్రభుత్వము అమలు జరపటానికి వీలులేదని చెబుతున్నది Basic education విధానంతో మాకు సంబంధంలేదు అందువల్ల దాన్ని మేము ముట్టుకోలేదు కాని వ్యవసాయం విధానంలోగాని, యింజనీరింగు విధానంలోగాని విద్యార్థులకు చదువుచెప్పే పద్ధతిలోగాని మార్పులు సూచించడం జరిగింది. ఆతరువాత free primary education వున్నది విద్యాబోధనకు ముందుగా, ఒకటవ తరగతిలో చేరేముందు కూడా కావలసిన విధానం కూడా సూచించాము పాఠశాలలు పెట్టమని చెబుతున్నాము. కాని అదిగూడా ముట్టుకోలేదు ఆతరువాత టీచర్లకు యివ్వవలసిన జీతాలు చూద్దామా అంటే, అవి యివ్వలేదు Education విధానం అంతా యీ విధంగావున్నది. వారు యిచ్చిన సూచనలు యేమిటంటే, Deputy Inspector గారిని తాలూకా కమిటీకి సెక్రటరీగా వుండడానికి మేము ప్రభుత్వంవారు ఒప్పుకున్నామని అన్నారు అయితే కమిటీని మాత్రం వారు ఒప్పుకోలేదు, అయితేలేని కమిటీకి సెక్రటరీగా ఎట్లా ఉంటారో అది నాకు అర్థము కావడంలేదు. దీనికి డబ్బు ఎక్కువఅవుతుందని చెబుతున్నారు డబ్బు ఎక్కువకాదని నేను చెబుతున్నాను ఎందుకంటే ఆరోజునకూడా విద్యాశాఖా డైరెక్టరు కూడా దీనిలో మెంబరుగా వున్నాడు ఆ తర్వాత Education Department గూడా ఈ కమిటీ రిపోర్టు వ్రాసేటప్పుడు అందుబాటులోవుంది వారితోగూడా చర్చించారు చర్చించినప్పుడు మొత్తము immediate గా అయితే ఎంత అవుతుంది, ultimate గా ఎంత అవుతుంది, అని అడిగితే, అప్పుడు లెక్కలు వేయగా దానిలో తేలింది. జీతాలు ఎక్కువ చేసినందువల్ల రు 27, 70, 000 లు immediate గా

అవుతుందని ఆరిపోర్టులో చేవున్నది ఇప్పుడు నేను చదివేది యీ రిపోర్టు 124 వ పేజీలో వున్నది Ultimate గా 64 లక్షల రూపాయలు అవుతుందని యిందులో వ్రాసివున్నది కాని దాన్ని యింతవరకు అమలు జరపకం జరగలేదు పాఠశాలలన్నీ ప్రభుత్వము తీసుకుంటే 83 లక్షలు Dearness allowanceకూడా కలిసినా దాదాపు 50 లక్షలకన్నా ఎక్కువ ఒక్క ...యాభై లక్షలవల్ల ఎంతమార్పు ...ది ? ఈ రోజున 48% నుంచి 61% వరకు కొన్నిజిల్లాలలో బడికి విద్యార్థులు వెళ్ళుచున్నారు. ఇంతేకాకుండా నూటికి నూరుమంది బడికి వెళ్ళగలిగినవారు స్కూల్సులో వున్నరోజున, అన్ని క్లాసులలో విద్యార్థులు సమానంగా ఉండి, ఏవిధంగాను wastage లేకుండా ఉండేపద్ధతిన, వారికి కావలసిన రెండుపూటలు గూడా నడిపేపద్ధతిలో వేసిన estimation ప్రకారం లెక్కవేస్తే, అప్పుడు పెద్దమొత్తం అవుతుంది కాని, లేకపోతే కాదు. నేనుప్రభుత్వాన్ని అడిగేదేమిటంటే, మీరు యీరోజునడబ్బు ఎక్కువ అయింది కాబట్టి, మేము పెట్టలేము అంటే, మీరువేసిన estimates ఏవో మా ముందుపెట్టండి మమ్ములను పరిశీలించనివ్వండి. ఆ రోజున ఆ ప్రభుత్వము వేసిన అంకెలకున్నూ, యీనాడు యీప్రభుత్వము వేసిన అంకెలకున్నూ తేడావస్తే, ఎందుకు వచ్చిందో బోధపడుతుంది కాదు అని అంటే teachers కు, ప్రతితడవ మీరు ఆశపెట్టుతున్నారు అక్కడ మేనేజిమెంటుచూస్తే ఆవిధంగా జరుగుచున్నది. Managements లో Missionary management గూడా వుంటున్నది Missionary management లో అంతావారిదే మొనాపలీగావున్నది. వారు జాగ్రత్తగా వారిదివారు తీసుకుంటూరు టీచర్లకు వారు జీతాలు యెంత యిస్తున్నారో ఎవరికీగూడా తెలియదు వీరికి ఎంతవస్తుందోగూడా మనకు తెలియదు కాని టీచర్లకు జీతాలుయిచ్చేటప్పుడు పదిరూపాయలు చేతిలోపెట్టి 25/రూ॥లకో ముప్పది అయిదు రూ॥లకో సంతకము పుచ్చుకుంటూరు. ఆతరువాత Municipal schools, District Board schools వున్నవి. District Board school వున్నచోట ఒక aided school గూడా వుంటే, పిల్లలపేర్లు మటుకు అందులోనూ వుంటుంది, యిందులోనూ వుంటుంది. కాని పిల్లవాడు అక్కడికివెళ్లడు, యిక్కడికి వెళ్లడు. డిప్యూటీ యినెస్పెక్టరు వెళ్లినప్పుడు మాత్రం రెండుచోట్ల వారి పేర్లు చూపించబడుతున్నవి. కనుక యీ విధానం అంతా ఒకటే పద్ధతితోటి నడిస్తే, ప్రస్తుత విధానంలోవున్న చిక్కులు అవకతవకలు లేకుండా, over lapping లేకుండా, missing లేకుండా జరిగేపద్ధతితో జరిపితే మంచిది. ఈరోజున చాలా డబ్బు waste చేస్తున్నారు.

Missionaries భయపడరు అని మీరు అనుకోవచ్చు. Travancore లో జరిగింది నాకుతెలుసు మేము recognition యివ్వము, మీరు కావాలంటే స్కూళ్లు పెట్టుకొండి అని ప్రభుత్వము అనేటప్పటికి, వాళ్ళులొంగివచ్చి దానో హం అని అన్నారు. కనుక మిషనరీలు భయపడరని అనుకో నక్కరలేదు.

ఈ రోజులలో స్వతంత్రంగా స్కూళ్లు నడుపుకుంటామని అంటే, అందుకు మనకు అభ్యంతరము వుండనక్కరలేదు ప్రభుత్వానికి ఒక పద్ధతి అనేది ఉండాలి కొందరు దీన్ని వ్యతిరేకించారు మీరు dictatorial సిద్ధాంత రీత్యా విద్యా విధానం తీసుకొని రాబోతున్నారు ప్రభుత్వమే యీ విద్యా విధానం అమలు జరిపితే, private institutions నడపటానికి వీలులేకుండా, ఒక dictatorial set up లో అమలుజరిపితే, అది మరల ఆ హిట్లర్ విధానం, ఆ రాజ్యం మరల మీరు తీసుకొనివస్తున్నారా అని చెప్పేవారుకూడా ఉన్నారు. కాని ఆ రోజు ఎందుకు బాధ్యత తీసుకొన్నామంటే, యీ పద్ధతి పెట్టకపోతే, యీ రోజున వున్న విద్యా విధానంలో చాలా చిక్కులువున్నవి వాటికి సరాసరి ఒకే మేనేజిమెంటుతో పాఠశాలలు నడపడమే గత్యంతరంగా తోచింది ఇది అమలు జరపాలంటే, డబ్బు ఎట్లా వస్తుందని అన్నారు. దానివిషయము ఆలోచించినప్పుడు Text books అన్నీ అచ్చువేస్తే కొంతడబ్బు వస్తుందని అనుకున్నాము ఆరు లక్షలనుంచి ౬౦లక్షల వరకూ రావటానికి వీలువున్నది Elementary schoolsలో, District Board schoolsలో, అక్కడ ఎవరైనా ఒకరువుండి స్కూళ్లవారిని బ్రతిమిలాడుకొని పుస్తకాలషాపు పెట్టుకొని అమ్ముతాడు. యిది ఒక వ్యాపారంగా పోతున్నది. జిల్లాబోర్డు అధికారులు మూడు సంవత్సరాలు అయిన తరువాత ఆ పుస్తకాలు తీసివేస్తారు. ఆ తరువాత వేరే పుస్తకాలు పెట్టుతారు యీ విధంగా చేస్తూవుంటారు కనుక అటువంటి విధానము అక్కరలేదని అన్నాము అందు కని యీ రోజున రిపోర్టులో వారు చెప్పిన దేమిటంటే, దానికోసము ఒక కమిటీని వేశామని అన్నారు ఈ విధంగా కమిటీల మీద కమిటీలు ఎన్నిరోజులు జరిగేటట్టు? ఈనాడు భారతదేశానికి సంబంధించిన మన సిద్ధాంతము మన జీవితము, మన పద్ధతిలో వచ్చేదానికి తీసుకొని వచ్చిన రిపోర్టుయిది. దీన్ని అమలు జరగటానికి వెనువెంటనే ఒప్పుకోమని అంటున్నాను ఏదైనా అనుమానాలు వుంటే, ఒక రోజున ఎదైనా ఒక ప్రాతిపదిక తీసుకొనిరాండి చర్చకు పెట్టండి, అందులో ఎదైనా భేదాభిప్రాయాలు తీర్చుకొనవచ్చును ఇంకా ఎవరైనా contributions యిచ్చేవారువుంటే వారుకూడా యీ చర్చలకు రావడానికి అవకాశం వుంది. అందువల్ల కుప్పుస్వామి రిపోర్టును వెంటనే అమలు జరపాలని చెబుతున్నాను.

ఆ తరువాత ముఖ్యంగా హిందీ విషయము వున్నది. దీన్ని నిర్బంధంగా తీసుకొని వస్తున్నారు, అది నిర్బంధమో, అనిర్బంధమో, తరువాత ఆలోచించ వచ్చును S. S L. C. వరకూ తెలుగులో నడుపుతున్నాము Intermediate లో దాకా వెళ్లితే, అక్కడ అన్నీ technical terms ఇంగ్లీషులో వస్తూన్నవి. అక్కడకు వెళ్లిన తరువాత యేమి చేయాలో అర్థము కావడము లేదు. మేము పూర్వము మూడవ తరగతి చదువుకునే టప్పుడు Duncan Geography తో ప్రారంభించే వారు. పైకివెళ్లిన తరువాత భాష విషయంలో యిబ్బంది వస్తుందని, college students [illegible] భాగంగా తీసుకోవలసిన అవసరము వున్నది [illegible] వేయాలి ఈ విషయంలో మాతృభాషు

గవర్నమెంటులోని విద్యాశాఖా మంత్రి, యింకను లక్షణస్వామి మొదలియారు వారి స్వంత అభిప్రాయాల నిచ్చారు వారు చాలా పట్టుదలతో పనిచేస్తున్నారు. అందుకు నేను వారిని అభినందించవలసివుంది. కాబట్టి దీన్ని వెంటనే అమలులోకి తీసుకొని రావలసిందిగా కోరుచున్నాను.

* Sri S. BRAHMAYYA :— మాననీయ అధ్యక్షా, గౌరవ విద్యాశాఖామాత్యులు ప్రవేశపెట్టిన యీ డిమాండును నేను బలపరుస్తున్నాను. విద్యాశాఖామాత్యులు 5,23,16,700 రూపాయలకు బడ్జట్ డిమాండు విద్యకుగాను కోరారు. ఇది సంతోషదాయకంగా ఉన్నది ఉమ్మడి మదరాసు రాష్ట్రంలోకూడ విద్యనిమిత్తం కేవలం 11 కోట్ల రూపాయలు మాత్రం ఖర్చుపెట్టబడుతూ ఉండేది. ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రానికి ఇంతమొత్తం వెచ్చించడంలో సంతోషించతగ్గ విషయమేగాని, విమర్శించతగ్గ విషయంకాదు ఎందుకంటే, ఏరాష్ట్రమైనా ఒకేపర్యాయము స్వర్గానికెగరలేదు. చాలామందికి విద్యనిమిత్తంగా ఈ మొత్తము చాలా తక్కువగా చూపబడింది అని ఉద్దేశ్యము వుండవచ్చు నాకు ముందుమాట్లాడిన గౌరవసభ్యులు గోపాలకృష్ణయ్యగారు ఇది ఆశాజనకంగా లేదని అన్నారు. తరువాత కుప్పుస్వామి కమిటీ రిపోర్టుతోపాటు తిరువాన్కూరు, కొచ్చినులో ఆయన పర్యటన సల్పి అక్కడవున్న ప్రాథమిక విద్యావిధానాన్ని చక్కగా బోధపరుచుకున్నట్లు చెప్పాడు. నేనుగూడ కేవలం ఈ కమిటీరూపేణ కాకపోయినా మరొకవిధంగానైనా ఆతిరువాన్కూర్, కొచ్చినులోని రెండు ప్రదేశాలలోపర్యటన చేయటం సంప్రాప్తించింది అక్కడి విద్యావిధానం నాకు తెలుసును. మొట్ట మొదటినుంచి వారు ఒక ప్రాతిపదిక వేసుకొని విద్యనిమిత్తంగా అభివృద్ధికరమైన విషయాలు ముందుగా ఆలోచనచేస్తూ క్రమంగా దానిని ముందుకు తీసుకొచ్చారే గాని ఒక్కపర్యాయంగా కాదు. మనకు సాతంత్ర్యం సిద్ధించిన యీ కొద్ది తరుణంలో వారు ఈ ప్రాథమిక విద్యావిధానము అంతాఒక్కసారి పైకితెచ్చిన విషయం కాదని నేను ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను. గౌ॥ గోపాలరెడ్డిగారు విశ్వవిద్యాలయాలకు, కళాశాలలకు 44,14,000 రూపాయలు, ఉన్నతవిద్యకు, సెకండరీ ఎడ్యుకేషను నిమిత్తంగాఉన్న 600 పాఠశాలలకు 44 లక్షల పైచిల్లర, తరువాత ప్రాథమిక విద్యనిమిత్తం 234 లక్షల పైచిల్లర, ఇంకా ఇతర అభివృద్ధి ప్రణాళికలక్రింద ప్రత్యేక పాఠశాలలకు 140 లక్షల రూపాయలు కోరుతున్నట్లు యీ బడ్జటు డిమాండును బట్టి స్పష్టమైంది ఈ విధంగా వారు విద్య నిమిత్తమై చూపించిన ప్రోత్సాహము సంతోషాజనకంగా వున్నదని చెప్పక తప్పదు.

ఇదేవిధంగా హిందీనిమిత్తం చూపించినటువంటి ప్రోత్సాహంకూడా సంతోషకరంగానే వున్నదని చెప్పకతప్పదు ఈ సందర్భంలో మీకు ఒక విషయం మనవి చేయదలచుకున్నాను అది ఈ దేశం అంతటిలోనూకూడా ఆందోళన చెందబడుతూన్న హిందీ నిర్బంధంగా బోధించాలనే విషయము. కొంతమంది హిందీనిర్బంధానికి వ్యతిరేకంగా మాట్లాడియుండవచ్చు. మన రాష్ట్రప్రభుత్వము ఈ దేశంలో వున్న పరిస్థితులన్నీ గమనించి ఈ సంవత్సరమునుంచి హిందీని నిర్బంధముగా బోధించడానికి ఆర్డర్సు ప్యాసుచేసి పంపించింది అందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. ఈ నిర్బంధం చేయడంలో పూర్వపు పద్ధతిగానే ఈ హిందీని కేవలం రెండు

పీరియడ్లుగా సేవుంచారు. ఇది సరియైనదికాదని దీనికి తగిన స్థానము ఇవ్వలేదని నా అభిప్రాయం హిందీకి వారము మొత్తముమీద రెండు పీరియడ్లు 1½ గం॥లు కేటాయించారు ఆవిధముగా నెలకు 6 గం॥లు చొ॥న సంవత్సరమునకు బడి వుండే 9 మాసాలకు 54 గంటలు అవుతుంది. మొదటిఫారమునుంచి ఆరవఫారమువరకు మొత్తం 324 గంటలు హిందీబోధన జరుగుతోంది. మొత్తం ఈ హిందీ నిమిత్తం 18½ రోజులు మాత్రం మనప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణీతకాలము హిందీ నేర్చుకోడానికి చాలదు. హిందీని మనము అంతా నేర్చుకోవలసిన అవసరము ఉన్నది. మనదేశానికి స్వాతంత్ర్యము సాధించేముందుకూడా ఈ దేశంలో ఒక సార్వజనికమైన భాష ఉండాలని చెప్పాం. స్వాతంత్ర్యము సిద్ధించిన వెంటనే మన రాజకీయ చట్టము 26-1-1949 న 343 వ నియమాన్ని అనుసరించి హిందీ రాజభాషగా పరిగణించబడింది. హిందీ రాజభాషగా పరిగణింపబడిన తరువాతకూడా మన రాష్ట్రములో హిందీ విషయంలో తగు శ్రద్ధ తీసుకోకపోవడము చాలా విచారకరమైన విషయము. మనదేశానికి స్వాతంత్ర్యము వచ్చినపిమ్మట 28 రాష్ట్రాలుగా విభజించబడింది 28 రాష్ట్రాలలోనూ 18 రాష్ట్రాలలో కేవలం హిందీ మాతృభాషగానే వున్న సంగతి అందరికి తెలిసిందే. ప్రతిపక్ష నాయకుడు సుందరయ్యగారు మొదటిఫారంకునిర్బంధంచేసే విషయంలో వ్యతిరేకంగా మాట్లాడబోతున్నారు. మొన్నటివరకు పార్లమెంటు సభ్యులుగా వున్నటువంటివారు, వారు మాట్లాడిన తరువాత నాకు అవకాశం వస్తుందని అనుకొన్నాను గాని ముందుగానే వచ్చిన కారణంచేత, దేశంలోవున్న పరిస్థితులన్నీ గమనించి మాట్లాడవలసిందని వారికి మనవిచేస్తున్నాను. భారతదేశము మొత్తము 28 రాష్ట్రాలు, 12,20,500 చదరపుమైళ్ళ దూరముకలిగి 36 ,12, 40,000జనాభాతోకూడుకొని యున్నది భారతదేశంలో 18 రాష్ట్రాలలో హిందీ మాట్లాడబడుతున్నది, మాతృభాషగాకూడా పరిగణింపబడుతోంది ఈ 18 రాష్ట్రాలకును 8, 66,500 చదరపుమైళ్ళు విస్తీర్ణం కలిగి 23, 12,00,000 జనాభాచే హిందీ మాట్లాడబడుతున్నది పోతే మిగిలిన రాష్ట్రాలు ఇటు గుజరాతు, బెంగాలు, అస్సాము, ఒరిస్సా, ఈ ప్రాంతాల్లోకూడా మాట్లాడబడేటటువంటి ప్రాంతీయ భాషలు హిందీకి సన్నిహితంగా వున్నాయి. ఇంకా అయిదు రాష్ట్రాలు మిగిలినవి తిరువాన్కూరు-కొచ్చిన్, మద్రాసు, ఆంధ్ర, మైసూరు, కూర్గు- ఈ రాష్ట్రాలు మిగిలిపోయినాయి. ఈ అయిదు రాష్ట్రాలు చేరి 1,62,000 చదరపుమైళ్ళ విస్తీర్ణము కలిగివున్నవి 7,55,00,000 జనాభా వున్నది. మొత్తం36 కోట్లలో, 7 కోట్ల జనాభామాత్రమే హిందివిషయంలో ఎక్కువశ్రద్ధ తీసుకోవడములేదు. కేంద్రప్రభుత్వముకూడా ఆందోళనచేస్తే వెంటనే తగుశ్రద్ధ తీసుకోవలసిందిగా హెచ్చరిక చేయడము జరుగుతుంది. కేంద్రప్రభుత్వం హిందీ అభివృద్ధికై తగినంత ధనము ఇవ్వడానికి సిద్ధంగావుందని ఎప్పటికప్పుడు పత్రికా ప్రకటనలుకూడా వస్తున్నవి. మన రాష్ట్రానికికూడా కొంత కేటాయించి వున్నారని నా అభిప్రాయము. గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు విద్యాశాఖా మంత్రిగారుకూడా కాబట్టి వారు ఇటువంటి మొత్తాన్ని మురిగిపోనీయకుండా సద్వినియోగము అయ్యేట్లు చూచేటట్లయితే చాలా సంతోషించదగిన విషయము. గౌరవనీయులైన గోపాలరెడ్డిగారు దక్షిణ భారత హిందీ ప్రచార సంఘపాలక వర్గంలో సభ్యులును, ఆంధ్రరాష్ట్ర హిందీ

ప్రచార సంఘానికి అధ్యక్షులుకూడా అయివున్నారు. అందువల్ల వారికి హిందీ విషయము తెలియనటువంటిదికాదు వారికి హిందీలోకూడా ప్రవేశము వున్నది. వారు హిందీ విషయంలో ఎంతైనా శ్రద్ధ తీసుకోవలసిన అవసరము వున్నది. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలోకూడా హిందీ దినదినాభివృద్ధి చెందుతున్నది సంవత్సరానికి 5 విశారద విద్యాలయాలు, 3 ప్రచారక విద్యాలయాలు స్థాపించి దాదాపు 50 వేల రూపాయలు సంవత్సరానికి ఈ హిందీ వున్నత విద్యావ్యాప్తికై ఖర్చు పెట్టబడుతున్నది ఇటువంటి హిందీసంస్థలకు తగినంత విరాళాలుఇచ్చి ప్రోత్సహించాలి. ప్రస్తుత బడ్జెటులో దురదృష్టవశాత్తు హిందీకి అసలు స్థానం కల్పించలేదు. ముందు బడ్జెటులో అయినా తగిన స్థానం కల్పిస్తారని ఆశిస్తున్నాను. స్థానిక సంస్థలద్వారా కూడా ప్రేమమండలికి విరాళము యిప్పించి, హిందీ ప్రచారానికి పూనుకోవాలి అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు ఈవిషయంలో పెద్ద ఆందోళనను ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చింది అప్పుడు విద్యాశాఖా మంత్రిగా వున్నటువంటి పట్టాభి రామారావుగారు దీనివిషయం ప్రభుత్వముకు తలపెట్టబోతున్నది రచయితలు, కవులు, పండితులు ఎవరుకూడా ఈవిషయంలో కలుగచేసుకోవలసిన అవసరం లేదన్నారు. బెజవాడలో 4, 5 గురు కవులతో సమావేశమై దానినిగురించి చర్చించి, ఆవిషయాన్ని ఎక్కడో తేల్చి విడిచిపెట్టేశారు. దానినిగురించి మరల ఎవరు తలపెట్టలేదు అది చాలాఅవసరం కవులు జీవించి వున్నంతకాలం కూడా వారిని మనము మృతజీవులుగా చూస్తాము వారుజీవితం చాలించిన తరువాత మృతజీవులుగా పరిగణిస్తాము. ఇటువంటి విషయములో మేమేకాకుండా అన్నిరాజకీయ పార్టీలు కూడా అవకాశం తీసుకుంటున్నారు వీరేశలింగం వర్ధంతి ఉత్సవాలు, గిడుగు రామమూర్తి పంతులు వర్ధంతి వుత్సవాలు, యింకా గొప్పగొప్ప కవుల వర్ధంతి వుత్సవాలు అన్నీ ప్రతికక్షులు చేస్తున్నారు. ఈ రాజకీయ పార్టీలు అన్నీ కూడా, ఇటువంటి అవకాశాలను చేజిక్కించుకొంటున్నారు. సాహిత్యపరిషత్తును స్థాపించి తద్వారా ఈ తెలుగు భాషలో ఉండేటటువంటి విశిష్టతను, మనయొక్క సారస్వతాన్ని, మనయొక్క ప్రాచీనసంస్కృతిని వెదజల్లాలి మనభాషలో చక్కని పుస్తకాలను ఇతరభాషల్లోకి తర్జుమా చేయించవలసిన అవసరము వుందని నేను మనవిచేస్తున్నాను కవులను ప్రోత్సహించవలసిన బాధ్యత మనయందున్నది. రచయితలను ప్రోత్సహించవలసిన ధర్మము కూడా మనయందున్నది

* Sri S RANGANATHA MUDALIAR :—Mr. Speaker, Sir, the one object of mine in moving my cut motion is to remind Government of the existence of the powerful minority of Tamils in the border areas in this State numbering 3,28,679 according to the census figures of 1951 census. These Tamils, this powerful minority of Tamils are entitled to the fundamental rights adumbrated in Articles 29 and 30 of the Indian Constitution. Government know too well what these Articles are provided for and so I do not want to quote them here. One of the recommendations of the Kuppuswami Committee as approved by this Government is that for citizens, whose mother-tongue is other than Telugu,

the existing facilities for education should continue and provision also should be made for trained teachers in these subjects by creating scholarships. The Hon Chief Minister in paragraph 4 of his written budget speech has made the following observation :

> "There are Telugu-speaking people contiguous to our borders and let us hope they will come under the same administrative set-up ere long. At any rate we would like all Telugu-speaking people to have reasonable facilities for their education and employment."

One can appreciate the solicitude of the Chief Minister for the Telugus outside the Andhra State But my question is why not the same solicitude for the three and a half lakhs of Tamilians living within the State in the border areas, why such solicitude has not been shown ? Is it because the Chief Minister expects the Tamil-speaking people in the border areas are likely to go away to the Tamil administrative set ap Except on such assumption the omission on the part of the Chief Minister of any reference to the Tamils in this State is otherwise ununderstandable How I wish he had made such reference to them by way at least of recognising their existence ! How much would it have, to quote the words of the Chief Minister himself, "removed the animosity and suspicion existing at present among the Tamilians"! Whenever I approached the Ministers for anything, for the redressal of any grievance of the Tamils, they are uniformly kind and courteous, and the Chief Minister would say "Aloochikkapadum"; the Deputy Chief Minister would say, "Look here, Mr. Mudaliar, I will hereafter speak to you in Tamil." It is indeed a very good gesture. But mere kindness and mere gesture won't do. What is the use of killing one with kindness ? Murder is murder whether one is killed by kindness or by violence Therefore I want on behalf of the three and a half lakhs of Tamilians an assurance on the floor of the House by the Chief Minister that the fundamental rights provided by Articles 29 and 30 of the Indian Constitution and the proposals recommended by the Kuppuswami Committee will be implemented, that the fundamental rights will be safeguarded and the educational and cultural facilities of these Tamilians will be looked after without discrimination or partiality. The particular areas where the

majority of the people are Tamilians are Chittoor, Vellamur and Veppancheri firkas of Chittoor taluk, Tiruttani taluk, Puttur, Nagari and Narayanam firkas of Puttur taluk and the border areas of Palamaner and Kuppum taluks. My demand is simple and the needs of the Tamilians are simple, What I want is that there must be at least two Tamil sections in each class in every high school at Chittoor, Pakala, Tirupathi, Puttur, Tiruttani, Palamaner and Kuppam The district boards must be directed to open a Tamil section in every standard in the elementary school managed by them. A similar direction should be issued to the managers of aided schools The Chittoor Municipality is yet to implement the two-year old resolution of the Council to open a Tamil Section in each standard of the elementary, middle and high school run by that Municipality. Another great desideratum is a Tamil Training School There is a Government Training School in Chittoor, but only a temporary provision is made for the admission of Tamil pupil-teachers in the elementary grade. That is only temporary. Every year the lease of its life is extended, and repeated representations for the opening of a secondary section for the Tamil pupil-teachers of the Government schools have fallen flat on the ears of the authorities. But on my representation to the Chief Minister, he has, however, promised and I think he has since passed orders for the opening of a Tamil Section in the secondary grade in the Government Training Schools, by which act of kindness he has placed the entire Tamil population of this State under a deep debt of gratitude. I am also thankful to the Minister for his kind promise to consider my suggestion that a Tamil section will be opened for the training of Tamil Teachers in the basic school proposed to be opened at Karvetnagar. The difficulties experienced by Tamil students will decrease to a considerable extent if the Government is pleased to pass orders for the opening of junior section in the Proddatturpet Training School. The Madras Government has come forward with the generous offer of grant of stipends and also proportionate grant for such students as may join that school from the Madras State. The difficulty is in regard to the opening of junior sections in that school and it is said to be connected with some defects in the management. I would submit that if the Government are pleased to pass order

the Board of Trustees managing that school will see to it that the difficulties, if any, in the administration will be rectified These are all the needs of the Tamils of this State, and I pray Government be pleased to consider them and they are all granted without discrimination or partiality Thank you, Sir

* 12-30 p m Sri K SUBBA RAO - అధ్యక్షా, ఆరితేరిన ఆర్థిక మంత్రులు విద్యామంత్రులుగా ఉండడము ఆంధ్రుల అదృష్టము అంతేగాక వారు లలిత కళా ప్రియులుకూడా వారి చేతిలో ఆంధ్ర ప్రజలయొక్క విద్యావినయ సంపత్తి సర్వవిధాల అభివృద్ధి పొందునని ఆశించుచున్నాను విద్య అనేక రకములు కాని విద్యయొక్క పరమార్థమును గుర్తించి దానిని అభివృద్ధి పరచుటకు ఎన్నో ప్రయత్నాలు చేయవలసి యున్నది విద్యయొక్క పరమార్థము అందము, అర్థము, ఆనందము అన్నారు పెద్దలు ప్రజలను బలవంతులను చేసి బుద్ధిమంతులను చేసి విజ్ఞాన వికాసంలో అభివృద్ధికి కావలసిన ప్రయత్నములకు ఎంత డబ్బు వెచ్చించినప్పటికి వృథాపోదని, భవిష్యదాంధ్రం దేశాన్ని తీర్చిదిద్దగలబాధ్యత వారిపైన ఉన్నదని గుర్తించి వారు యీ విద్యాశాఖకు ఎంతడబ్బు అయినను ఖర్చు పెట్టడానికి వెనుదీయరని ఆశించుచున్నాను.

ప్రాథమిక విద్య విషయమై, లేక ఇతర విద్య విషయమై అనేక కమిటీలు వేసినారు. కుప్పుస్వామి కమిటీ వేసినారు. సెకండరీ ఎడ్యుకేషన్ కమిటీ ఉన్నది యూనివర్సిటీ ఎడ్యుకేషన్ కమిటీ ఉన్నది. అన్ని కమిటీల రిపోర్టులను గురించి దినదినము చర్చించకుండా వాటి సిఫార్సుల, రహస్యము, స్వారస్యము గుర్తించి వెంటనే ముఖ్యముగా ప్రాథమిక విద్య విషయములో తగు జాగ్రత్త వహించవలసినదని నేను వారిని ప్రార్థించుచున్నాను ప్రాథమిక విద్య 1, 2, 3, 4, తరగతులకే గాక, బేసిక్ విద్యావిధానములో ఆధార విద్యా కేంద్రములను పెట్టించి దానికి తగినటువంటి విద్యా ప్రబోధము చేయవలసిన బాధ్యత ఉన్నది ఇంకనూ ఆధార విద్య లేక బేసిక్ విద్య విధానము మీద కావలసినంత మక్కువ ప్రభుత్వానికి ఉన్నట్లులేదు. దినదినము బేసిక్ విద్య విధానములో తగిన వసతులు లేక చాలమంది ఏదో పాతపడిన ప్రాథమిక విద్యతోనే వ్యవహారము జరుపవలసి వస్తున్నది ప్రాథమిక విద్యలో అనేక రకములైన తరగతులున్నవి అందరని ఒక చోట చేర్చవలెనని కోరుచున్నాను ఇది చాలా దినములుగా అందరు కోరు కొనుచున్నారు ప్రాథమిక విద్య యావత్తు ఒక ప్రత్యేక మంత్రి చేతిక్రింద ఉంచి, దినదినము అన్ని విధాల అభివృద్ధి చేయవలసిన బాధ్యత ఉన్నది దానికి ప్రత్యేకమైన కమిటీలను వేసి సూపర్‌విజన్ చేయు అధికారము మాత్రమే వారికి ఇచ్చి వారికి తగిన సలహాలు ప్రభుత్వము ఇవ్వవలెను కాని ఈ దినము ప్రాథమిక విద్యలోని లోపము తగినంత సూపర్‌విజన్ లేక పోవుటయే Inspectors, Junior Inspectors, Presidents, Vice-Presidents జిల్లాబోర్డులలో ఉన్నట్టి స్కూళ్లలో ఉపాధ్యాయులు చదువుచెప్పు చున్నారో లేదో చూచువారు లేనేలేరు అని నేను గట్టిగా చెప్పగలను. చాలా మంది ఉపాధ్యాయులు వారి స్వేచ్ఛా ప్రవర్తనలతో పల్లెలలోని ప్రజలకు లోబడకుండా

వారి యిష్టానుసారము ప్రవర్తించుచున్నారు కనుక సూపర్ విజన్ లేకుండా వున్నది ఇంతడబ్బు విద్యాభివృద్ధికి ఖర్చు పెట్టినప్పటికి లాభములేదు ఇక మిషనరీల చేతులలో ఉన్నట్టి ప్రయివేటు మేనేజమెంటులలో స్కూల్సును తీసుకొన్నచో వాటిలోనే తగిన సూపర్ విజన్ ఉన్నది ప్రభుత్వముచే నడుపబడు స్కూలులో సూపర్ విజన్ లేదు కాన ఉపాధ్యాయులకు జీతము ప్రాముఖ్యము లేక పిల్లలకు చదువు చెప్పుచున్నారా అను విషయమును గమనించ వలసినదిగా నేను మంత్రి గారిని ప్రార్థించుచున్నాను

కాబట్టి ప్రత్యేక శ్రద్ధ వహించి అక్కడక్కడ వుండేటటువంటి పెద్దలకు కొందమందికి, ప్రత్యేక స్కూళ్ళు నడపడానికి అవకాశం, అధికారం ఇవ్వవలెను. మంత్రివర్గానికి దేశం అభివృద్ధి కావాలని ఎంతగా వున్నదో, అల్లాగే పల్లెలలో పెద్దలకు వారి పిల్లలు అభివృద్ధికావాలి అనే కోరిక ఉన్నది ప్రత్యేక సంస్థలే ఇంతవరకు ఎక్కువగా చదువు చెప్పించడములో శ్రద్ధవహిస్తున్నాయి కనుక గమనించి, ఎవరైనా సరిగ్గా నిర్వహించకుండా వుంటే వాటిని మాత్రము తీసుకొని చక్కచేయవలసిందే కాని వెంటనే అన్నింటినీ ప్రయివేటు సంస్థలనుంచి తీసుకోవాలనడం మంచిది కాదు ఇది ఎక్కువ బరువు, బాధ్యత. అంతేగాక తగినంత శ్రద్ధ లేకుండా పోతుందని చెబుతున్నాను ఇక ఉన్నత విద్య వున్నది. ఇందులో ఎక్కువగా వృత్తులకు అవకాశం వుండవలెను కాలేజీలలోనికి వచ్చే పిల్లలను చూస్తే ఎస్ ఎస్ యల్ సి ప్యాసయిన 35 విద్యార్థులలో సుమారు 70 కాలేజీలకు వచ్చేటటువంటి పరిస్థితి ఉన్నది. వాళ్ళకు డబ్బు వుండి చదవాలని కాదు, విద్యాభివృద్ధి ఎక్కువచేసుకొని విజ్ఞాన వికాసాలను పొందాలనికాదు, ఏదో ఒకవృత్తి కావాలని ఈ వృత్తి విద్యలను ఉన్నత పాఠశాలలో ఎక్కువగా పెట్టిన యెడల వారందరు బుద్ధిమంతులై సంపాదన చేసుకోవడానిక అవకాశం వుంటుంది. అటువంటి వృత్తి విద్యలు ఉన్నత పాఠశాలలో తర్ఫీదు జరుగుటకు అనేకచోట్ల సరియైన ఏర్పాట్లు చేయించి వారి జీవనోపాధికి అవసరమైన జీవనాదార విద్యను నేర్పించాలని నేను ప్రార్థన చేస్తున్నాను కళాశాలలో ఈ దినం లెఖ్కలబట్టి చూస్తే, (వచ్చే ఇంటర్మీడియేటు మార్కులను బట్టి) ఒకటి, రెండు, మూడు, గ్రూపులున్నాయి ఒకటి, రెండు, గ్రూపులకు ఎక్కువ దరఖాస్తులు వస్తున్నాయి. మూడవ గ్రూపుకు అంత ఎక్కువగా రావు ఒకటవ గ్రూపు తీసుకుంటే ఎట్లా అయినా ఇంజనీరు అవవచ్చును అని, రెండవ గ్రూపు తీసుకుంటే డాక్టరు విద్యను అభ్యసించవచ్చునని అభిప్రాయ పడుతున్నారు. దేశ పరిపాలనకు అవసరమైన మూడవ గ్రూపుకు తగినటువంటి విద్యావంతులు రాక పోవుటను గుర్తించి పరిపాలనకు అవసరమైన వ్యవహారాలు జరపడానికి ఆకర్షణవంతముగా మూడవ గ్రూపును సరియైన పద్ధతుల్లో విద్యావేత్తలు ఏర్పాటు చేయవలసిందని ప్రార్థన చేస్తున్నాను

ముఖ్యముగా ఆంధ్ర ప్రభుత్వాన్ని అభినందింపవలసిన విషయం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపించడం. ఇది దక్షిణదేశపు చాణుక్యుడైన పానగల్ రాజాగారు కనిన కల ఆయన పెట్టినపేరే దీనికి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయమని. ఆయన దానికిగాను అనేక సంవత్సరాలు పరితపించినారు తరువాత ఆయన కనిన కలను పూర్తిచేసి దాన్ని నిజం చేయడం చాలా అభినందనీయం. దీని పరిపా

లనా వ్యవహారం ఆంధ్రులచేతిలో వున్నదా? ఎవరిచేతులలో వున్నదనే విషయం గమనించాలి కనుక విద్యాధికారులు, మంత్రులు చక్కగా యోచించి తెలుగు ధనానికి లోపంలేకుండా, తెలుగువారిలో మంచివారిని, కొంచెండబ్బు ఎక్కువైనా, తెప్పించి ఈ విశ్వవిద్యాలయాన్ని అన్నివిధాల తీర్చి దిద్దవలసిందిగా ప్రార్థన చేస్తున్నాను.

ఇక భాషవిషయంలో ఎన్నో చెప్పుతున్నారు భాషవిషయం గురించి కొంత చర్చజరిగింది కన్నతల్లికంటె ఉన్నఊరు మిన్నయని ఎట్లాపెద్దలు చెప్పినారో, అట్లే మాతృభాషకు మాతృకగా సంస్కృతమును గుర్తించవలసి యున్నది ఎంత తెలుగువాడైనా సంస్కృత పదజాలాన్ని ఉపయోగించకుండా, సంస్కృతంతో గల సంబంధ బాంధవ్యం తెలుసుకోకుండా తెలుగువాడనని చెప్పుకోడానికి అధికారంలేదు ఆయన తెలుగు చక్కగా మాట్లాడలేదని చెప్పుతున్నాను. ఒకటవక్లాసు నుంచి ఎనిమిదవ క్లాసువరకు హిందీ తీసివేయండి తెలుగుకు ప్రాధాన్యత ఇచ్చి ఆ తెలుగుకువున్న పిరియడ్లలో మూడు పిరీడ్లు సంస్కృతంలో ఉండేపదజాలానికి, తెలుగు పదములకువుండే సంబంధ బాంధవ్యములను నేర్పుపండితులను నియమించినట్లైతే చక్కగా మూడవఫారము ప్యాసు అయి బయటకు వచ్చేసరికి విద్యార్థులు భారత భాగవతములు చదివి అర్థంచెప్పడానికి, పల్లెలలోతగిన విద్యావిషయ సంపత్తిని ప్రజలకు అందజేయడానికి తగిన విజ్ఞానమును సంపాదించుకోగలుగుతారు. గనుక సంస్కృతభాష విషయంలో సంస్కృతం కంపల్ సరీ గాకుండా తెలుగులో భాగంగా, ఉన్న పిరియడ్లలో నాలుగు పిరీయడ్లు చక్కగా చెప్పించాలని ప్రార్థన చేయుచున్నాను తెలుగుపండితులుగా వచ్చేవారికి శిరోమణిగాని విద్వాన్ గాని నిర్భంధంగా ఉండాలి ప్రభుత్వం అట్లాకాకుండా ఎస్ ఎస్. ఎల్ సి. ప్యాసు అయినవారిని తెలుగుపండితుడని చెప్పి బాధ పెడుతున్నారు సంస్కృతంలో వానికి ఏమైనా 'రామ, రామః' అని అయినా వచ్చునా అని అడిగితే పెద్దమనిషి చెప్పలేడు. ఇంగ్లీషులో ఎస్ ఎస్. ఎల్. సి. ప్యాసు అయినాడా లేడా అని మాత్రమే చూచుచున్నారు ఇంగ్లీషుకు తెలుగుకు సంబంధము ఏమిటో తెలియకుండావున్నది సంస్కృతభాషతో వుండే సంబంధము గుర్తించి సంస్కృతభాషను అభివృద్ధిచేయడానికి తెలుగుకు సంస్కృతానికి 3వ ఫారం వరకు 3 పిరియడ్లు ఏర్పాటు చేయవలసిందని కోరుచున్నాను నిర్భంధంఅని పెడితే బాధకలుగుతుంది కాబట్టి ఉన్న కరిక్యులంలోనే సంస్కృతాన్ని ఉపయోగించాలని ప్రార్థన చేస్తున్నాను 4వ ఫారము నుంచి హిందిభాషను కంపల్ సరి చేయండి. ఉన్నత విద్యకు పోయి పెద్దఉద్యోగి కావలెననుకొనే వారికి, భారతదేశములోని అన్ని ప్రాంతాలకు పోవాలనుకునే వారికి హిందీభాష ఉపకరిస్తుంది ప్రపంచ ప్రఖ్యాతి సంపాదించుకోవాలంటే, ఇంగ్లీషులో ఆరితేరిన పాండిత్యం సంపాదించుకోవాలంటే అట్టివారికి 4వ ఫారం నుంచి ఇంగ్లీషు నేర్చుకొనడానికి ఏర్పాట్లు చేయవచ్చును. హిందీనేర్చుకొన్నవారు భారతదేశంలో ఉద్యోగాలకు పనికివస్తారు ఇంగ్లీషు నేర్చుకొన్నవారు ప్రపంచము అంతటాతిరిగి వ్యవహారాలు నడపడానికి పనికివస్తారు. ఎన్నికమిటీలు వేసినా, ఎంతచేసినా, విద్య ఎట్లా అభివృద్ధికావాలనేది ఒకపద్ధతి లేకుండా పోతున్నది.

ఇంక ఉపాధ్యాయుల విషయం మనవిచేస్తాను. అయిదు సంవత్సరాలుగా టీచర్సు ట్రయినింగు సెలక్షను కమిటీలో వుంటూవున్నాను హయ్యరుగ్రేడు తీసు వేస్తున్నాం అని చెప్పారు. చాలాసంతోషం. నేను హయ్యరుగ్రేడు సెలక్షను కమిటీలో వున్నప్పుడు 7 పైసలకు ఒక మామిడిపండు అయితే 7 అణాలకు ఎన్ని తెస్తావు అన్నప్పుడు 8 మంది అరగంట టైముఇస్తే చెప్పలేకుండా వుండే విద్య ఇప్పటికీ వున్నది. భవిష్యదాంధ్ర దేశాన్ని తీర్చిదిద్దగల బుద్ధిమంతులైన పిల్లలను ఏరి వెతికి ఇస్తున్నాం. వారు బుద్ధిమంతులు కావాలనేకోరిక వుంటే హయ్యరు గ్రేడును పూర్తిగా ఎత్తివేసి సెకండరీ గ్రేడుగా మార్పు చేయవలసి వుంటుంది నేను శ్రీసుందరయ్యగారితో ఏకీభవిస్తున్నాను వీరిలో సెకండరీ గ్రేడుకు వెళ్ళడానికి మంచి ఉపాధ్యాయులకు అవకాశంయిచ్చి పరీక్షలో ఉత్తీర్ణులైన తగినటువంటివారిని తీసుకోవచ్చునని ప్రార్థనచేస్తూ, వెంటనే సెకండరీ గ్రేడు కంపల్ సరిచేయాలని దానికి తగిన వ్యవహారం చేయాలని ప్రార్థనచేస్తూ బేసిక్ విద్యగురించి ఒక మాట చెబుతాను

బేసిక్ స్కూళ్ళ విషయంలో అధికార వర్గంవారికి, గాంధేయవర్గం వారికి కొంత అభిప్రాయభేదం వున్నది అధికారం వర్గంవారికి బేసిక్ ఎడ్యుకేషన్ అంటే హేళన. ఒకటవ తరగతినుంచి ఎనిమిదవతరగతివరకు చదివిన తరువాత రోజునకు ఒక రూపాయి సంపాదించుకోడానికి వీలుకాని విద్య పనికిరాదని, నిరర్థకమని గుర్తించి, దానికి తగిన వృత్తి విద్యలకు ఏర్పాటుచేయాలని, ఆ విధంగా అన్ని స్కూళ్ళను అభివద్ధిచేసి తగిన స్థోమత కల్పించి విద్యావిషయంలో డబ్బువిషయంలో, ఏమాత్రం వెనుకంజ వేయకుండా సత్వరంగా విద్యావేత్తలు తగిన విద్య ఇప్పించవలెనని కోరుచున్నాను ఇప్పుడు ఏస్కూలులో అయినా ప్రభవ మొదలు 60 సంవత్సరముల పేర్లు చెప్పగలిగినవారు వున్నారేమో చూడండి. ఎవరూ చెప్పలేరు పాత పద్ధతి రోత అని విడిచిపెట్టారు. కొత్త ఒక వింతగా వున్నది పాత, క్రొత్తలను సమన్వయపరచి ఒక చక్కని కరిక్యులమ్ పెద్దలుచేత తయారుచేయించి ఆ నూతన పద్ధతిని విద్యామంత్రిగారు తీసుకొని ప్రజల విద్యావసరాలు తీర్చి దిద్దినట్లు అభివద్ధిచేస్తారని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను

* Sri P. ANTHONY REDDI —Mr Speaker, Sir, I Just want to inform this House about two or three points referred to by Sri Vavilala Gopalakrishnayya. The most contested and controversial recommendation of the Kuppuswami Committee is that all the aided schools should be brought under one unified control and one agency. I think this is the most controversial subject. If we just see the history of the world, we will find that in no country has Government completely taken control of the management of education except in countries where there is dictatorship. Here, I wish to tell the House that the Indian Constitution under Part III Article 30 gives full freedom of education to all the minority communities whether based on religion or language.

It says : All minorities whether based on religion or language shall have the right to establish and administer educational institutions of their choice and the State shall not in granting aid to educational institutions discriminate against any educational institution on the ground that it is under the management of the minority whether based on religion or language. Therefore I think if this particular recommendation of the Kuppuswami Committee is implemented, we will be going against the very spirit of the Indian Constitution Recently Morarji Desai, Chief Minister of Bombay, speaking at the opening ceremony of Inter-college at Ahmedabad, said that "if education should be imparted properly Government should have no control over it." Acharya Vinobha Bhave too, once when asked about the question of private management of schools expressed his view that education should as far as possible, be in private hands. Therefore I appeal to the Chief Minister that he must be very careful in implementing this particular recommendation of the Kuppuswami Committee.

The next point, I wish to inform the House is about the scales of pay of our teachers The Chief Minister deplored about the poor standard of our schools Now what is the real reason for this poor standard? If we just see the staff, of which the teachers are made, (who are taking to this teaching profession,) we find that most of these are not our best people The best of our people are *not* taking to the teaching profession, because the scales of pay of teachers are very poor Take the case of an S. S. L. C. passed student If he joins as a clerk in a Government office, he is straightway started on Rs. 45 a month. He has the chance of one day becoming a Tahsildar. But if he wants to become a teacher, first, he will have to undergo two years training, and then, he will be started only on Rs. 45 a month; and towards the end of his life he cannot hope to get even Rs. 100/- So with this poor scale of pay, how can you expect to get the best people to the teaching profession? That being so, you cannot expect to have a high standard of education.

The same is true of elementary school teachers. Of course, Government, in abolishing higher grade training, has done a very sensible thing. Hereafter at least we hope to get a few better elementary school teachers, and they will surely increase the

standard of elementary education. But the scale of pay of these elementary school teachers is also very poor. Sri Humayun Kabir, Educational Advisor, to the Ministry of Education, Government of India, recently somewhere in northern India said, that the elementary school teacher should at least be paid Rs. 50 a month. Paucity of funds should be no excuse for non-payment of at least this salary. Therefore, I pray that every elementary school teacher should be started at least on Rs. 50 a month. Then only we can hope to raise the standard of education in the primary stage. And once, the primary stage standard is raised, the high school stage standard can be raised, and ultimately the whole education standard of our state will be raised. Therefore, I request the Chief Minister to seriously consider these things and try to implement them for the good of our State.

Coming to secondary education, I wish to point out one or two defects in the scale of pay of secondary grade teachers in high schools. Let us take the case of a secondary grade teacher. He plays a very important part in high school education. After passing S. S L C, he will have to undergo two years training, and then he is started only on Rs. 45 a month. The physical Education Teacher must be a secondary grade teachers, and then, he must undergo another year's training in physical education, and he is started on only Rs. 50/- a month. Take the case of the craft teacher. The craft teacher might have passed only Third Form, and he undergoes training only for nine months or at the most one year, and he is started on Rs. 60 a month. This anomaly in the scale of pay has made the lot of the secondary grade teacher very dissatisfied. I request the Chief Minister to rectify this I do not mean to say that the scale of pay of craft teachers should be reduce, rather I plead, that the scale of pay of secondary grade teachers should be increased correspondingly.

So, I request that the Government should not undertake and should not bring all the aided institutions under a single control; rather they should give choice to all the private agencies who are conducting schools most efficiently

One of the members who spoke before me said that the missionary manager did not pay their teachers properly and Government have no control over them. Here I would request

Sri Vavilala Gopalakrishnayya to give me a single case where the teacher is not paid his full pay in any school managed by the Roman Catholic Mission. If he gives a single case, I think, it will be a plea for Government straightaway to take charge of elementary education. In his own constituency there are schools run by Christian Missions.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—నాలుగు రోజుల క్రిందట సెక్రటేరియట్ ముందు ఉపవాసం చేసిన సంగతి గుర్తున్నదా ?

Sri P. ANTHONY REDDI :—I am just talking about schools managed by the Roman Catholic Mission. I think, I may say, in his own experience in Sattenapalle Taluk, if he goes about villages he will see that all the elementary schools managed by the Roman Catholic Mission are probably the best The stuff and the teaching done there are probably the best in the district. The Education Department itself will tell you that the schools managed by the Roman Catholic Mission are the best in the State. Recently I had to approach the Divisonal Inspector of Schools with reference to recognition of a school, where there was some trouble. Casually I met one of the clerks of the Office of the Divisional Inspector of schools. He asked, "to which Mission do you belong". I said, "Roman Catholic Mission." Immediately he said, 'if it is Roman Catholic Mission there is no doubt you will surely get recognition, because they are the best of the schools." So just to make a sweeping statement, because a stray missionary played mischief, that all the Mission managements are bad, is rather unwarranted. I therefore request hon. Members, before making a sweeping statement, to think twice and make statements with some reservation. Finally I request the Chief Minister to take these suggestions of mine and see that Private Agency is always given much freedom to manage and carry on elementary schools, and make every effort to see that the scale of pay of elementary school teachers and secondary grade teachers is raised.

Sri A. KALESWARA RAO — అధ్యక్ష మహాశయా, నేను ఆంధ్ర రాష్ట్రము యొక్క పునాది సిద్ధాంతాలనుగురించి మాట్లాడబోతున్నాను. మనము కొన్ని సిద్ధాంతాలను ఇదివరకే నిర్ణయించుకొన్నాము. అవి అఖిల భారత ప్రభుత్వంవల్ల అఖిలభారత కాంగ్రెసు కమిటీవల్ల మన నాయకులవల్ల అందరివల్ల స్థిరపర్చబడినటువంటిది. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో Spain భాష మాట్లాడేవారు,

జర్మనీ, ఫ్రెంచి భాషలు, ఇంకా యూరపులో ఉండేటటువంటి సమస్త భాషలు మాట్లాడేవారు ఉన్నారు కాని వాండ్లంతా ఒక జాతీయభాష ఇంగ్లీషు అనుకొన్నారు ఇంగ్లీషు నిర్బంధ భాష అయింది. ఇంగ్లీషు విశ్వవిద్యాలయ భాష అయింది ఇంగ్లీషు పరిపాలనా భాష అయింది అట్లాగే ఏదైనా ఒక జాతివుంటే ఆ జాతి ఒక ప్రభుత్వం ఉండవలెను. ఇది నూతన political science రాజ్యాంగ శాస్త్రంలో జాతి అంటే ఏమిటి? ఒక ప్రభుత్వంక్రింద ఉండవలెను, ఒకజండా ఉండవలెను, ఒక జండా వుంటే ఒక భాష ఉండాలి అందువల్ల మనము భాష నిర్ణయించుకొన్నాము. ఇప్పుడు సుందరయ్యగారు వెనుకకు తోలుతామంటే వీలులేదు ఆంధ్రభాష ఉండవలెను. Tamil వేరుగ ఉండవలెను దేనికి దానికి వేరెవేరేరాష్ట్రములు ఏర్పాటు చేయాలి. విడిపోవుటకు హక్కులేకుండా అందరుకూడా ఒక federal సంయుక్త ప్రభుత్వం క్రింద ఉండటానికి ఒక భాష ఉండితీరాలి. ఇంగ్లీషు విదేశభాష నిర్బంధంగా మన నెత్తిమీద విదేశ సామ్రాజ్యవాదులు తీసుకొనివచ్చి అంటగట్టినదిగాని మనము వరించి తీసుకొనివచ్చిన భాషకాదు. ఇపుడు లోకభాష అని దానిని అనడం హాస్యాస్పద మైనటువంటి, ఆత్మ గౌరవ హీనమయి నటువంటి విషయం. అందువల్ల ఇప్పుడు మనము హిందీని ఏర్పాటు చేసుకొన్నాము ఎక్కువ మంది మాటాడేటటువంటి భాష. రేపు అంతర్జాతీయ రంగాలలో కూడ హిందీలోనే మనవాండ్రు ప్రసంగిస్తారు. చైనాలో ఉండేవాండ్లు మాట్లాడితే ఇంగ్లీషులో తర్జుమా చేస్తున్నారు. జపానువారు అట్లే తర్జుమాచేస్తున్నారు ఇతర ప్రభుత్వాలు, ఆఖరుకు తురుష్క ప్రభుత్వంయొక్క మాటలు ఎట్లా తర్జుమా చేస్తున్నారో హిందీలోనుంచి తర్జుమాచేసే మోస్తరు కావలెగాని, ఇంగ్లీషు చాలామందికి వచ్చుగనుక, ఇంగ్లీషును అనుకరిస్తాం, వాండ్ల తోక వెంబడి పోతామంటేమాత్రం చాల గౌరవహీనమైన పని. కాబట్టి ముఖ్యమైన సంగతి ఏమంటే హిందీని ఎంతగట్టిగా వ్యాపింపచేస్తే అంత మంచిది. అది జాతీయభాష. మనం నిర్బంధంగా నేర్పాలి. అందువల్ల మన గోపాలరెడ్డిగారు ప్రభుత్వానికి రావడం తోటే, దానిని ఒకటోఫారం మొదలుకొని ఆరోఫారం వరకు నిర్బంధంచేసి నందుకు వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. కాని అది చాలదు. రెండు periodలు చేశారంటే అర్థమేమిటంటే దానియొక్క ప్రాముఖ్యతను బట్టి గుర్తించలేదు. గోపాలరెడ్డిగారికి హిందీమీదఉండే అభిమానంచేత, బహుశ ఆయన చాలా భాషలు తెలిసినటువంటివారు, పండితుడు కావడంచేత అలాచేశారు. ఆంధ్రరాష్ట్ర హిందీప్రచారసంఘ అధ్యక్షులుగ నిర్బంధంచేశారేమోగాని ఇదిహిందీ యొక్క ప్రాముఖ్యతను గవర్నమెంటు గుర్తించి చేసింది మాత్రం అనడానికి వీలు లేదు. కాబట్టి ఇంగ్లీషుకు ఎన్ని periodలు ఉన్నాయో అన్ని periodలు హిందీకి ఇచ్చితీరాలి. ఒకటిమొదలు ఆరోఫారంవరకు నిర్బంధం చెయ్యాలి, అని నేనుగట్టిగా మనవిచేస్తున్నాను. ఇంగ్లీషును ఎంత త్వరగా వెళ్ళగొట్టితే మనకు అంత ఆత్మగౌరవం ఉంటుంది. జర్మనుభాష ఎందుకునేర్చుకొనకూడదు, రష్యను ఎందుకు నేర్చుకొనకూడదు, జపాను ఎందుకు నేర్చుకోకూడదు? ఆ మోస్తరు స్థితిలోకి ఇంగ్లీషును

తీసుకురావాలిగాని ఇంగ్లీషును అంటిపెట్టుకొని ఎంతోకాలం ఉండడం అనేది అబద్ధం. బహుశా ఒక 10, 12 ఏండ్లలోనైనా ఇంగ్లీషును వెళ్ళగొట్టగలమని నేను ఆశిస్తుండేవాణ్ణి తరువాత ఆంధ్రరాష్ట్రం మనం ఎందుకు ఏర్పాటుచేసుకొన్నాం? ఆంధ్రపరిపాలన యావత్తు ఆంధ్రభాషలో చేస్తామన్నాం మన మాతృభాషలో చేసుకుంటామన్నాం తరువాత విశ్వవిద్యాలయాలలో మన మాతృభాషలో సమస్త విజ్ఞానం నేర్పుతామని అన్నాము విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషులో science, physics, chemistry సమస్తము నేర్పుతూ, ఇంజనీరింగు నేర్పుతూ, కళలు నేర్పుతూ, యావత్తు ఇంగ్లీషులో నేర్పుతూవుంటే ఇంగ్లీషును high schools లో ఎట్లా వెళ్ళగొట్టగలరు? కాబట్టి ఇంగ్లీషు అక్కడ ఉన్నన్నాళ్ళు ఇక్కడ నిర్బంధంగా high schools లో ఒకటోఫారంనుంచి ఆరోఫారం వరకు ఉండవలసిందే దానికేమి సందేహంలేదు కాని ఎంత త్వరగా వెళ్ళగొట్టుతాము అనే దానికి ఒక programme కావాలి అందుకు ప్రణాళిక ఆంధ్ర ప్రభుత్వం తయారు చేసిందంటే ఆంధ్ర ప్రజలంతా సంతోషించుతారు మన మాతృభాషలో పరిపాలన జరగడం, మన మాతృభాషలో సమస్త విజ్ఞానం, సమస్తశాస్త్రములలో విజ్ఞానం గరపడం అనేటటువంటిది, democratic పద్ధతి. ప్రజారాజ్యము యొక్క మూల సిద్ధాంతము అందుకోసమనే భాషా రాష్ట్రములు కోరుతున్నాం అందుకోసం విశాలాంధ్ర, సంయుక్తమహారాష్ట్రం, సంయుక్త కర్నాటకం కోరుతున్నాము. దేశంలో ఉండేటటువంటి అన్నిటిని కూడ భాషారాష్ట్రాలుగవిభజించవలసినదిగ కోరుతున్నాము కాబట్టిప్రధానమైనటువంటిది democratic ప్రజారాజ్య సిద్ధాంతం గనుక మన ఆంధ్రభాషలో పరిపాలనా విధానాన్ని ఎప్పుడు త్వరగా ప్రవేశ పెట్టుతాం అనేదానికి నిన్న అసంతృప్తికరమైన జవాబు చెప్పినందుకు నేను చాల విచారపడుతున్నాను. ఇది type machineల మీద ఆధారపడి ఉంటుందట. ఇది మనయొక్క యావత్తుప్రాణం. ఆంధ్ర భాషను పరిపాలనా విధానములో నిర్బంధం చేసేటటువంటి విషయం Type machine రాలేదట. ఒక shorthand writer దొరకలేదట. దానిమీద ఆధారపడిఉంటుంది అంటే ఇదినిజంగా లజ్జాకరమైన విషయం గాని ఇదిసరియైన విషయం కాదని నేనువారికి సవినయంగా మనవిచేస్తున్నాను మన మిత్రులైన ప్రధానమంత్రిగారికి. ఈపద్ధతినితూర్పుగోదావరిజిల్లాలో ఎప్పుడోప్రారంభించారు. దానికి కొన్నికష్టాలు కనబడ్డాయి, అన్నికష్టాలుగానే కనబడతాయి. అందులో మన graduates అంతా ఇంగ్లీషు చదువుకొన్నటువంటి వాండ్లు. అందువల్ల వాండ్లంతా అధైర్యపడుతారు. చీమలనడక కంటే అన్యాయంగా నడుస్తూ ఉంటే ఎన్నాళ్ళు పట్టుతుంది? మన 11 జిల్లాలలో వెంటనే ఈ విధానం అమలు జరపండి, తరువాత విశాలాంధ్ర వస్తే తక్కినవి చూచుకుంటాము, ఈ లోపుగా బహుశా 2,3 నెలలలో ఆసంగతితేలుతుంది కాబట్టి ఈజిల్లాలలో ఎన్నాళ్ళు పట్టుతుంది ఆంధ్రభాషలో పరిపాలన! మునిసిపాలిటీలలో, స్థానిక సంస్థలలో, ప్రతిచోట, తాలూకాదగ్గర నుంచి, సెక్రటరీల దగ్గరనుంచి జిల్లాకచ్చేరీల దగ్గరనుంచి, మంత్రులు వ్రాసే ఆర్డరుల దగ్గరనుంచి ఎన్నాళ్ళు ఇంగ్లీషులో వ్రాయడం.

జర్మనీవాడు జర్మనీభాష నేర్చుకుంటే, జపానువాడు జపానుభాషలో పాలన చేసుకుంటూఉంటే యావత్తు జరుగుతూఉంటే ఇంగ్లీషువాడు ఇంగ్లీషులో చేసుకుంటూ ఉంటే మనకుమాత్రం సిగ్గుగాని ఆత్మగౌరవంగాని లేదా? ఈ ప్రభుత్వం గట్టిగా ఆలోచించవలెను ఇప్పటి నుంచి మన ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి, విద్యామంత్రి, ఈ మూడు అయిన ఆయన దగ్గర ముఖ్యమైన అధికారాలున్నాయి ఈవిషయంలో ఒక కార్యక్రమం ఏర్పాటుచేయవలెను విశ్వవిద్యాలయాలు autonomous bodies అన్నారు మీరు గ్రాంటు ఇస్తున్నారు గ్రాంటు ఇవ్వకండి ఉర్దూ విశ్వవిద్యాలయం పెట్టుతా మంటే మీరు ఒప్పుకుంటారా? కాబట్టి మీ గవర్నమెంటు పాలసీకి తగినటువంటి విశ్వవిద్యాలయము మీ పరిపాలనకు కూడ సరిపోవలెను. మీకు ఇంజనీర్లు కావాలి. అందుకోసం ఇంజనీరింగు కాలేజి ఇస్తున్నారు. మీకు lawyers కావాలి అందుకోసం lawyers కళాశాల ఇస్తున్నారు మీకు డాక్టర్లు కావాలి అందుకోసం medical college ఇస్తున్నారు అట్లా పెద్ద పెద్ద చదువులు చదువుకొన్న వాండ్లు కావాలి మీ పరిపాలనకు సంబంధం లేకుండా వాండ్లు ఏదో చెప్పుతామంటే వాండ్లకు గ్రాంట్సు ఇవ్వకండి కాబట్టి conditional grants ఇవ్వాలి అంతా మీచేతిలోఉంది, మీరు ఇచ్చేగ్రాంట్లమీద వాండ్లుబ్రతుకుతున్నారు Master లను ఏర్పాటు చేయడం అనేదితప్పు మీ పాలసీలకు, వ్యతిరేకంగా వాండ్లు ఉంటారంటే, వాండ్లకు ఉండటానికి అధికారం లేదు. అందువల్ల తిరుపతి, ఆంధ్ర విశ్వ విద్యాలయాలలో కూడ ఎంతత్వరగా మీరు తెలుగు సంపూర్ణంగా ప్రవేశపెడితే అంతమంచిది 1937వ సంవత్సరంలో high school వరకు తెలుగులో బోధించమన్నారు మళ్లా ఏమి జరుగలేదు కాబట్టి చాలా ముఖ్యమైన సంగతి అనినేను మీకు మనవి చేయక తప్పదు. దీని విషయంలో మీరుఒక పంచవర్ష ప్రణాళిక ఏర్పాటుచేసి కళాశాలలలో కూడ ఈ విధంగా చేయవలెనని కోరుతున్నాను ఒకటి రెండు చిల్లర విషయాలు చెబుతాను. ఉయ్యూరునుంచి పాలిటెక్నికల్ కాలేజి తీసివేస్తారట. అది తీసివేయవద్దని మిమ్ములను కోరుతూ ఉన్నాం గుంటూరుజిల్లాలో తరువాత ఒక లలితకళాశాల, నాటకశాల, museum పెట్టవలెనని మేముకూడా కోరాము మీరు కళాప్రియులు కాబట్టి తప్పకుండా (మధ్యభాగంలో బెజవాడలో ఉంటే బాగుంటుంది అనుకొన్నాం) ఇంకొక ఇంజనీరింగు కాలేజిఏర్పాటుచేయాలి, గుంటూరువారికి మాకు ఏమిపోటీ లేదు. మధ్యలో ఒక చోట పెట్టవలసింది బహుశా సీతానగరం దగ్గర 50 ఎకరముల భూమివున్నది ఇద్దరికి కలిసేఉంటుంది. వారికి ఏమి అభ్యంతరంలేదు, వారు ఏదైనా కొంతసహాయం చేస్తే మేముకూడా చేస్తాం కాబట్టి industrial area కనుక అక్కడనే పెట్టవలెనని కోరుతున్నాం. కుప్పుస్వామి కమిటీ విషయంలో కూడ నేను ఆంతోని రెడ్డిగారితో ఏకీభవిస్తున్నాను ప్రైవేటు పాఠశాలలు తీసుకోవడం అంతాగవర్నమెంటు క్రిందికి ఎట్లా వస్తుందండి? అది ప్రపంచములో జరిగే సంగతికాదు. రాజ్యాంగ విధానానికి వ్యతిరేకం. కుప్పుస్వామి కమిటీ వారియొక్క ఉత్సాహంమీద చెప్పారు గాని, అసలు ప్రభుత్వ స్కూళ్లలోనే ఇపుడు చదువు చెప్పడంలేదు. ప్రయివేటు స్కూళ్ళే కొంచెం సరిగాఉన్నవి అని చెప్పుతున్నారు. Mission స్కూళ్ళు అంతా అంతపాడుగ ఉన్నవని నేను ఒప్పుకోను.

ఒక్క Roman Catholic లకే ఇవ్వను ఆ credit, అన్ని మిషనరీలకు ఇస్తున్నాను. వాండ్లు బాగా జాగ్రత్తగా చెప్పుకుంటూ ఉన్నారు. ఎందువల్ల అంటే స్వంతంగా management చేస్తున్నారు కొంచెము జీతాలలో తేడాలుంటే అటువంటివి అన్ని స్కూళ్ళలో ఉంటాయి. మాఊళ్లో ఒక High School వుంది వర్తకులు manage చేస్తున్నారు జీతాలు ఎక్కువవ్రాసి తక్కువ ఇస్తూ ఉంటారు ఇటువంటి rumours అప్పుడప్పుడు వస్తాయి దీనికిగాను నేను మనవిచేసేది ఏమిటంటే మీరు స్కూలు మాస్టర్ల జీతాలు పెంచవలసిందే కాని supervision ఎక్కువకావాలి అందువల్ల కమిటీలు వేయవలసిఉంది. సరిగా చెప్పుతున్నారా లేదా అనేటటువంటిది చూడవలసిఉంది జీతాలు కొంచెం ఎక్కువ చేయవలసిందే కాని మానేజిమెంటు మాత్రం అంతా గవర్నమెంటు తీసుకొనేటటువంటి ఆ యూనిఫారం పద్ధతిని కుప్పుస్వామి కమిటీ రిపోర్టులో ఉండే అంశాన్ని నేను ప్రతిఘటిస్తున్నానని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

Sri PILLALAMARRI VENKATESWARLU — అధ్యక్షా, కుప్పుస్వామి కమిటీ రిపోర్టులో ఉన్నటువంటి విషయాలమీద తర్జనభర్జన జరుగుతున్నది కాని, ఈ కుప్పుస్వామి కమిటీ రిపోర్టుగురించి ఎవరికి అభిప్రాయ భేదం లేకుండా, దీనిని universal గా అందరు ఆమోదించి ఉంటారని నేను అనుకొన్నాను. దానికి కారణము చెప్పుచున్నాను ఈ కమిటీలో ఉన్నటువంటి సభ్యులు, ఆనాడు ఉన్నటువంటి ప్రభుత్వము, అందరుకూడ దీనిని అంగీకరించాము దీనిని ఏవిధంగా అమలు జరుపవలసింది ఆలోచిస్తున్నామని అన్నప్పుడు, దానిని అందరు ఆమోదించి ఉంటారని ఆశించాను. కాని అలా జరుగకుండా దానిమీద కొన్ని అభిప్రాయభేధాలు వెల్లడించడం జరిగింది. దీనిని గురించి చెప్పబోయేముందు, కొన్ని విషయములు తీసుకోవలసిన అవసరమున్నది. ఈ సమస్యమీద ఒక స్టేట్ మెంట్ మనముందు పెట్టబడింది ఆ స్టేట్ మెంట్, ఈ బడ్జెట్ ఇవన్నీ చదివినప్పుడు, మనకు కొన్ని అభిప్రాయాలు ఏర్పడుతాయి, ఇప్పుడున్న విద్యావిధానం బ్రిటిష్ వాళ్ళు తెచ్చిపెట్టినటువంటిది అక్కడకూడ కొద్దికొద్ది మార్పులు చేస్తున్నప్పటికి కూడ, మొత్తంమీద ఈ విద్యావిధానం అదేవిధంగానే మన తాతముత్తాతలనుంచి కూడ ఉంటూవస్తున్నది కాని విద్యావిధానం ఏవిధంగా ఉండాలి అనేది మాత్రము ఆలోచించవలసిన అవసరం ఉన్నది మన పరిస్థితులను బట్టి, మన దేశాన్ని ముందుకు తీసుకురావడానికి వీలుగా మన విద్యావిధానాన్ని మార్చుకోవలసిన అవసరమున్నదని ప్రతివారు అంగీకరిస్తున్నారు ఆ విధంగానే Secondary Education Committee వాళ్లు ఇచ్చిన రిపోర్టులో కూడ స్పష్టంగా చెప్పబడింది. అంతేగాక, ప్రస్తుతము ఉన్నటువంటి ఈ విద్యావిధానములోని లోపాలు కూడ అందులో ఎత్తి చూపడం జరిగింది. కాని దాంట్లో ప్రధానంగా ఉన్నవేవి కూడ ఇప్పటి వరకు మార్పడం జరగలేదు. అందులో ముఖ్యంగా జీతముతో సంబంధము లేకుండా ఉండేవిధానము చక్కగా చెప్పబడింది. ఆ విధంగా మార్చడానికి ప్రభుత్వము వెంటనే ప్రయత్నించవలసిన అవసరమున్నదని మంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తున్నాను ఈ నాడు ప్రధానంగా మనము కోరేటటువంటి విద్యావిధానము ఏవిధంగా ఉండాలి అంటే, మనదేశాన్ని, మన ప్రభుత్వాన్ని, ప్రజలను

అభివృద్ధి చేసుకొనే విధంగా, వీటన్నింటికి ఉపకరించే విధంగా మన విద్యావిధానం ఘోరాల్చి ఇప్పటివరకు, చదువుకోవడం అంటే, ఏ గుమస్తా పనికోసమో, లేక ఏ pleader వృత్తి చేయడానికో ఈ ఆశయాలతో మన విద్యావిధానం కొనసాగుతూ ఉంటే, మనదేశం ఎప్పటికి అభివృద్ధి కావడం కష్టము. మన పంచవర్ష ప్రణాళికలో ఏదేదో చెప్పుతున్నారు కాని తదనుగుణంగా మన విద్యావిధానంలో ఏదైనా కార్యక్రమం బడ్జెట్ లో గాని, ఇక్కడ ఇచ్చిన statement లో గాని కన్పడడం లేదని చెప్పడానికి విచారిస్తున్నాను కాశేశ్వరరావుగారు ఏదేదో చెప్పారు. వారితో నేను చాలా విషయాలలో భేదించడం అవుతుంది కాని, ఒక విషయంలో మాత్రం అంగీకరించవచ్చు. తెలుగు భాషను ప్రముఖంగా తీసుకు రావలసిన అవసరం ఉండగా, ఇంగ్లీషు భాషకే ఇంకా ప్రాముఖ్యత కన్పిస్తున్నది. అయితే అసలు మనస్కూళ్లలో ఇంగ్లీషే అవసరంలేదా అంటే, బొత్తిగా ఉండ కూడదని చెప్పడంలేదు అది అంతర్జాతీయభాష, ఎన్నోసంవత్సరాలనుంచి మన విద్యావిధానము, వ్యవహారము, అన్నివిషయాలు ఇదివరకు ఇంగ్లీషులోనే ఉండడంవల్ల దాన్ని పూర్తిగా ఎత్తివేయడం కష్టముగా యుంటుంది. కాని అది స్కూళ్లలో I Form నుంచీనే నేర్పవలసిన అవసరంలేదు I Form నుంచీనే ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము, హిందీ, ఇవన్నీ పిల్లల అభివృద్ధికి తోడ్పడుతుందా అనేటటువంటిది ఆలోచించాలి. అందువల్ల హిందీని, ఇంగ్లీషును కూడ I Form నుంచీనే కాకుండా, IV Form నుంచీ పెడితే సరిపోతుంది. IV Form నుంచి హిందీని నిర్బంధంచేయవచ్చు కల్లూరు సుబ్బారావుగారు చెప్పినట్లు, ఇంగ్లీషు మాత్రము ఎవరైతే నేర్చుకోదలచుకొంటారో, ఎవరైతే ఇతరదేశాలకు foreign studies కు పోదలచుకొంటారో, లేక మరొక విధంగా అది ఉపయోగపడుతున్నదనుకొంటారో, అటువంటివారికి అవకాశము కల్పించడానికి, optional గా పెడితే సరిపోతుంది, compulsory గా పెట్టనవసరం లేదుకూడ. Secondary Education Committee Report చదివితే, అందులో ఒక చోట ఈసూచన కూడ కన్పడుతుంది ఆ రిపోర్టులో వాళ్లు కొంత అభిమానము ఇంగ్లీషువైపు చూపించి నప్పటికి దాన్ని compulsory గా పెట్టకుండా optional గా పెట్టాలనే విషయాన్ని అందులో చూస్తున్నాము అందువల్ల హిందీగాని, ఇంగ్లీషుగాని, I Form నుంచి college వరకునేర్పి తెలుగుభాషను ఆటంకపరచేదానికంటె III Form వరకు అన్నివిషయాలు తెలుగులోనే చెప్పుతూ, ఆవిధంగా తెలుగుభాష అభివృద్ధి కావడానికి అవకాశం కల్పించి, హిందీని IV Form నుంచీ compulsory గా పెట్టవచ్చును హిందీలో ఉన్నటువంటి వాఙ్మయమును, సంస్కృతిని, వాటిని అర్థంచేసుకోడానికిని, IV Form నుండీనేర్పితే చాలును. అంతేగాని, I Form నుంచీనే compulsory గా నేర్పడం అనవసరము, కాలముకూడ వృధాచేసి నట్లవుతుంది III Form వరకుచదివి కొంత standard ఏర్పడిన తరువాత హిందీనేర్చుకోవడం అంతకష్టమైనపనికాదు, త్వరగా నేర్చుకోవచ్చును. అంతే గాని, ప్రతిదీ ఒక మంత్రముగా మేము అన్నిచెప్పాము, మాకు హిందీఅంటే ఎంతో అభిమానమున్నది గనుక చెప్పాలి అనే పద్ధతి మాత్రము సరికాదు. ఈ సందర్భంలో మేము ఏదోహిందీభాషకు వ్యతిరేకులుగా ఉంటామని ఒకరిద్దరు సభ్యులు ఊహించుకొని మాకు సమాధానంగా మాట్లాడాలనుకొని, అందుకు

అవకాశము లేని దాని వల్ల పశ్చాత్తాపపడ్డారు ఇప్పుడు మా అభిప్రాయాన్ని చెప్పుతున్నాము. హిందీకి మేము వ్యతిరేకమని ఎప్పుడు చెప్పలేదు. హిందీకి ఎవరైనా వ్యతిరేకంగా ఉన్నట్లయితే, మీ అనుయాయులలో, మీ గోత్రీకులలో మీ Tamilnad లో ఎక్కడైనా ఉన్నారేమోగాని ఇక్కడ ఆంధ్రదేశములో మాత్రములేరు అని తెలుసుకుంటె మంచిది అంతేగాని, మేము చెప్పనిది కూడ చెప్పామని ఊహించుకొని కలుగని అనవసరమైనవి తెచ్చిపెట్టుకోవద్దని చెప్పు చున్నాను. కనుక ఇంగ్లీషు వెంటనే, ఈ సంవత్సరం కాకపోయినా, వచ్చే సంవత్సరం నుంచి అయినా, III Form వరకు తీసివేసి, IV Form లో మొదలు పెడితే సరిపోతుందని అభిప్రాయపడుతున్నాము.

అంతే కాకుండా, Universities లో కూడ medium of instruction తెలుగులోనె ప్రవేశపెట్టవలసిన అవసరం ఉన్నది కాని, గోపాలరెడ్డిగారు, ఇది వెంటనే చేయాలంటె చిక్కులు ఉన్నాయి, కమ్యూనిస్టులు పాతాళభైరవిలో మాదిరి రేపే చేసివేయమని అంటున్నారు, అంతత్వరగా ఎట్లుసాధ్యమవుతుందని చెప్పుతున్నారు కాని, దీనికి అసలు మీరేమైన ప్రయత్నమయినా చేస్తున్నారా అని అడుగుతున్నాను తెలుగులో vocabulary ని ఏర్పాటుచేసుకోడానికి గాని, scientific terms కు translations ఏర్పాటుచేసుకోడానికి గాని, ఒక expert committee ని ఏర్పాటు చేసేందుకు గాని, మీరేమి ప్రయత్నంచేశారు? ఇందుకు బడ్జెట్‌లో ఏమైనా provide చేశారా అని అడుగుతున్నాను ఈ విషయంలో universities కు ఏమైనా instructions పంపించారా అని ప్రశ్నిస్తున్నాను ఏదో English లో bias పెట్టుకొని, ఇంగ్లీషులోనే ప్రతిదీ జరగాలనేది కాకుండా, ఈ scientific terms, పర్యాయపదాలు వీటన్నింటికి translations ఏర్పాటుచేసి, తెలుగు medium ప్రవేశపెట్టి ఆవిధంగా దానిని అభివృద్ధి పరచవలసిందని కోరు తున్నాను

తరువాత కాశేశ్వరరావుగారు తెలుగులో మన official వ్యవహారమంతా ఎందుకు చేయకూడదన్నందుకు, సమాధానంగా type-writers సరిఅయినవి లేవు గనుక ఇప్పుడే తెలుగులో వ్యవహారమంతా చేయుటకష్టమని చెప్పారు. Type-writer లేవనే కారణముతో తెలుగులో జరుపకపోవడం అనేది సమంజ సంగాలేదు Typewriters ఒక రోజులో సరిపొయ్యేదికాదు. క్రమంగా దానిని అభివృద్ధిచేయవలసి యంటుంది. మొదటలో ఆ convenience అంతాకావాలంటే కష్టము మనము తెలుగులో పని ప్రారంభించి చేస్తున్నప్పుడు, క్రమంగా కావలసిన మార్పులు చేసుకోవచ్చును. వచ్చేటట్టువంటి లోపాలు క్రమంగా సరిచేసుకోడానికి అవకాశం ఉంటుంది అందువల్ల మనరాష్ట్రంలో అన్నిజిల్లాలలోను, అన్ని తాలూ కాలలోనుపరిపాలనా వ్యవహారమంతా తెలుగులోనె ప్రవేశపెట్టడానికి గోపాలరెడ్డి గారు పూనుకొంటారని ఆశిస్తున్నాను అదేవిధముగా University విషయం కూడ వారు ఆలోచించవలసిన అవసరం ఉన్నది Post-graduate courses మన colleges లో ఏమాత్రం లేకుండాఉన్నవి. విశాఖపట్నంలో పెట్టవచ్చు. ఆ college ఎన్నో సంవత్సరములనుంచి నడుస్తూయున్నది. కనుక మనము post-graduate courses పెట్టడానికి అవకాశమున్నది. India Government కూడ దీనికికొంత

grant ఇస్తున్నారు అని తెలుస్తున్నది. ఆ అవకాశాన్ని మనం వినియోగించుకో వచ్చును. గుంటూరు, కాకినాడ, అనంతపురం, వీటిలో Sciences లో post-graduate courses పెట్టవలసిన అవసరమున్నది. దానికి తగిన provision కూడ ఏర్పాటు చేయవలసిందని మంత్రిగారికి విన్నవించుకొంటున్నాను.

అంతేకాదు Technical Collages కూడా తక్కువగానే ఉన్నవి. యివి మనం యీనాడు చూస్తున్నాము ప్రాజక్టులు మనం ఎందువల్ల కట్ట లేకపోతున్నాము ? పంచవర్ష ప్రణాళికలో కేటాయించిన డబ్బు ఎందువల్ల ఖర్చు పెట్టుకోలేక పోతూన్నాము ? కారణము అడిగితే ఇంజనీర్లు లేరు, ఇంజనీర్లు లేరు అని చెప్పుతున్నారు ఇంజనీరింగు కాలేజీలు ఎక్కువగా పెట్టు కోవాలంటే అదిగూడా జరగడంలేదు ఇప్పుడు ఒకటి విశాఖపట్టణములో పెడ్తున్నారు విశాఖపట్టణములో నేకాదు, యింకాఇతరచోట్లలో గూడ పెట్టవలసిన అవసరముగూడా వుంది విశాఖపట్టణములో తప్పకుండా పెట్టవలసిందే విశాఖ పట్టణము లో పెట్టినప్పుడు, గుంటూరులో గాని, బెజవాడలో గాని పెట్టమని కోరడములేదు అలాకోరడము పొరపాటు గుంటూరులోగూడా నిజంగా ఒక ఇంజనీరింగు కళాశాలపెట్టవలసిన అవసరంకూడాఉంది ఇదిగాకుండా యీనాడు మనము Medical Colleges విషయము చూస్తున్నాము Medical Colleges కూడా మనకు తక్కువగానేవున్నవి. రాయలసీమలో ఎక్కడా Medical College లేదు తిరుపతిలో Medical College ఒకటి పెట్టవలసిన అవసరంఉన్నది దానితో పాటు ఇక్కడ కర్నూలులోగూడ ఒకటి అవసరమే కనుక ఇక్కడ ఒకటి ఏర్పాటుచేయమని ప్రభుత్వాన్ని కోరుచున్నాను వీటిఅన్నిటికి డబ్బుసందర్భం వచ్చినప్పుడు దానికి అడ్డంపెట్టడం అంటే ఆర్థికమంత్రి, విద్యాశాఖామంత్రి వీరిద్దరూ ఒకరేఅయితే మధ్య, మధ్యవుండేచిక్కును పరిష్కారము చేసుకోవలసిన అవసరం వుంది వీటికి కావలసిన Development Plans, వగైరాలు బడ్జటులో ప్రతిబింబిం చాలని తెలియచేస్తున్నాము. యీవిషయాలన్నీ జాగ్రత్తగా ఆలోచించాలని ప్రభుత్వాన్ని కోరుచున్నాను.

తరువాత, ప్రస్తుతంవున్న విద్యావిధానం out-moded గావున్నది. ఇప్పుడు వుండే పరిక్షాఫలితాలు చూస్తే గత సంవత్సరంకంటే ఈ సంవత్సరము యింకా తగ్గిపోయినవి దీనికి కారణం యేమిటో ప్రభుత్వం ఆలోచించాలి విద్యార్థులమీద నేరము మోపితే లాభంలేదు. విద్యావిధానంలోవుండే లోటుపాటులను మనం సరిచేయవలసిన అవసరంవున్నది దీనిని గవర్నమెంటు జాగ్రత్తగా ఆలోచించాలి ఏదో విద్యార్థులు చదవకతప్పారని చెప్పితే దానివల్ల ప్రయోజనములేదు దీనికి బాధ్యులు ఎవరోగుర్తించాలి తరువాత సెకండరీ ఎడ్యుకేషన్ విషయంచూస్తే High Schoolsలో స్కూల్ఫైనల్ అయినతరువాత విద్యార్థులు కాలేజీలకు పోవలసిందేకాని వారికి అప్పటికివచ్చిన విద్యనుబట్టి స్వతంత్రవ్యక్తిగా జీవించ టానికి వీలులేకుండా వున్నది అంటే high school standard చాలదని చెప్పకతప్పదు. Secondary Education Commette Report లో ఇచ్చిన లోటుపాట్లు సరిదిద్దుకోవలసిన అవసరంవున్నది. మంత్రిగారిని అడిగితే ఆలోచిస్తు న్నాం అంటారు, నవీనపద్ధతులలో విద్యావిధానం నడపకుండా వుంటున్నారు.

ఈనాడు high schools లో జరుగుతున్న కొన్నివిషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకు రావలసిన అవసరం వచ్చింది. 1948 సం॥ తరువాత ప్రతి High School లోనూ విద్యార్థులకు school fees హెచ్చుచేసి వసూలు చేస్తున్నారు. పూర్వము I Form నుంచి III Form వరకు రూ॥ 2—12—0 వుండేది. అటువంటిది యిప్పుడు రూ॥ 3—4—0 తీసుకుంటున్నారు IV Form నుంచి S. S. L. C. వరకు యిదివరకు రూ॥ 5—4—0 వుంటే యీనాడు రూ॥ 6—0—0 వసూలు చేస్తున్నారు. ఇదికాక games fee అని library fee అని visual education fee అని వేరే వేరే fees తీసుకుంటున్నారు Games fees కు provision ఎక్కడైనా వున్నదా? ఇదిగాక పూర్వం 9 నెలలు జీతాలువసూలు చేస్తూవుంటే యిప్పుడు 10 నెలలకు జీతాలు వసూలుచేస్తూవున్నారు. ఈవిధంగా high schools లో డబ్బు అధికంగా వసూలుజేయడం ప్రజలను మోసంచేయడ మేకదా? యీవిధంగా విద్యాసంస్థలు ప్రజలనుమోసం చేయడానికి పూనుకుంటే దీనికి న్యాయముఎక్కడ వున్నదో మంత్రిగారే గుర్తించాలి.

తరువాత text books విషయంలో ఒకవిషయం చెప్పదలచాను. రెండు నెలలక్రింద ఒకకమిటీనివేసి రిపోర్టుపంపవలసిందిగా కోరినట్లు విన్నాము. ఇప్పుడు ఆరిపోర్టు వచ్చింది దానిని నేను చదివాను Schools తెరిచి యిప్పటికి రెండు మాసములయినప్పటికి యిప్పటివరకు పుస్తకాలు సప్లయిచేయటం జరగలేదు. ఈ విషయం నేనే చెప్పటంలేదు. ప్రభుత్వంవారు ప్రకటించిన రిపోర్టులోనేవున్నది. ఆ రిపోర్టులోగూడా S. S L C పరీక్షలో ఉత్తీర్ణులయిన వారిసంఖ్య తక్కువగా లేదని ఉన్నది ఈ విషయం ప్రభుత్వంవారు అంగీకరించటం జరిగింది. విద్యార్థులకు పుస్తకాలు యిప్పటివరకు సరిగా సప్లయిజరగలేదు ఉపాధ్యాయులు లేకుండా విద్యార్థుల దగ్గరనుంచి డబ్బువసూలు చేయడం పొరపాటని మనం కళ్లారాచూస్తూనే ఉన్నాము వీటిఅన్నిటికి కారణాలు ఏమిటో గుర్తించాల్సి వున్నది. Trained teachers లేరని చెప్పడం భావ్యంకాదు ఉపాధ్యాయుల సంఖ్య తక్కువగావుంటే ఏమిచేయాలి? B. T. Colleges ఎక్కువగా పెట్టుకోవడానికి ప్రభుత్వం పూనుకుంటున్నదా అంటే అదికూడాలేదు ఈ కొరతతీర్చడానికి బడ్జటులో ప్రొవిషను, దానికితగిన plan ఎక్కడ కనబడలేదు. Boys కు, Girlsకు ఒకేచోట teaching చేస్తున్నట్లుగా చూస్తున్నాము.

మా నియోజకవర్గంలో ఒక స్కూలులో డబ్బుకట్టకపోతే IV Form ఎత్తివేయడానికి ప్రభుత్వం నిర్ణయించడం భావ్యంకాదు. ప్రభుత్వం వారివుత్తరువు యీ విషయంలో మార్చవలసిన అవసరంవున్నది. III form వరకు free education యివ్వటం అవసరంవున్నది యీనాటి పరిస్థితులనుబట్టి ప్రభుత్వంవారు డబ్బు ఏవిధంగా సంపాదిస్తాము అని ఆలోచనలతో ఉంటున్నారు పన్నులు వేసుకుందామా అని ఆలోచనవచ్చినప్పుడు అది మనము ఏవిధంగావేసి, డబ్బు పోగుచేసుకోవాలి అనేవిషయంకూడా ఆలోచనవస్తున్నది. డబ్బులేకపోతే మరొక విధంగా ఖర్చులు తగ్గించుకొని కనీసము III Form వరకైన free education తప్పకుండా యివ్వాల్సిన అవసరంవుంది. ప్రభుత్వం యీవిషయంలో తగుశ్రద్ధ తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

Text Books Committee విషయం ఆలోచిస్తామని ప్రభుత్వంవారు అంటున్నారు అసలు text books ను private individuals కు యివ్వడంవల్ల జరిగే అన్యాయాలు ఎంతయినావున్నవి కలెక్టరుకో యింకెవరికో వీటిమీద అధికారం యిస్తున్నారు వారు యీ text books ఏపీతరగతికి ఏ వేవినిర్ణయించాలో తెలియదు ప్రతిసంవత్సరము యీ text books ను మార్చుటవు జరుగుచున్నది దానివల్ల లోటుపాట్లు అనేకము ఉంటున్నవి యీకమిటీలో ఉండవలసినవారు బాధ్యతగలిగిన వ్యక్తులను వేయవలసిన అవసరం వున్నది దీనికిబదులు లాభంగాని నష్టంగాని ప్రభుత్వమే నిర్వహించి నట్లయితే దీనిలో అధికంగా వచ్చేలాభాలు ప్రభుత్వానికి వుంటాయి ఇంతవరకు జరిగిన విధానంవల్ల corruption జాస్తిగా వుంటున్నది ప్రభుత్వమే నిర్వహిస్తే corruption లేకుండాపోతుంది కుప్పుస్వామి కమిటి రిపోర్టులో యిచ్చిన లెక్కలనుబట్టి చూస్తే యీ Text Books వల్ల ప్రభుత్వానికి 5 లక్షల రూపాయలవరకు రావటానికి అవకాశాలు వుంటాయని సూచించారు ప్రభుత్వం తప్పకుండా యీవిషయం బాగా ఆలోచించి, స్వంతముగా నిర్వహించటానికి పూనుకుంటారని ఆశిస్తున్నాను

తరువాత primary education విషయం అటుండనివ్వండి. యీనాడు బెజవాడలో Physical Training College of Education ఒకటి ఏర్పాటు చేయబడివున్నది ఆంధ్రదేశాని కంతటికిఉండే యీరకమైన College యిదిఒక్కటే. అన్నిపార్టీలవారము కష్టపడి దీనిని ఏర్పాటు చేసుకున్నాము దీన్ని నడపటంఅనేది చాలకష్టమైన విషయం అని అందరముగూడా అంగీకరించిందే దీన్ని ప్రభుత్వంవారే నిర్వహించాలని గోపాలరెడ్డిగారిని కోరుతున్నాము యీకాలేజీకిగాను కృష్ణ దాటిన కొంతదూరంలో సుమారు 300 ఎకరములవరకు ప్రభుత్వంయొక్క భూమి వుంది ఆస్థలంలో యీకాలేజీ కోసం భవనం కట్టించడం అంతనష్టంకాదు కష్టం కాదు ఈభవనంకు పది, పదిహేను లక్షలు రూపాయలవరకు ఖర్చుచేయవలసిన అవసరం ఉంటేఉండవచ్చు. ఇంకాతక్కువయితేగూడా కావచ్చు, అయినప్పటికినీ పరవాలేదు. ఇలాంటికాలేజీని ప్రభుత్వంవారి ఆధ్వర్యాన నడపవలసిన అవసరం వున్నది ఈ కాస్త ఖర్చుకుగాను గోపాలరెడ్డిగారు ఎందువల్ల ఆలోచిస్తున్నారో నాకు అర్థంకావటంలేదు. దీనిని private management లో నడపటం చాల కష్టం. నాఅభిప్రాయంలో సెకండరీ స్కూళ్లు అయిన, ఏయితర స్కూళ్లుఅయిన సరే educational institutions private management లో ఉండకూడదని అంటున్నాను. కాశేశ్వరరావుగారి అభిప్రాయంతో నే నేమాత్రం ఏకీభవించలేను. ఒక high school లో సరిగా జీతాలు సరిగా ఇచ్చినా ఇవ్వకపోయినా ఉపాధ్యాయులు ఏవిధంగా యిబ్బందులు పడుతున్నారో చెప్పారు ఇక్కడ ప్రధానమైనది జీతాలుకాదు జీతాలు సరిగా యివ్వకపోతే చదువు ఎవ్వరు చెబుతారు? ఇక్కడ మనప్రక్కన కూర్చున్న ప్రభుత్వకార్యదర్శికి జీతము తగ్గిస్తే ఆయన సరిగా రిపోర్టులు రాస్తారా? రిపోర్టులు ఎవరైనా పంపుతారా? అందువల్ల, జీతాలు తప్పనిసరిగా ఇవ్వవలసిందే. Private management వల్ల జీతాలు ఇవ్వటం జరగటంలేదు Private management సరిగా జరుగుతుందనుకోవటం చాలా పొరపాటు. Joseph Reddi గారు చెప్పినట్లు Roman Catholic Churches

చాల బాగా పనిచేస్తున్నవని చెప్పారు అసలువిషయం అది గాదు యీనాడ మనం చూడవలసింది

Mr DEPUTY SPEAKER - మీరు మధ్యాహ్నం ఉపన్యసించవచ్చు సభ మధ్యాహ్నం 3 గంటలకు తిరిగి సమావేశమౌతుంది

The House then rose for lunch

**AFTER LUNCH 3-00 p. m.**

Mr. DEPUTY SPEAKER —ఇప్పుడు గౌరవసభ్యులు శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతారు.

Sri PILLALAMARRI VENKATESWARULU — అధ్యక్షా, యిప్పుడు ప్రధానముగా ఒక్కే ఒక శిక్షకులు ట్రైనింగుకాలేజి మన ఆంధ్రదేశములో యున్నది దానిని గవర్నమెంటు తీసుకొని నిర్వహించేట్లయితే అయ్యేఖర్చు 10 వేలు రూపాయిలుకంటే ఎక్కువగా యుండదనినాకు యింతకుముందే తెలిసినది ఎలాంటి పరిస్థితులలో గవర్నమెంటువారు ఎటువంటి అభ్యంతరములు లేకుండా దానిని తప్పకుండా వెంటనే తీసుకోవాలి. ముఖ్యముగా మన పంపని తలపెట్టినా building కొఱకు ఎక్కువ ధనవ్యయము చేస్తున్నాము Buildings అసలు అవసరము లేదనికాదు ఇప్పుడు high schools కట్టేటప్పుడు ప్రతిదానికి సిమెంటు తీసుకువచ్చి, సిమెంటుస్లాబులు వేసి బ్రహ్మాండమైన భవనాలు కట్టితేకాని దానిని recognise చేయమన్న పద్ధతిలో కాకుండా అవసరమైనటువంటి రూములు, Head Master కు ఒక గది, సైన్సులేబరెటరీకి ఒకటి కట్టుదిట్టంగా కట్టి మిగిలినవి అక్కడవుండే పరిస్థితులనుబట్టి ఏర్పాటుచేసుకుంటే సరిపోతుంది. ఆ సిద్ధాంతాలను అన్ని education institutions కు వర్తింపచేయాలి. కాని buildings కట్టనిచో schools మూసివేయడమో లేక private management వ్యాపారరూపంలో వారికి ఉప్పజెప్పడము జరుగుతోందని తెలుస్తున్నది

Elementary education విషయింలో కుప్పుస్వామి కమిటీ report ను గురించి తర్జనభర్జనలు బాగాజరిగినవి. దాంట్లోవున్న కొన్ని recommendations ను ప్రభుత్వం అంగీకరిస్తుంది పుస్తక బుక్కులు అన్నికూడా ప్రభుత్వమే ముద్రించే విషయం ఆలోచిస్తున్నామని చెబుతున్నారు ప్రైవేటు మానేజిమెంటు విషయంలో కల్లూరి సుబ్బారావుగారు, కాశేశ్వరరావుగారు, ఆంథోనిరెడ్డిగారుకూడా అభ్యంతరము తెలియజేశారు ఈనాడు మన ఎలిమెంటరీ ఎడ్యుకేషను ఏపరిస్థితుల్లోవుందో ఒకపర్యాయము ఆలోచించవలసిన అవసరము వుంది. ఇంతకుముందు జోసెఫ్ రెడ్డిగారు మాట్లాడుతూ రోమను కాథలిక్ స్కూలులో బ్రహ్మాండంగా elementary education వుంది అనివారుచెప్పారు. ప్రవేటు మానేజిమెంటు క్రిందేబాగుంటుందని సుబ్బారావుగారు, కాశేశ్వరరావుగారు తెలియజేశారు అన్నిబాగుండేటట్లయితే education ఏమీ బాగాలేదని ఏవిధంగా రిపోర్టువచ్చింది ఇదిఒకపార్టీ వ్యక్తిగత గూపులతోటి కూడుకొన్నటువంటి కమిటీకాదు పెద్దపెద్ద educationalistదగ్గరనుంచి అందరూకూడా వున్నటువంటిది ఈకుప్పుస్వామికమిటీ. ఈకమిటీవారు యిచ్చిన రిపోర్టును కొన్నికొన్ని భాగాలుగా చదివితే ఎంతత్వరగా; ఎంతత్వరలో ఈ educational institutions అన్నికూడా ప్రభుత్వమే తీసు

కుంటే ఎక్కువగా మనము మనయొక్క పిల్లల విద్యాభివృద్ధికి తోడ్పడేవాళ్ళము గ తామన్న విషయం స్పష్టంగా బోధపడుతోంది గుంటూరు జిల్లాలో ఒక school గురించి ఒక రిపోర్టులో యిలావ్రాసారు "We found one school in Guntur District managed by the District Board, located in a cattle shed one-third of the shed being occupied by two buffelows and the other two-thirds by 97 children. The buffelows had more space between them than the children " దీనినిబట్టి మనకు స్పష్టంగా బోధపడు తుంది అదేవిధముగా ప్రతిదీకూడా వున్నాయి పాకలు వేసుకొన్నప్పటికికూడా బాగా వెంటిలేషను వుండి, క్రింద పరిశుభ్రంగాయుండి, రాయిపరచబడి వుండి, ప్రక్కన కాపురములుగాని, పశువులను కట్టకుండా వుండేటట్లయితే అదేపదివేలు ఆవిధంగా మనము నడుపుకోడానికి అవకాశం వుంది కాని ప్రైవేటుమేనేజిమెంటు వుంటేమాత్రము అదిజరుగదు. మేనేజిమెంట్లు వాళ్ళ ఏజెన్సీకోసముగాని, వాళ్ల స్వార్థము కోసము అయినాకాని వుపయోగించు కుంటున్న సంఘటనలు కూడా చాలావున్నవి ఈనాడు ప్రైవేటుస్కూల్సులో వున్నటువంటి పరి స్థితులు చూస్తే తప్పనిసరిగా ప్రభుత్వం ఎంతతొందరగా తీసుకుంటుందా అని ఎదురు చూస్తున్నాము ప్రభుత్వంవారు వీటిని తీసుకోడానికి డబ్బులేదంటారు. ఉపాధ్యాయుల జీతాలన్నీ ప్రభుత్వమే గ్రాంటుగా యిస్తున్నది 100 కి 13 రూ॥లు బిల్డింగుల ఖర్చుక్రింద యిస్తున్నారు. ఈ రిపోర్టులోవున్న మాటలనుబట్టి చూస్తే ఏ ప్రైవేటు Institutionకూడా స్వంతంగా దమ్మిడీ అయినా వసూలుచేసి దీనికోసము ఖర్చుపెట్టుతున్నటువంటిది లేదు మిషనరీస్కూల్సు తీసుకోండి. C M. S స్కూలుగాని, రోమనుకాథలిక్ స్కూలుగాని ప్రైవేటుగా గవర్నమెంటు యిచ్చే డబ్బు, జీతాలలో కొంతమినహాయించు కొంటున్నారని కమిటీరిపోర్టులోవుంది. కాదని మన జోసెఫ్ రెడ్డిగారు సవాలుచేశారు ఈ రిపోర్టు చదివివుండేవారు చేసేవారుకాదు అనిఅనుకొంటాను అందులోఇలాఉంది "Where the school is managed by a teacher or a non-teacher or a mission or any other agent, we have found that there is a general complaint that the teachers do not get even the aid that is given by the State. Individual teachers have complained that they are forced to pay the institutions as well as the individual managers Rs. 3 to Rs. 5 and some times even as much as Rs. 10 out of the grant." రూ 20 లు వసూలుచేస్తున్న ఘటనలు వున్నాయని నాకుతెలుసు. ఇది ఏ ఒక్కరూ కూర్చొని వ్రాసిన రిపోర్టుకాదు పెద్దపెద్ద secretaries, వారంతా కూర్చొని వ్రాసిన రిపోర్టు పోనీ దీని డబ్బు విషయంలో వీరుఎవరూ అయినా వసూలు చేస్తున్నారంటే అదికూడా లేదు ప్రభుత్వము యిచ్చేడబ్బులో ప్రైవేటు ఏజన్సీ తీసుకొని వారివారి వుపాధ్యాయులచే కొంతసేపు చదువు చెప్పిన తరువాత మిషనరీ స్కూల్సులో మతబోధనకుకూడా వుపయోగిస్తున్నారని రిపోర్టులు వస్తున్నాయి కావలసివుంటే వారియిష్టము ప్రకారము మత బోధన చేసుకొనవచ్చును. ఏవిధమైనటువంటి అభ్యంతరము మేము చెప్పము.

DEMAND XV EDUCATION

(Sri Pillalamarri Venkateswarlu) [20th July 1955

దానికి వారి స్వంతడబ్బు ఖర్చుపెట్టుకోమనండి ఇట్లా వుపాధ్యాయుల చేతనే చేయిస్తూ వుండేటటువంటి ఘటనలు చాలా వున్నాయి ఈనాడు ప్రభుత్వము వాటి మేనేజిమెంటు తామే తీసుకుంటామంటే వీరందరి దగ్గరనుంచి ఇంత అభ్యంతరము, ఇంతవ్యతిరేకత వస్తోందనే విషయాన్ని గమనించినప్పుడు తేలిపోతోంది అవన్నీ దృష్టిలో పెట్టుకొని మన బిడ్డలయొక్క విద్య సరిగాజరగాలి అంటే తప్పకుండా ప్రభుత్వము యివన్నీ తీసుకోవలసిందన్న విషయాన్ని మీదృష్టికి తీసుకువస్తున్నాను. ఈవిషయమే దీంట్లో యింకా స్పష్టంగావున్నది "Actually no other amounts are collected by a private management from the general public." పబ్లిక్ దగ్గరనుంచి దమ్మిడీకూడా వసూలుచేయకుండా వాళ్లుస్కూళ్లు నడుపుతున్నారు. అలాంటప్పుడు వాటిని ప్రభుత్వము తీసుకోడానికి ఏమిటి అభ్యంతరము? ప్రభుత్వడబ్బుతో యింకొకళ్లు మానేజిమెంటు చేస్తున్నారు. వాళ్లవద్దనుంచి దమ్మిడీకూడా అదనంగా ఉపాధ్యాయులకు రావడము లేదు. కొంతమంది మేనేజిమెంటు ఏజన్సీను దీంట్లోనుండి డబ్బుమినహాయించు కోవడముకూడా జరుగుతున్నది. పరిస్థితులన్నీ ఇలావున్నప్పుడు దీనితో కాదని మేము individuals పెట్టితేనే బాగుంటుంది. ఏదో విద్యబాగా వస్తుందని చెప్పడముసరిగా లేదని అనుకొంటున్నాను. గ్రామంలో పెత్తందార్లు పెద్దలు లేరనికాదు. పిల్లలయొక్క అభివృద్ధితెలియదనికాదు. ఈ రోజున నేను అడుగుతున్నాను. ఎన్నిగ్రామాల్లో ఎంతమంది ప్రజలు తమయొక్కబిడ్డల చదువుకోసము అయినా శ్రద్ధతీసుకొని ఎంతమందిపిల్లలను హైస్కూళ్లకు పంపుతున్నారు. ఎవరు అయినా డబ్బువున్న వాళ్లు, మిడిల్ క్లాసువాళ్లు తనుపిల్లలకు ట్యూషను చెప్పించు కొంటున్నారేగాని దాంట్లోనిజంగా చక్కగా విద్యాబోధన జరిగేటట్లుంటే అంతాకూడా ఇంకా ఎక్కువమంది ఎక్కువ వుత్సాహంతో ఈ బడుల్లోనే తమపిల్లలను పంపించటము జరుగుతోంది. ఈనాడు అదిజరగడములేదు. కారణం అక్కడవుండే పద్ధతులు సరిగాలేకపోవడము అక్కడ ఉపాధ్యాయులు సక్రమంగా విద్యనేర్పకపోవడము వల్లను పిల్లలుస్కూళ్లకు రావడంలేదు దీనికి కారణము లేకపోలేదు. విద్యార్థులకు యిచ్చేజీతాలు మనము మార్చకూడదు విద్యార్థులకు ఇచ్చేజీతాలుకన్నా ఉపాధ్యాయులకు ఇచ్చేటటువంటి జీతాలు చాలాతక్కువగా వుంటున్నవి. జీతాలదేనా ప్రధానం అంటున్నారు. జీతాలు విద్య రెండూకూడా ప్రధానమే. జీతాలు ఇవ్వకపోతే వారువచ్చి మనబిడ్డలకు చదువునేర్పుతారా? ఇవన్నీకూడా మనం దృష్టిలో పెట్టుకోవలసిన అవసరమువుంది ఉపాధ్యాయుల విషయంలో ఇంకొకటికూడా చెప్పాలి. ట్రాన్స్ఫరు విషయాలు చూచుకొన్నట్లయితే ముఖ్యంగా జిల్లాబోర్డుల ఆధీనంలోవున్న స్కూళ్లలో ఇష్టమువచ్చినట్లుఇష్టములేనివాళ్లమీదఇష్టమైనటువంటిచర్యలు కూడాతీసుకోవడము కూడా జరుగుతున్నది. ఎన్నికలను పురస్కరించుకొని కొంతమందిపైన కమ్యూనిస్టులుఅని కేసులుపెట్టడము జరుగుతున్నది. Inspector మీదో, లేక Deputy Inspector మీదో యింకెవ్వరిమీదగాని రిపోర్టు పంపిస్తే రిపోర్టు విచారణచేయమని పైనుంచి ఆర్డరువచ్చినప్పటికి కూడా రిపోర్టు పంపించిన అతను కమ్యూనిస్టు అని ఏదోచేసి ఆ రిపోర్టు సరియైన విచారణచేయడానికి వీల్లేకుండా పోతున్నది. నేను ఈ విషయము చెబుతున్నప్పుడు ఎన్నికల విషయాన్ని తిరిగి తీసుకురావడానికి సమకట్టడములేదు. మరి కమ్యూనిస్టులు,

కమ్యూనిష్టులు అని ఖూచిని అందరికి చూపించినట్లయితే ఆ ఖూచి మిమ్మల్ని దిగ మ్రింగడానికి సిద్ధమౌతుందనే విషయం మాత్రం మీరు మరచిపోవద్దు. ఎవరు అయినా రిపోర్టుపంపిస్తే అతను కమ్యూనిష్టుఅని ఎప్పుడు అయితే తప్పించుకొంటు న్నాడో అదేవిధముగా అదిసాకుగా తీసుకొనడానికి ఉపయోగపడుతుంది. ఎవరు అయినసరే, కమ్యూనిష్టులు అయినాసరే సరియైనరిపోర్టులను పంపిస్తే దానిమీద చర్యతీసుకోడానికి వీలవుతుందా అనిమాత్రం నేను ప్రశ్నిస్తున్నాను.

Sri M NAGESWARA RAO —Point of order, Sir.

అధ్యక్షా! కమ్యూనిష్టులు ఖూచి ఖూచిఅని, అదేమిమ్మల్ని దిగమ్రింగు తుందని అంటున్నారు ఆ మ్రింగడము అధ్యక్షులవారినా? సభ్యులనా?

Sri PILLALAMARRI VENKATESWARULU —మేము మీకు చేసే విజ్ఞప్తి ఒక్కటే రాజకీయంగా వచ్చేటటువంటి అభిప్రాయ బేధాలు రాజకీయమైన అయినటువంటి విధానాలతో పరిష్కారముచేసుకో వలసివుంది ప్రభుత్వపరిపాలనా విషయంలో ఎక్కడ అయినా ఒక ఆందోళన జరిగినప్పుడు అదిమీ దృష్టికి తీసుకువచ్చినప్పుడు విచారణ చేయమన్నప్పుడు, విచారణ చేస్తుండగా మధ్యలో ఇది ఏదో కమ్యూనిష్టులు పెట్టారని ఆపుచేయడానికి చేసేప్రయత్నాలు అరికట్టడానికి మంత్రులు పూనుకుంటారని ఆశిస్తున్నాను ఈ రకంగా జరిగి నట్లయితే అనేకప్రమాదాలకు కూడా దారితీస్తున్నవి. కనుక అలాంటివి ఏవీ పెట్టుకోకుండా ఎక్కడనుంచి రిపోర్టులు వచ్చినప్పటికి కూడా న్యాయాన్యాయా లను విచారణచేయడానికి మంత్రివర్గం పూనుకోవాలని కోరుతూ విరమిస్తున్నాను.

*Sri M R APPA RAO — అధ్యక్షా! మనముఖ్యమంత్రిగారు 5 కోట్ల రూపాయలకు పైగా విద్యావిషయములో ఖర్చుపెట్టుచున్నారనిన చాలా సంతో షించతగు విషయము ముఖ్యముగా యీ primary education లో మన state లో 18 వేల schools ఉన్నవని మంత్రిగారు చెప్పిరి. ఉపాధ్యాయులకు జీత ములుహెచ్చు చేయవలెనని Kuppuswamy Committee Report లో ఉన్నది. అట్లు వృద్ధిచేసినగాని సరైన ఉపాధ్యాయులు దొరకుటకు వీలులేనట్లుకన్పిస్తున్నది. అదిగాక books publication విషయములో ప్రభుత్వము ఒక కమిటీని వేసినది. ఈ కమిటీ తొందరలో రిపోర్టుయిచ్చినట్లయిన దానివల్ల ఎక్కువలాభము వచ్చుటకు వీలుండును Secondary schools ను ఇప్పుడు multi-purpose schools గా పెట్టుచున్నారు దానికి Government of India 66% non-recurring loanన్నూ recurring cost లో25%యిస్తున్నది ఈమొత్తములుఇంకా పెంచిన ఎక్కువసహాయము కలుగును. ఇప్పుడు ప్రభుత్వమువారు 15 schoolsను multi-purpose గా మార్చుచుంటిరి ముఖ్యముగా నేను మనవిచేయునదేమనగా నేనిదివరకు education minister గారైన పట్టాభిరామారావుగారికి ఒకబిల్లును పెట్టమని అడిగినాను. అదేమనగా towns లో గాని villages లో గాని పెద్ద పెద్ద స్థలములు ఉంటున్నవి యీ స్థలములన్నీ schools క్రింద reserve చేయవలెనని secondary education committee recommend చేసినారు. ఆ మాదిరిగా reserve చేయకపోయినట్లయిన అవన్నియు ఇండ్లుకట్టి speculative

purposes క్రింద ఉపయోగిస్తూ స్కూల్సుకు ఖాళీ స్థలములు లేకుండాపోతున్నవి. అందులో ముఖ్యముగా ఒక ఉదాహరణకు 1935 సం॥లో బెజవాడ College ని మేముకట్టినప్పుడు ఎకరము1700/-లకు కొంటిమి ఇప్పుడు ఎకరను రు 50,000/- ధరఉన్నది అందుచేత ఇటువంటివి control చేయకపోయినట్లయితే మనకు స్థలములుదొరకుటకష్టము University వారు 20 ఎకరములు ఒక high school కు కావలెననుచున్నారు కాని మాకున్నది 7 లేక 8 ఎకరములు మిగతపొలము కొనుటకు అవకాశములేకుండా ఉన్నది. అందువల్ల వీటిని కంట్రోలుచేసి స్కూల్సుకు దగ్గరగా ఉన్న స్థలములు, towns కు మధ్యలోనున్న స్థలములు గాని స్కూల్సుకు తప్పితే యితర purposes కు ఉపయోగించుటకు వీలులేదని నిబంధన పెట్టవలసినదిగా కోరుచున్నాను ఈబిల్లును పరకముగా ప్రవేశపెట్ట వలసినది నేను detailed గా ఒక petition ను కూడా ఇదివరకు Education Minister గార్కి ఇచ్చి ఉన్నాను.

తరువాత బెజవాడలో ఒక techincal college పెట్టిన బాగుండునని అనుకొను చున్నాను అందువల్ల గవర్నమెంటువారు తప్పక college ను బెజవాడలో పెట్టెదరని నమ్ముచున్నాను ఏవిధమైన కారణము చేతనైనను కాలేజీ పెటని ఎడల private వాళ్ళు పెట్టుటకు సిద్దముగా నున్నారు. చుందూరు వెంకటరెడ్డి గారు workshop యిస్తామని నాకు వాగ్దానము చేసినారు. కాని నేను ముఖ్యముగా ప్రభుత్వమునే కాలేజీని పెట్టమని కోరుచున్నాను అట్లుగానిచో private management తో కాలేజీని పెట్టుటకు permission యివ్వవలసినదిగా కోరు చున్నాను.

తరువాత మన ప్రభుత్వము వారు University కి ఒకలక్ష రూపాయిలును యిచ్చినందులకు అభినందించుచున్నాను Affiliated colleges కు గవర్నమెంటు యీసం॥ బడ్జెటులో 5 75 లక్షలు బిల్డింగ్ grants క్రింద 6 47 లక్షలు teaching grants క్రింద యిచ్చామని చెప్పినారు యీ మొత్తము చాలదు కాలేజీలలో హాస్టల్ వసతులు లేవనియు, teachers కు residence యితర విషయములు సరిగాలేవు కనుక యీ మొత్తమును ఇంకనూ ఎక్కువ చేయవలెననియు, University Grants Commission వారుడబ్బును University కి యిస్తున్నారు గాని affiliated colleges కు ఇవ్వడములేదు. కనుక మన మంత్రిగారిని University Commission వారి ద్వారా affiliated colleges నకు కూడా డబ్బు యిప్పించెదరని కోరుచున్నాను.

తరువాత చాలమంది సభ్యులు University courses అన్నియు తెలుగులో చెప్పాలని కోరుచున్నారు ఇప్పుడు ఏ subject అయిననూ తెలుగులో లేదు గాన కనీసము తెలుగులో పుస్తకములు వ్రాయవలెను. అట్లు వ్రాయుటకు ఒక board of translation ను ఏర్పాటు చేయవలెను అట్లుచేసిన కనీసము 10 సం॥ లలోనైనా కొద్దిపుస్తకములు వెలువడును కాని యీ board of translation ఏర్పాటు చేయుటకు చాల డబ్బు ఖర్చుగును ఆంధ్ర యూనివర్సిటీకి డబ్బులేదు అని మీరు అనవచ్చును. కాని తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తరఫున,

ఆంధ్ర విశ్వవిద్యాలయము తరఫున ఒక కమిటీనివేసి దానికగు ఖర్చును ప్రభుత్వమే భరించవలెనని కోరుచున్నాను.

తరువాత Andhra Physical Education College ను గురించి చాల మంది సభ్యులు చెప్పిరి. దానిని గవర్నమెంటు తీసుకొనవలెనని కోరుచున్నాను. నేనిదివరకు Education Ministerగారు ఆ కాలేజీని మీ బెజవాడలోనే ఎందుకు పెట్టవలె అని అన్నారు. ఎందుకు బెజవాడలో పెట్టవలెననగా మొదట అక్కడావిద్య ప్రవేశపెట్టితిమి చాలా డబ్బు ఖర్చుపెట్టితిమి ఇంకా చాలా కృషి చేయుచుంటిమి ఇప్పుడు దానికి 60, 70 వెల assets ఉన్నవి దానికున్న అప్పులను మేము తీర్చి యిచ్చుటకు సిద్ధముగా నున్నాము కాబట్టి ప్రభుత్వమువారు దీనిని తీసుకొనవలెనని కోరుచున్నాను మీరు ఒకవేళ తీసుకోక పోయిన municipalities grant యిస్తాము అంటున్నాయి ఆ విధముగా municipalities grant ఇవ్వవచ్చునని Rajagopalachari గారు orders pass చేసినారు కాని మునిసిపాలిటీలు గ్రాంట్లు ఇవ్వకూడదని G. O pass చేసినారు, కనీసము ఆ G O నైనా రద్దుచేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాను.

Sri D. GOPALA RAO: Mr Speaker, Sir, my object and purpose in moving this cut motion is to discuss about the starting of a public school in Andhra State. In our State, there is not even one public school where the children could be trained from their childhood and made good citizens This is a very important thing and every one of us should bestow some thought to this If Pandit Jawaharlal Nehru and other great statesmen are what they are today, it is because of the training and the character-moulding they have had during their childhood With this object in view, I hope, every one of us will give thought to this. There are such schools in Madras, in Hyderabad and in Bihar and other places. Some of the members may think that this an aristocratic school. It is not an aristocratic school at all. It is meant to train children from their childhood and mould their character and make them leaders of society In doing so from the childhood, the aptitude of the children is observed by the teachers and what shape the children would take will be suggested to the parents and then only their further education is chalked out. I am disappointed that no mention has been made in this budget. Education is a very important subject because our future generation is to be benefited by this and as such this is a subject on which the Government should bestow some thought. Now, we cannot say, "Look, I have sent my child to a school where his destinies are in the hands of his *gurus*." We cannot with any

pride say that we have such a school in Andhra State. This is an institute where not much money is required We have palaces of zamindars at Korukonda, Nuzvid and Pithapuram. I am not particular where this institute is to be started. I say it may be started wherever the Government thinks feasible My only request is that the Hon Education Minister will please give his thought to it and examine this question If I have succeeded in bringing this to the notice of the Education Minister, my ambition is solved, Sir

* Sri T. JIYYAR DAS:— అధ్యక్షా, నాకు పూర్వం మాట్లాడిన సోదర సభ్యుడు public school మన ఆంధ్రదేశంలో లేదనివాపోయారు. వారి కోరిక సిద్ధించేటట్లు ఇండియాలో వుండే 33 public schools లో ఒకటి ఋషీవాలీలో పెట్టారు Public school మాత్రమేకాదు, Special school కూడా లేదు. మన ఆంధ్రదేశంలో గురుకులపద్ధతి మీద నడిచే స్కూలు కూడా లేదు. మన అదృష్టవశాత్తు గురుదేవునివద్ద అంతేవాసిగానున్న వారు మనకు ముఖ్యమంత్రిగా వుంటూవారు ఈ గురుకులపద్ధతి మీద విద్యాభ్యాసాన్ని చేసిన వారై విద్యాశాఖ అమాత్యులుగా కూడా వున్నారు కనుక వారికి ఈ గురుకుల విద్యాప్రాముఖ్యం బాగా తెలుసు ఈ బడ్జెటు speech లో విద్యా మంత్రి ముఖ్యంగా చెప్పినపుడు ప్రాథమిక, ఉన్నత కళాశాలల విద్యల గురించి చెప్పారు. 6 మొదలుకొని 12 సంవత్సరాలు, 12 నుంచి 16 సంవత్సరాలు, 16 నుంచి 20 సంవత్సరాల వయస్సుగల వారికినేర్పే విద్యనుగురించి చెప్పారు నేను చెప్పేది 3 సంవత్సరాల నుంచి 6 సంవత్సరాల వరకు వుండే పసిబిడ్డకు మీదవేసేపునాది వేస్తే, అటువంటి పునాది మీద నిలిచే విద్య ఏమైనా రావలిసిందేకాని లేక పోతే వృథా. అందువల్లనే వారి introduction లో "and the most important thing of all is that the improvement of the quality of education." అని చెప్పారు.

అదిచాలా ఉన్నతమైన ఆశ. వారు విద్యావేత్తలు కనుక చెప్పారు. చదువు చెప్పే గురువులకే ఈ standard లేదు. బాలురకు ఇష్టంవచ్చిన విద్యను నేర్పవలసిందే కాని గురువుకు తగినవిద్య బాలురకు నేర్పడం ఏస్కూలులోను లేదు కళాశాలలో క్రమశిక్షణ లోటువడిన కారణంచేత సమ్మెలే ప్రధానములైనవి పెద్దవాళ్ళకు విద్యచెప్పి చూశాము. పూజ్యబాపూజీ గాంధీ గారు అనేక సిద్ధాంతాల మీద అత్యున్నతమైన నైతిక పదాలకు మనలను తీసుకువెళ్లారు అయినప్పటికి మనం ఆనైతిక స్థాయినుండి పడిపోవుటకు ఆశ్టే పట్టలేదు అయినా పసిపిల్లలకు విద్యచెప్పితే వారివల్లనైనా భావి అభివృద్ధి అవుతుందని మనఆశ ఆ ఆశతో ఒక బాల గురుకులాన్ని స్థాపించడానికి వీలుగా బడ్జెటులో ఏమైనా కేటాయించడానికి వీలువుంటుందేమో చూడవలసిందిగా మీ ద్వారా ముఖ్యమంత్రిగారికి మనవి చేస్తున్నాను ఎవరైనా ఇటువంటి సంస్థ స్థాపిస్తే దానికి స్థానిక ఇచ్చినాఇవ్వవచ్చును స్వర్గీయ అన్నపూర్ణాదేవి స్మారక సంఘంవారు [illegible] సంవత్సరంనుంచి. మనపవిత్ర (కృష్ణవేణీ తీరంమీద ఇటువంటి బాల గురు

కులాన్ని స్థాపించాలని అనుకుంటున్నారు దానికైనా తగిన సహాయసంపత్తిని ఆంధ్రప్రభుత్వంవారు ఇస్తే మీకందరికి ధన్యవాదాలు సమర్పించగలను ప్రాథమిక విద్యలో ముఖ్యంగా 8వ standard వరకు వుండే స్కూల్సు తీసివేయాలని కోరారు నిజంగా తీసివేయాలి అక్కడవిద్య గరపేది 8వ పారమువరకు చదువు కున్నటువంటి ఉపాధ్యాయుడు ఆయిన చదువుకున్న చదువునే తిరిగి వీరికి పునర్దానం చేయడంలో సబబులేదు వారికి అంతసామార్థ్యమూ లేదు విద్యగరపు నపుడు body, mind and soul అంటే భౌతికంగా,మానసికంగాను, ఆధ్యాత్మికంగాను పరిశీలనచేసి వారిని అభివృద్ధిచేసే ఉపాధ్యాయుడు ఎక్కడైనా వున్నారా అనేది ముఖ్యమైన విషయం ఇక కళాశాలలకు పోతే క్రమశిక్షణలేదు విద్య గరపడంలో వారికి వ్యతిరేకంగా వున్న ఏ విషయం మీదనైనా సమ్మెచేయడమే క్రమశిక్షణ అందువల్ల ఈవిద్యావిధానంలో ముఖ్యమైన మార్పులుచేసి తగిన తరిఫీయతు ఇచ్చే టట్లు విశ్వవిద్యాలయాలలో మార్పుతెస్తారనే ఆశ మాకందరకు వున్నది శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీలోకూడా కాశీ యూనివర్సిటి ప్రకారంగా సర్వ మతాలకు వీలైన పీఠాలు కల్పించి మతాలమీద research చేయిస్తే వాళ్ళకు కావలసిన ఆధ్యాత్మిక శక్తి కల్పిస్తే కావలసిన భావి పౌరులు తయారవుతారనే ఆశవున్నది. ఈ కళాశాలలు, ఉన్నతపాఠశాలలు, ప్రాథమిక పాఠశాలలు మళ్ళీ సంస్కరించాలంటే కొన్నియుగాలు పడుతుంది అందువల్ల చిన్నపిల్లల దగ్గరనుంచి ప్రారంభించి బాలగురుకులాలను,గురుకుల ఆశ్రమాలను స్థాపించాలనికోరుతున్నాను. ముఖ్యమంత్రిగారు,దేవాలయ ధర్మాదాయాల ముఖ్యమంత్రిగారు కలసిసంస్కృతం విధిగా నేర్వాలనే విషయంలో కొన్ని ప్రకటనలు చేసారు. 'సంస్కృతారణ్య సంచారే విద్వత్మత్తేభ శృంఖలః' అన్నట్లు ఈప్రకటనలు మా కాశేశ్వరరావుగారు పరిభుతులకు సంస్కృతం నేర్పడం పిల్లలకు భారం అవుతుందనే భయాన్ని కల్పించింది, ఎందువల్లనంటే మాపాటికి మేము సంస్కృతం నేర్చుకున్నాం, మీరు మాత్రం చదువుకో వద్దని వారి భావంఏమో నాకు తెలియదు. కాని వారందరు సంస్కృతం బాగా చదువు కున్నారు కాశేశ్వరరావుగారు ఉపనిషత్తులకు తెలుగులో వ్యాఖ్య వ్రాశారు. ఆపైవారి standard క్రిందివారికి ప్రసాదించవలయును. సంస్కృతంలేనిదే సంస్కృతి లేదని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

* **Sri B. P SESHA REDDI:-** అధ్యక్షా, ప్రారంభవిద్య గురించి మాట్లాడుతున్నాను ఇందునిమిత్తమై 2 కోట్ల 34 లక్షల 76 వేల రూపాయిలు ఖర్చుచేయ బోతున్నారు. ఇందులో ఒక అర్ధభాగం వృధా, అనవసరమైన ఖర్చు అవుతోంది. ఏమనగా ప్రారంభవిద్యలో teachers సరిగా చెప్పడంలేదు. స్కూలు 8 గంటలకు ప్రారంభం చేయవలసివస్తే ఆ టయిమునకు 5, 6 బాలురు వస్తారు. 40 మంది వుండవలసిన చోట 6 మంది వస్తే వారినికూడా రానిపిల్లలను పిలుచుకునే దానికి పంపి స్కూలు ప్రారంభించేసరికి 9, 9½ గంటలు అవుతుంది. 10½, 10 3/4 గంటలకు స్కూలు వదలిపెడతారు. దీనివల్ల బాలురకు విద్య అబ్బడం లేదు. ఈ విషయం గురించి నేను తాలూకాబోర్డు, జిల్లాబోర్డు ప్రశిడెంటుగా వున్నపుడు సుమారు 15 సంవత్సరాల అనుభవంతో నేను విద్యాశాఖాధి కారులను Director, Deputy Directors కు చాలా మారులు మనవిచేసి వున్నాను. చేసిన ఈ విధానం చక్కబడలేదు. మేము జిల్లాబోర్డుల నుంచి స్కూలు పరిపాలన,

చక్కగా జరిగేట్లు చూస్తాము, supervisors ను తీసుకుంటాము దానికి permission ను ఇవ్వవలసిందంటే ఇవ్వడంలేదు కారణం ఏమిటంటే elementary education కు separate fund ఒకటి వున్నది దానినుంచి ఖర్చు చేయకూడదని మాకు ఉత్తర్వు ఇవ్వడంవల్ల supervisors ను inspectors ను పెట్టి పరిపాలన చక్క చేయడానికి వీలులేక పోయింది Aided schools జిల్లా బోర్డుల స్కూళ్లకంటె అధ్వాన్నంగా పనిచేస్తున్నాయి ఒక ఉదాహరణ చెబుతాను నంద్యాలతాలూకా కొరిదేడు గ్రామంలో లండను మిషనువాళ్లు ఒక ఎలిమెంటరీ స్కూలు నడుపుతున్నారు అందులో ఇద్దరు ఉపాధ్యాయులు 66 బాలురు, చక్కగా జరగడంలేదు గ్రామంలో రైతులు చాలామంది నావద్దకువచ్చి మా గ్రామంలో స్కూలు సరిగాలేదు, జిల్లాబోర్డు తరఫున ఒకస్కూలు పెట్టాలని అడిగారు అపుడు వుండే educational authorities కు వ్రాస్తే aided schools వున్నది కనుక జిల్లా బోర్డుకు permission ఇవ్వడం లేదని అన్నారు అపుడు నేను Divisional Inspector గారి దగ్గరకు స్వయంగా వెళ్లి వారితో మనవి చేసి వారిని పిలుచుకొని పోయి స్కూలును తనిఖీ చేయించాను చేయించే టప్పటికి యిద్దరు టీచర్సుగల స్కూలులో వారు వెళ్ళేటప్పటికి ఆరుమంది మాత్రం ఉండినారు. మిగతా వాళ్ళు ఎక్కడ అని టీచర్సును డివిజనల్ యినస్పెక్టరు అడిగితే వారు పొలంలోకి పోయినారు, కళ్ళంలోకి పోయినారు అని చెప్పినారు. వారందరిని పిలిస్తే 15, 16 కంటె ఎక్కువరాలేదు. అప్పుడు వెంటనే recognition withdraw చేసి మాజిల్లాబోర్డుకు permission యిచ్చినారు. ఆమాదిరిగా జిల్లాబోర్డు స్కూళ్ళలో అయితేనేం, aided schools లో నయితేనేం సరైనవిధానం జరగడంలేదు. దీనికి గవర్నమెంటువారు ఈసంవత్సరంలో 2 కోట్ల 34 లక్షల 74 వేలు ఖర్చుపెడుతున్నారు దానిలో సగం మాత్రం సద్వినియోగం అవుతూ మిగతా మొత్తం వృధాగా ఖర్చు అవుతుంది. ఈవిధానం బాగుపరిస్తేనేగాని లేకపోతే ప్రారంభ విద్యగురించి చాలా లోపాలు, కష్టాలు వున్నవి అని మనవిచేస్తున్నాను. వీటికి supervisory staff బొత్తిగాలేదు. హైస్కూళ్ళలో పతి హెడ్మాస్టరు selection posts చేసి ఉత్తమమైన వారిని బాగా వ్యవహరించగల హెడ్మాస్టర్లను వేస్తూ యున్నందువల్ల పనులు చక్కగా జరుగుతున్నాయి. సంవత్సరానికొకసారి జిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసరు పోయి inspection చేస్తుంటారు. అదేవిధంగా elementary education విషయంలో జరుగుతుంది 1, 2 ఉపాధ్యాయులు గల ఎలిమెంటరీ స్కూళ్ళలో సంవత్సరానికొకసారి డిప్యూటీ యినస్పెక్టరు తనిఖీచేయడంవల్లను ముందుగా నోటీసులు యివ్వడంవల్లను వారు సర్దుబాటు చేసుకుంటూ బాగా రాయించుకోవడంవల్ల విద్యమాత్రం శ్రద్ధగా చెప్పకుండా గవర్నమెంటు ద్రవ్యంఅంతా వృధాగా శలవు అవుతుంది ఈవిధానం గురించి మంత్రిగారు యికముందయినా supervisory staff increase చేసి యీవిధానం బాగుపరిస్తేనేగాని యింతపెద్ద మొత్తం ఖర్చు పెట్టికూడా ప్రజలకు ఉపయోగపడకుండా పోతుందని మనవిచేసుకున్నాను. మంత్రిగారు నాకవకాశం యిచ్చినట్లయితే స్వయంగా పిల్చుకొని వెళ్ళి 8 గంటలకు స్కూలు ప్రారంభించవలసివస్తే సైముకు ఎంతమంది బాలురున్నారు ఏవిధంగా విద్య జరుగుతుందో స్వయంగా చూపించగలను. కాబట్టి యీవిధానం ప్రారంభ

విద్యగురించి యీలోటును వచ్చే బడ్జెటుకైనా సరైన supervising వృద్ధిచేయ గలరని వారిని గురించి నేను ప్రార్థిస్తున్నాను

* Sri A C. SUBBA REDDI – అధ్యక్షా, మా మిత్రులు చాలమంది education బడ్జెటు గురించి చాలమాట్లాడారు ఇందులో జాస్తి aided schools గురించి controversy చాలవున్నది నా అనుభవంలో బహుశః 1936 సంవత్సరం నుంచి యీదినం వరకు మునిసిపాలిటీలలోని మునిసిపల్ స్కూళ్ళకు aided schools కు చాల వ్యత్యాసం వున్నది Municipal schools కంటె aided schools చాలబాగా పనిచేస్తున్నా యనడంలో సందేహంలేదు. నేను ఎన్నోసార్లు యీ aided schools ను address చేస్తూకూడ యీమక్కే చెప్పాను నాపిల్లలను మొట్టమొదట municipal school కు పంపించాను. బహుశః 3 సంవత్సరాలైనా ఓనమాలు రాలేదు నాబిడ్డలకు తరువాత నాబిడ్డలను aided schools కు పంపించుకోవలసి వచ్చింది Aided schoolsకు పంపించి చదువు చెప్పించుకోవలసి వచ్చింది Chairman గా వుండిన నాబిడ్డలకే యింత మాత్రంగా మామునిసిపల్ స్కూళ్ళలో చదువుచెబితే కాదనువాళ్లకు ఎంత మట్టుకు చెబుతారో అర్థంచేసుకోవచ్చు. Aided Schools కు పిల్లలను బట్టి గ్రాంటు వస్తుంది Municipal Schools కు అట్లా కాదు. అందువల్ల శ్రద్ధగా చదువు చెప్పరు అందుచేత aided schools లోకి బిడ్డలు పోతారు. చదువు బాగుగా చెప్పక పోతే బిడ్డలు రారనే భయంతో aided schools లో చదువులు బాగుగా చెబుతారు Aided schools ఉపాధ్యాయులకు జీతాలు సరిగా ముట్టడం లేదనే విషయం నిజమే అయివుండవచ్చు గ్రాంటులు మానేజర్లు తింటున్నారా లేదా అని సరిగా చెప్పలేము గాని టీచర్ల వద్దనుండి 2 రూపాయల నుండి 10 రూపాయల వరకు మానేజరు తీసుకుంటున్న సంగతి నాకు తెలుసును. అది నిజమే. దాని గురించి ఏమయినా శ్రద్ధ తీసుకుని నేరుగా టీచర్సుకు అందచేసే పద్ధతి వీలుంటే తెస్తే బాగుంటుంది ప్రస్తుతం మావూర్లో వెంకటగిరి రాజా కళాశాల వున్నది. ఆ కళాశాల మా జిల్లా అంతటకు science subjects గల college అది ఒకటే దానికి buildings లేవు-అసలు building లేదని కాదు. కావలసినన్ని buildings లేవు. యీకాలేజీనిగవర్నమెంటు తీసుకుని అభివృద్ధి పరచండి. లేకపోతే building grant అయినా యిటువంటి దాంట్లో ఎక్కువగా యివ్వాలని చెప్పి మంత్రిగారిని కోరుచున్నాను తరువాత యిప్పుడు మన రాష్ట్రంలో యింజనీరింగు కాలేజి విషయం. మన రాష్ట్రంలో 3 భాగాలుగా భాగించారు. North, Central and South అని భాగించారు బహుశః జనాభాప్రకారం సీట్లుకూడా కేటాయింపు చేసినారు. ఇప్పుడు వినబోతుంటే నార్తులోగాని సవుతులోగాని interview card యిచ్చిన వారిలో 50 మంది select అయినారు. సెంట్రలు ఏరియాలో ఎంత మందికి interview cards వచ్చినవో వారందరికి సీట్లువచ్చినవి ఎందువల్లనంటే బహుశః క్రొత్తగా యూనివర్సిటీలో కాలేజీపెట్టినారు ఆ engineering collegeకు సెంట్రలు జిల్లాల నుంచి వచ్చిన వారిని తీసుకున్న తరువాత గవర్నమెంటు కాలేజీలలో మిగిలినవారికి అందరకి సీట్లువచ్చాయి Northన ఉన్న శ్రీకాకుళం విశాఖపట్నంవారికి, Southన ఉన్న నెల్లూరు, రాయలసీమ వారికి 50 percent

పంపించినారు పైమూడు ప్రాంతాలకు percentage నియమించినప్పుడు ఈ యూనివర్సిటీ కాలేజీ జ్ఞప్తికి రాలేదని నాఅభిప్రాయం

Sri M. R APPA RAO —యూనివర్సిటీ కాలేజీలో అట్లు రావడానికి కారణం First class రావాలి కేవలం merit ను బట్టి తీసుకుంటారుగాని backward classes అని, కొన్ని జిల్లాలవారికనీ reservation లేదు. Central జిల్లాలనుంచి ఎక్కువ మార్కులు వచ్చిన applications వచ్చియుంటాయి అందువల్ల యిచ్చియుంటారు

Sri A C. SUBBA REDDI.—బహుశః అప్పారావుగారికి తెలియదేమో Mathematics సెక్షను తీసి compare చేస్తే సర్కారుల వారి కంటే రాయలసీమలోనే ఎక్కువ mark లు వచ్చినవాళ్ళుంటారు

The Hon. Sri B. GOPALA REDDI.— చాలామంది యూనివర్సిటీ కాలేజీకి apply చేయలేదనుకుంటాను అంటేవాళ్ళు అనంతపురం కాలేజీకి పోవాలనే వుద్దేశంతో University college-కి apply చేసినారో లేదో కూడా మనం verify చేయవలసి వుంటుంది.

Sri A C SUBBA REDDI —యూనివర్సిటీ కాలేజీకి apply చేశారు. Allocate అయిన సీట్లు ఇప్పటికయినా పేర్లు announce చేయలేదు కాబట్టి ముఖ్యమంత్రిగారు శ్రద్ధవహించి సీట్లనిప్పించి మాపిల్లలకు అన్యాయం లేకుండా చేస్తారని ఆశిస్తున్నాను ఇక మొదట వేంకటేశ్వర యూనివర్సిటీకి వేంకటేశ్వర దేవస్థానంవారు medical college కు 50 లక్షలు యిస్తాంఅన్నారు అడిగితే యింకా ఎక్కువ యివ్వవచ్చు Medical College, Engineering College యీ Ceded districts, Nellore district కు సంబంధించినంతవరకు తిరుపతిలో స్థాపిస్తే బాగుంటుందని నా అభిప్రాయం యూనివర్సిటీలో బహుశః వాల్టేరు యూనివర్సిటీలో మాదిరిగా ఒకయింజనీరింగు కాలేజి పెట్టవచ్చు. ఎందుకంటే దేవస్థానం ధర్మసత్రం మాదిరిగా కొన్నిలక్షల డబ్బు యివ్వడానికి సిద్ధంగా వున్నది వేంకటేశ్వర దేవస్థానంవారు 50 లక్షల రూపాయలను medical college కు యిస్తామని వాగ్దానం చేసినట్లు meeting పెట్టి resolution pass చేసినట్లు విన్నాను బహుశః పేపర్లోకూడా వచ్చిందేమో సాధారణంగా వెనుకబడిన జిల్లాలకు మెడికలు కాలేజీలలో తగిన ప్రాతినిధ్యం యివ్వలేదేమోనని నాఅభిప్రాయం. Ceded, Srikakulam, Vizag and Nellore జిల్లాలకు medical engineering కాలేజీలలో 50 percent రావడం forward districtsలో 100 percent యివ్వడంలో మరల మన ముఖ్యమంత్రిగారు విచారిస్తారని నేను పదేపదే ప్రార్థిస్తున్నాను. అందువల్ల నేను మరల చీఫ్ మినిష్టరుగారికి మనవిచేసేదేమిటంటే తనసొంత జిల్లాలో యీ college grant యిస్తే కొందమ జిల్లాలు ఏమయినా అనుకుంటారని అనుకోకుండా V. R College క్రింద జాస్తిగా grant యిస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*Sri A YERUKU NAIDU — అధ్యక్షా, ఈ బడ్జెటు డిమాండు 5 కోట్ల నిల్వక ప్రతిపాదిస్తూ శాసనసభ ఆమోదంకోరుతూ ప్రవేశపెట్టారు. విద్యా

శాఖామాత్యులు, రాష్ట్రీ ఆదాయంలో షుమారు నాలుగవవంతు ఖర్చు కనిపిస్తూ ఉన్నది శుభసూచకం, అయినా మన రాష్ట్రీ అవసరాలను బట్టి చూస్తే యీ మొత్తము చాలదేమో అనిపిస్తుంది భారతదేశానికి స్వాతంత్ర్యము రాకముందు భారతీయుల దృష్టి విద్యాభివృద్ధిపైననే ఉండేది యుద్ధానంతరం దేశంలో ఏర్పడిన bad situation లో మనదృష్టిఅంతా ఇరిగేషన్ మీద వెళ్లినందువల్ల, విద్యాభివృద్ధినిగురించి మనము అభివృద్ధిచేయవలసినంత చేయలేదేమో అని విన్న విస్తున్నాను ప్రస్తుత సెకండరీ విద్యావిధానములో ప్రభుత్వ శ్రద్ధచాలదని నేను చెప్పగలను. ఉన్న 675 సెకండరీ స్కూళ్లలోను, 450 జిల్లాబోర్డు క్రింద ఉన్నాయంటే రెండు మూడు వంతుల స్కూళ్లు జిల్లాబోర్డు అధీనంలో ఉన్నాయి జిల్లాబోర్డు పరిస్థితులు ఏలాగు ఉన్నాయంటే, వారి ఆర్థిక పరిస్థితులు బాగాలేక, స్కూళ్లను manage చేయలేక అక్కడ ఉన్న ప్రజలను building, equipment ను గురించి పదే పదేసార్లు చందాలు ఇస్తేగాని మీస్కూళ్లు నిలవవని చెప్పుతూ, వెనువెంటనే ఎప్పటికప్పుడు మీస్కూలు close చేసివేస్తాము అని పదే పదేసార్లు ఇటువంటి బెదరింపులతో అక్కడిప్రజలను బాధించడం చాల విచారకరమైన విషయం. ఆ కారణంచేత ప్రభుత్వం సెకండరీ విద్యావిధానంలో కొంచెము శ్రద్ధతీసుకొని జిల్లాబోర్డుకు విడిచిపెట్టకుండా ప్రజలను పదే పదే సార్లు చందాలు ఇవ్వమని, పన్నులమూలంగా అడుగుతున్న ప్రజలను మళ్లాచందాలు ఇమ్మంటే చాలాకష్టంగా ఉంటుంది కాబట్టి ప్రభుత్వం ఈ విషయమై తలపెట్టి ఏదో ఒక స్కీము కనిపెట్టి సెకండరీ విద్యావిధానములో ప్రభుత్వం శ్రద్ధతీసుకొన వలసిందని కోరుతున్నాను. ముఖ్యంగా విద్యాశాఖామాత్యులు వారు ఉదయం చదివిన రిపోర్టులో 14 స్కూళ్లలో 4th form కూడ open చేయకూడదని ఆర్డర్సు ఇచ్చినట్లుచెప్పి ఉన్నారు అయితే అక్కడపరిస్థితి ఏమి అవుతుంది, డబ్బు ఇవ్వలేని ప్రజలు స్కూలులో చదువుకోడానికి అవకాశంలేకపోతే మనం శ్రేయోరాజ్యం స్థాపించాలంటే ఏలామార్గం ఏర్పడుతుందో నాకు అర్థంకాలేదు. కాబట్టి అటు వంటి పరిస్థితులలో చేసిన వాగ్దానాలను చెల్లించుకోమని చెప్పాం అన్నారు. కాని అప్పటి పరిస్థితులకు ఇప్పటికీ చాలావ్యత్యాసం ఉంది అప్పుడుధరలు ఉన్న రోజు లలో వారు వాగ్దానముచేసి ఉండవచ్చును. ఇప్పుడు ధరలు తగ్గిపోయిన దినములలో వాండ్లు fulfill చేయలేరు కాబట్టి అది ప్రభుత్వంకొంచెం కనికర దృష్టితో యోచించి 4th form open చేయడానికైనా అవకాశం ఇస్తారని నేను కోరుతున్నాను తరువాత అధమం తాలూకాకేంద్రాలలో అయినా high schoolను full equipped high school గ అక్కడ జిల్లాబోర్డుగాని ప్రయివేటు మానేజిమెంటుగాని చేయనపుడు ప్రభుత్వం శ్రద్ధవహించి వాటినికూడ ఒక క్రమ శిక్షణలోకి తీసుకొనివస్తారని విశ్వసిస్తు ఇంతటితో విరమిస్తున్నాను

* **Sri P. SREERAMULU.**— అధ్యక్షా, ఈవిద్యావిషయం పైన ప్రతిపాదించ బడినటువంటి డిమాండు ముఖ్యమంత్రి ప్రసంగము కనపఱచిన విద్యావిధానంలో అభివృద్ధి లోగడకన్న ఇపుడు జరుగపొయ్యేటటువంటి మార్పు లు చాలాహర్షించ తగిన విషయం విద్యావిధానంలో, విద్యావిషయంలో ముఖ్యంగా క్రిందిమెట్టు చూడవలెనంటే గ్రామాలలో ప్రాథమికవిద్య elementary స్కూళ్ళనుంచి ఒకవిధముగ సమీక్ష చేసికొనవలసియున్నది. ప్రస్తుతం

సోదర సభ్యులు, శ్రీ శేషాద్రి గారు చెప్పినట్లుగ గ్రామాలలో elementary స్కూళ్ళలో ఉన్నటువంటి విద్యావిధానము నానాటికిక్షీణిస్తు ఉన్న విషయం మనమందరము ఒప్పుకోవలసినటువంటిదే దానికికారణం higher grade training మాత్రమే పొందిన ఉపాధ్యాయులు చేసే విద్యాబోధన వలన విద్యను పెం పొందించే అవకాశం లేకుండా ఉంది. అందువల్లనే ప్రభుత్వం దానిని గమనించి ప్రజలయొక్క agitation గుర్తించి secondary grade టీచర్లకు తక్కువ కానటువంటి ఉపాధ్యాయులే విద్యాభోదన చేయడానికి అర్హులని మార్పుతీసుకొని రావడం చాలా హర్షించతగిన విషయం అందులో elementary స్కూళ్లు ఉన్న టువంటి భవనములు చాలచోట్ల అద్దెభవనాలు బోర్డు స్వంతభవనాలు చాల తక్కు వగా ఉన్నాయి. ఈభవనాలు నిజంగాచూస్తే పిల్లలు కూర్చొనడానికి ఏమాత్రం వసతి లేకుండా కేవలం బందిలిదొడ్లుగా మాత్రం ఉన్నటువంటి building లు అనేక గ్రామాలలో ఇప్పటికికూడా కానవస్తున్నాయి నిజంగా ఈవిద్యా విధా నము elementary schools లో ఉన్నటువంటి క్షీణదశవలన బోర్డుస్కూల్సుకు పిల్లలను పంపించడం మానుకొని, గ్రామాలలో ప్రయివేటు స్కూళ్లు పెట్టించటం వలన పాఠశాలలలో సంఖ్య తగ్గిపోవటానికి ప్రబలమైన కారణంగా కనబడుతుంది. పోతే secondary education విషయంలో ముఖ్యంగా గ్రామాలలో ఈమధ్య 4, 5 సంవత్సరాలనుండి ఎంతోమంది దాతలు ముందుకువచ్చి పెద్దపెద్ద, వేలు, లక్షలు ఖర్చుపెట్టి భవనాలు కట్టించి ఈవిద్యా విధానానికి తోడ్పడి,- జిల్లాబోర్డు లకు గవర్నమెంటుకుకూడ సహాకారంచేసినారు వారుచేసినటువంటి దాతృత్వాన్ని ప్రభుత్వం గుర్తించవలసియున్నది ఈసెకండరీ స్కూల్సులో అవసరమైనటువంటి తరిఫీదు పొందినటువంటి, B. Ed , training అయిన ఉపాధ్యాయులు తగినంతగ లేనందువల్ల ఒక్కొక్క high school లో 6, 8 నెలలు దాటినప్పటికి official year లో నిజంగా దానికి అవసరమైనటువంటి mathematics లోను, science లోను ఇతరవిషయాలలో తరిఫీదు పొందిన ఉపాధ్యాయులు లేకపోవడంవల్ల ఆ కొరతవల్ల results సక్రమంగా అనుకొన్నట్లు రాకుండాపోతూ చాలా ఆశా భంగం ఈదాతలకు, విద్యార్థులకు కలుగుతూ ఉన్నమాట వాస్తవం. అందువల్ల అవసరాన్ని గుర్తించి రాష్ట్రంలో ఈ B. Ed., training పొందడానికి అవసర మైనటువంటి training schools ను ఇంకా వృద్ధిచేయవలసిందని చెప్పి ముఖ్యమంత్రిగారికి తమద్వారా నేను మనవిచేస్తున్నాను పోతే సెకండరీ స్కూళ్లలో bifurcated courses అని చెప్పి ఈమధ్య మూడు సంవత్సరాల పైనుంచికూడా ప్రవేశపెట్టిఉన్నారు. ఆ bifurcated courses లో ముఖ్యంగా ఇంజనీరింగు, agriculture వగైరా విషయాలలో చూస్తే అందులో తరిఫీదు పొందినటువంటి L. M. E , L. E. E. పరీక్షలు ప్యాసైన టీచర్సు బోర్డు సెకం డరీ స్కూల్సులో నియమింపబడినపుడు వారికి యిచ్చే జీతపుస్కేల్సు ఏ ఇతర గవర్నమెంటు డిపార్టుమెంటులోనో ప్రవేశిస్తే వారికి ఇచ్చేటటువంటి స్కేల్సు కన్నా చాలతక్కువ. మామూలు B. Ed ఉపాధ్యాయుడికి ఇచ్చే టటువంటి జీతమే వీరికికూడా ఇస్తుఉన్నందువల్ల టెక్నికల్ పరీక్షలలో తరిఫీదు పొందినటువంటి ఉపాధ్యాయుడు బోర్డు హైస్కూలులో నియ మింపబడినప్పటికి కూడ, ఏ 2, 3 నెలలోపుండి

department లో అయినాసరే తనకు ఏ ఇతర ఉద్యోగం లభించినా బోర్డు వుద్యోగానికి అప్పటికప్పుడు వదలిపెట్టి ఇతర గవర్నమెంటు ఉద్యోగంలో చేరడం తటస్థించుచున్నది అందువల్ల యీ bifurcated courses introduce చేసినప్పటికి కూడ దానివలన పొందవలసిన లాభం ఈ విద్యార్థులు పొందలేక పోవడం, పరీక్షలలో కూడ ఎక్కువమంది తప్పటంవలన యేమాత్రము ప్రోత్సాహకరముగ ఉండకపోవడం అనుభవం వల్ల స్పష్టంగా కనబడుతుంది అందువల్ల అట్టిసాంకేతిక విద్యలలో తరిఫీదు పొందినటువంటి ఉపాధ్యాయులకు ప్రభుత్వం ఇతర department లలో ఇస్తున్నటువంటి ప్రభుత్వస్కేల్సు యిచ్చి అట్టివారినే సెకండరీ స్కూళ్లలో నియమించటం అవసరం. ఈ L M. E, L E. E, Agriculture ద్వారా టెక్నికల్ పరీక్షలలో వుత్తీర్ణులై బోర్డులో నియమింపబడిన యీ ఉపాధ్యాయులకు కూడ ఆస్కేల్సు adopt చేయవలసిందని ప్రభుత్వానికి ప్రత్యేకంగా నేను విన్నపం చేస్తున్నాను. ఈ గ్రామాలలో ఉన్నటువంటి High School భవనాలకు, పట్టణములలో ఉన్నటువంటి కాలేజీలకు, పంచాయితీ బోర్డులు ఏమాత్రం కూడ భవన నిర్మాణములలోనూ అట్టి విద్యాసంస్థలకు యే యితర విధములకూడా పంచాయితీ బోర్డువారికి వున్న ధనంనుండి ఈ సెకండరీ ఎడ్యుకేషన్ విషయంలో ఏమాత్రం ఇవ్వటానికి వీలు లేదనిచెప్పి శ్రీ Rajagopalachari Chief Minister గా ఉన్నప్పుడు, composite state లో ఒక G. O ప్యాసు చేశారు ఆ G.O. వల్ల గ్రామాలలో ఎంత దాతలు ముందుకువచ్చి విరాళాలు వసూలుచేసి ఇస్తున్నప్పటికి కూడ, విరాళాలు ఇవ్వ లేనటువంటి బీదగ్రామాలలో ఆ యా పంచాయితి బోర్డు వారికున్న ధనములో నుంచి ఏమాత్రం విరాళాలు ఇవ్వటానికి వీలులేదని వెనుకటి ఆ G. O. వలన చాల అడ్డమువస్తున్నది కాబట్టి నామనవి ఏమంటే ముఖ్యంగా గ్రామాలలో పంచాయితీ బోర్డు చేయవలసినటువంటి పనులు—రోడ్లు, బావులు మొదలైన అనేక కార్యక్రమాలు, నిర్వహింప బడుచున్నప్పటికి, విద్యావిషయంలో కూడ, ఆ పంచాయితీ బోర్డు ఆదాయాన్నిబట్టి, కొంత మొత్తాన్ని యివ్వటానికి అనుమతి యివ్వవలసియున్నది ఉదాహరణకు దీపాలు ఇవ్వాలంటె నూటికి 15 వంతుల ఆదాయమునకు లోబడి ఇవ్వవలసివుంటుంది అనే నియమము ఎలాఉన్నదో, అలాగే బోర్డుల ఆదాయాన్నిబట్టి ఒక percentage ని నియమించి, ఈవిద్యా విషయములో కూడ పంచాయతీ బోర్డులనుంచి విరాళాలు ఇవ్వడానికి అనుమతించి ఆవిధంగా ఈ గవర్నమెంటు ఉత్తరువులు సవరించవలసిన అవసరమున్నదని నేను ప్రభుత్వానికి తమద్వారా మనవిచేస్తున్నాను.

SRIMATHI C. AMMANNA RAJA —ఉపాధ్యక్షా, విద్యాశాఖ సమర్థులైన మంత్రిల చేతులలో ఉన్నందువల్ల, దానికి కావలసిన న్యాయం జరుగుతున్నదని చెప్పవచ్చు. ఇప్పుడు వచ్చినటువంటి విమర్శలు, సూచనలు వారు ఆలోచించనివికాదు, కాని చేతకానందువల్లనే అవి చేయలేకపోయినారని అనుకొంటాను. సాధారణముగా, అన్నిశాఖలకంటె విద్యాశాఖకే ఎక్కువ allotment ఉంటుందన్న విషయము అందరికి తెలిసినదే కాని, ప్రతి ఇంట, ప్రతిబిడ్డ పొందవలసిన సహాయం దీనిలోనే ఉన్నది కాబట్టి, దీనికి ఎంతఇచ్చినప్పటికిని చాలదు. ఈపరిస్థితులలో private managed schools ను గూడ ప్రభుత్వమే తీసుకోవాలని

వొత్తిడి తీసుకురావడం ఏవిధంగా సమంజసంగా ఉన్నదో నాకు తెలియడంలేదు. అది మనను కోరవలసిన విషయముకాదు. చాలామట్టుకు ఈ వొత్తిడి అక్కడ పనిచేస్తున్న teachers వల్లనే తేబడిందని నేను అనుకొంటున్నాను సాధారణముగా, ఏడిపార్టుమెంటులోను ఉద్యోగము దొరకనటువంటివాళ్ళు teachers గా వెళ్లుతూ ఉంటారు అందులో private schools లో teachers గా వెళ్ళేవారు, ఇంకేమి గతిలేకపోతేనే అక్కడికి వెళ్ళుతారన్నమాట అక్కడికి వెళ్లినప్పటినుంచి, వాళ్ళ మేనేజర్సుమీద తప్పులు వెదకడం ప్రారంభిస్తారు వాళ్ళు ఆవిధంగా చేయడం న్యాయంకాదు, మనందాన్ని ప్రోత్సహించడంకూడ న్యాయంకాదు చాలా మట్టుకు మనమందరము ఏదోఒక Mission School లోనో, Aided School లోనో చదువుకొన్నవాళ్ళమే ఇప్పటికికూడ సాధారణముగా A C సుబ్బారెడ్డి గారు ఎంత న్యాయం మాట్లాడుతారో తెలియదుగాని, ఈరోజు చెప్పిన విషయం మాత్రం చాలాన్యాయం. ఒకసారైనా సత్యం మాట్లాడారు.

Mr. DEPUTY SPEAKER —వారు ఇక్కడలేరండి. వారులేనప్పుడు, వారినిగురించి మాట్లాడరాదు.

SRIMATHI C. AMMANNA RAJA :— వారేచెప్పారు ; మునిసిపల్ ఛైర్‌మెన్‌గా వారుఉన్నప్పటికినీ, మునిసిపల్ స్కూల్సుకంటె aided schools లో చక్కని శిక్షణ ఇవ్వబడుతుందని, అందుచేతనే వారిపిల్లలు అక్కడ వెళ్ళేవరకు ఓనామాలు రాలేదని అన్నారు. అది మన అందరి అనుభవము కూడాను. కనుక, వాళ్లవల్ల మనం ఇంతమేలు పొందుతూవుండి వాళ్ళను ఇంత తీవ్రంగా విమర్శించడం అనేది న్యాయమని నేను అనుకోవడంలేదు. మనదేశంలో కొద్దిగా స్కూల్సు ఉన్నప్పుడు, వారు నిజంగా ఎక్కడనుంచో ఇతరదేశాలనుంచి ఇంత దూరము ఇక్కడికివచ్చి, ఎన్నోకష్టాలకు ఓర్చి చక్కని విద్య మనకందరికిని నేర్పారు. School buildings ఉన్నా, లేకపోయినా, చెట్లక్రిందైనా కూర్చొని మంచి, చక్కని విద్యను నేర్పుతూఉంటారు. Missionary spirit అని మనము సాధారణముగా వాడుతూ ఉంటాము. వారువచ్చినప్పుడు వేరేఉద్దేశంతో, అనగా వారి మతాన్ని ప్రచారంచేసే ఉద్దేశంతో—ఆ బాధ ఇప్పుడు ఉన్నదని నేను అనుకోవడం లేదు—వచ్చి ఉండినప్పటికినీ మంచి పద్ధతులలో వారు శిక్షణ ఇస్తున్నారనే ఉద్దేశంతోనే మన బిడ్డలను వాళ్ల school కు పంపుతున్నాము మనం అక్కడకు వెళ్లినపుడు, చక్కగా, ఎంతో ప్రశాంతంగా ఎటువంటి అల్లరిలేకుండా మంచి discipline తో పిల్లలు అక్కడ ప్రవర్తిస్తూ ఉంటారు, చూడడానికి చాలాసంతోషంగా ఉంటుంది ఇకపొరబాట్లు అనేవి అన్నింటిలోను ఉండవచ్చు అన్నిసంస్థలలోను ఉండవచ్చు కనుక చిన్నచిన్న పొరబాట్లను చూచి ఇవిబాగా పనిచేయడంలేదని, teachers కు అన్యాయం చేస్తున్నారని, గనుక వీటిని తీసుకోవాలని అనుకోకూడదు ఒకవేళ వీళ్లు జీతాలలో కొద్దిగా, grants కోసం, తగ్గించి ఇచ్చినప్పటికీ, ఆ డబ్బును ఏ building కొరకో, ఏ equipment కొరకో వారు ఉపయోగిస్తారేగాని మరొకటికాదు నిజంగా వారు ఎంతెంతో డబ్బు తెప్పించి మనకొరకు ఖర్చుపెడుతున్నారంటే వారికి వచ్చే లాభమేమో నాకు తెలియడంలేదు. మతప్రచారంకొరకు అంటే, అదిఎంతమట్టుకు

జరుగుతున్నదో నాకు తెలియదు కాని వారివల్ల చాలామేలు మాత్రం పొందుతున్నాము అని మాత్రం తెలుసును అటువంటి పరిస్థితులలో వారి చేతుల లోనే ఈ సంస్థలు కొన్నాళ్లు ఉంటే ఇంకా ఏమైనా మార్పులు తేవలసియుంటే, తెప్పించి పనిచేయించుకోవాలి గాని ఆ సంస్థలను తీసుకోవలసిన అవసరంలేదు. ఈ విధంగా అనేక private institutions ఉన్నాయి చాలా కాలంగా పని చేస్తూ ఉన్నాయి. అనేక పరీక్షలకు తర్ఫీతు చేస్తున్నారు రాజను అక్కడ సంస్కృతంలోను ఇతరవాటల్లోకు శిక్ష పరీక్షలకు పంపుతున్నారు అక్కడ చదివి మంది విద్యా ప్రపంచులయ్యారు. Destitutes గా ఉన్నటువంటి అనేకమంది లకు ఉపాధి కల్పిస్తున్నారు కాని, ఈ మధ్యన నేను అక్కడికి (రాజమండ్రికి) వెళ్లినప్పుడు గవర్నమెంటు అనేక విధాల బాధలు పెడుతున్నారని, కొత్తరూల్సు తీసుకొని వస్తున్నారని, దానివల్ల, ఆసేవాసదనంలో వారందరుకూడ చాలాబాధ పడుతున్నట్లు చూచాను. కనుక పురాతనమైన institutes మీద ఏమైన కొత్త rules, పెట్టేటప్పుడు వారి కష్ట సుఖాలుగురించి కొంత ఆలోచించాలి. వారికి న్యాయమైన పరిస్థితులు మనంఏర్పాటు చేయాలి అదనంగా కూడ మనం ఏదైనా సహాయంచేయ వలసి ఉంటే అది మనం చేయాలి. ఇన్నాళ్లనుంచి అనేక విధాలుగా మన దేశానికి సేవ చేస్తున్న ఈ సంస్థలకు ఏవో కొత్తరూల్సుపెట్టి వొత్తిడిచేసి వారిని బాధించడం మంచిదికాదు. ముఖ్యంగా శారదానికేతనము, గుంటూరు, సేవా సదనము, రాజమండ్రి, ఇవి చాలామంచిపనులు చేస్తూన్నాయి. వాటికి కొత్త రూల్సు పెట్టినట్లైయితే ఈ రూల్సుకు వారు పట్టుకోలేకపోవచ్చు. ఆ institution పోయినట్లైతే మనదేశానికే కొంత నష్టము. కనుక ఈవిషయాన్ని కొంతగుర్తు ఉంచుకొని వారికి చేయవలసిన సహాయము చేయాలని గవర్నమెంటును కోరు తున్నాను.

The Hon. Sri B. GOPALA REDDI :— ఒక్కొక్క [illegible]కు ఒక్కొక్క rule పెడితే ఎట్లాగండి ?

SRIMATHI C. AMMANNA RAJA :—Rules పెట్టేటప్పుడు వారికి కావలసిన సహాయంచేయమని కోరుతున్నాను. కొత్త qualifications ఉన్న teachers కావాలనో లేక ఉన్న teachers కొత్తగా qualify కావాలనో ఆ విధంగా rules పెడుతూ ఉంటారు. ఇలాంటి విషయాలు నాకు తెలుసును. కొంతమంది B Sc. చదివిన teachers ఎన్నాళ్ళనుంచినో 10, 15, ఏళ్లుగా English నేర్పుతున్నారు. అటివంటి వారిని ఇప్పుడు "మీరు ఇంగ్లీషు చదివితే తప్ప English నేర్పడానికి అర్హులు కారు అంటే వారు ఇప్పుడు వారి కొడుకుల తోను, మనుమలతోను కూడ పరీక్షలకు ఏవిధంగా కూర్చోగలరో ఆలోచించుకొన వలసిందని కోరుతున్నాను అది న్యాయమని నాకు తోచడంలేదు. కాబట్టి ఇన్నేళ్ల నుంచి వారు సక్రమంగా ఏలాటి bad remarks లేకుండా, పిల్లలను తర్ఫీతు చేసి పరీక్షలకు పంపి మంచి results తెచ్చుకొంటున్నప్పుడు, కొత్తగా ఒక rule వాళ్ల మీద ఆపాదించడం అంతగా చేయదగిన విషయం కాదేమోనని నేను

అనుకొంటాను Physical Education Training Collegeని ఒకటి పెట్టుతామని గవర్నరుగారి ఎడ్రసులో చూచినట్లు నాకుజ్ఞాపకము అది యీ పారిబడ్జటు స్పీచ్‌లో కనబడలేదు ఇక్కడే ఎందుకుపెట్టాలి, విజయవాడలో ఎందుకుపెట్లగూడదు, అని Chief Minister గారు అంటున్నారని అప్పారావుగారు చెప్పారు

The Hon. Sri B. GOPALA REDDI.-నేనుఏమి అన్నానోగాని నాకు జ్ఞాపకములేదు

SRIMATHI C. AMMANNA RAJA —ఏమైనప్పటికిన్నీ, మొత్తము మీద ఒకకాలేజి స్థాపించబడివున్నది అయితే దానికి చక్కని building మాత్రం ఒకటి లేకుండావుంది. అందులో చాలావరకు equipment వున్నది చాలమంది qualified teachers గూడావున్నారు. దానికొరకు కొంతసహాయము ప్రభుత్వము చేయాలి. అంటె, దాన్ని గవర్నమెంటు తీసుకుంటే బాగుంటుంది. ఎందుకంటె ప్రతిసంవత్సరము ఆ కాలేజీకి ఎంతవరకు ఖర్చు అవుతున్నదో చూడండి. దానికిగాను ఎంతవరకని, ప్రజలు డబ్బు సహాయ్యాను చేయగలుగుతారు? ఎవరో ఒకరువుండి వారియొక్క పలుకుబడిని ఉపయోగించి collect చేస్తూంటే, అది ఆ విధంగా ఎన్నాళ్లు జరిగేటట్లు? వచ్చే సంవత్సరము అది వుంటుందో, పోతుందో అనేభయము వుంటున్నది. దీన్ని Five Year Plan లో include చేయబడింది కాబట్టి దీన్ని తప్పకుండా ప్రభుత్వము తీసుకొని run చేస్తే బాగావుంటుంది. ఇంకొకటి మరొకచోట పెట్టుకోవచ్చు లేకపోతే అక్కరలేదు. కాని యిదిచాలా అవసరమైన institution మద్రాసు institution తో సరిపోల్చి చూస్తే, దానిమోస్తరుగానే యిదిగూడా తయారైంది. ఆ మాదిరిగా ఉన్న parellel institution ఆంధ్రదేశములో యిదిఒక్కటే, అని మనమందరము సంతోషించవలసిన విషయము. కనుక దీన్ని ప్రభుత్వము తప్పకుండా తీసుకోవాలని కోరుతున్నాను

మనం ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో వున్నప్పుడు మనకు Library లోను, Museum లోనూ రావలసిన భాగము అక్కడనే వుండిపోయినవి అందులో మనకు ఎంతభాగము వచ్చిందో నాకు తెలియదు. Museum లో ఏమాత్రం భాగము మనకు ఉంటుందో గూడా నాకు తెలియదు. మంత్రిగారు కొద్దిగా చెబితే నేను సంతోషిస్తాను.

ఇక్కడ శ్రీరంగనాధమొదలియారుగారు చిత్తూరు జిల్లాలో వున్న అరవ వారికి అరవము నేర్పించడానికి, వారికి ప్రత్యేకంగా training courses పెట్టించి teachers ను తయారు చేయించాలని కోరారు. కాని చిత్తూరు జిల్లాలో వుండే అరవవారు చాలా కొద్దిమందే వుంటారు అవసరమైతే ఒక అరవ section ను పెట్టమని అడిగితే బాగా వుంటుందని నా అభిప్రాయం. నిజానికి ఒక్క subject కోసము, అరవము నేర్పించడానికి ఒక trained teacher ను వేసి teaching చేయించితే చాలుననుకుంటాను. అట్లాకాకుండా కేవలం ఒక్క అరవము కోసము ప్రత్యేకంగా ఒక స్కూలును పెట్టించమంటే, అది నిజంగా మనకు అవసరముండదని నాఅభిప్రాయము. వారు ఆ విధంగా కోరడముకూడా అంతసమంజసమైన విషయము కాదు.

Sri S. RANGANATHA MUDALIAR — I wanted only a section and not a separate School

SRIMATHI C AMMANNA RAJA —Training Class అన్నప్పుడు, అందులో 10 మందో, 20 మందో ఉంటారు అంతవరకు మనకు అవసరమే అదినాకు పూర్తిగా అర్థము అయింది

Sri S RANGANATHA MUDALIAR — Honourable Member కు చిత్తూరు సంగతి యేమీ తెలియదు

SRIMATHI C. AMMANNA RAJA —చిత్తూరు కంటె మద్రాసు సంగతి కూడా నాకుబాగా తెలుసు. పైగా, రంగనాధ మొదలియార్ గారుకూడా యీ విషయము యింకా కొంచెము తెలుసుకుంటే బాగావుంటుందేమో I am sure Hon Member knows sufficient Telugu to understand what I am saying మద్రాసులో వున్నప్పుడు basic training class జరిపినప్పుడు, ఆ Training College Committee లో నేనువున్నాను Basic training అంతా కూడా అరవములోనే నేర్పబడుతూ వుండేది. అందులో తెలుగు సెక్షనే లేకుండా ఉండేది ప్రతిసంవత్సరముకూడా తెలుగువుంటేతప్ప, తెలుగులో teachచేయడానికి Middle Schools, Model Schools అనేవి వేరేపెట్టలేదు. నేను వెళ్లిఅడిగినప్పటికి గూడా పెట్టలేదు అటువంటప్పుడు చిత్తూరులో ఒక section పెట్టాలని, trained teachers ను తయారు చేయాలని చెప్పడములో అది అంతసమంజసముగాలేదు. ఇంకను నేను Chief Minister గారిద్వారా తెలుసుకోవలసిన విషయము యేమిటంటే అక్కడ మద్రాసులో Queen Mary's College లో యింకా కొంత వరకు మనకు కొన్ని seats provide చేయమని అడిగినాకూడా వారుఅక్కడ allot చేస్తున్నట్లులేదు. ఏ ఏ seats ఏ ఏ classes ఎన్నెన్ని allot చేస్తున్నారో గూడా నాకుతెలియదు కాని నేను వినడము యేమిటంటే, వారికి demand లేని classes లో, మిగిలిపోయిన seats ను మాత్రమే యిస్తున్నట్లుగా తెలిసింది. ఇప్పుడు History Honours Class లో seats యివ్వమని అడిగితే, లేవు అని జవాబుచెప్పి, Geography Honours లో seats వున్నవి, అవసరము వుంటే అవితీసుకోండి, లేకపోతే లేదు, అని జవాబు యిస్తున్నారని విన్నాను అదేవిధంగా Women's College లో అన్ని sections కూడా ఏర్పాటుఅయ్యేటంత వరకు, మనకు సీట్లు యివ్వరు. ఈ విధంగా వారు ఎంతవరకు అధికారము చెలాయిస్తారో నాకుతెలియదు. మనకువున్న యితర sections లో, ఎదోకొంత percentage తీసుకొని, మనముగూడా వారివద్ద claim చేయడానికి మనకు అధికారము వుండేలాగున చేసుకుంటే బాగుంటుందని అంటున్నాను. ఎందుకంటే మనకుగూడా చాలా colleges వున్నవి. స్త్రీలకు గూడా కావలసినన్ని వున్నవి. కానిఅన్ని subjects వున్నప్పటికినీ, అవి నేర్పడములేదు. Boys Colleges లో కూడా కష్టంలేని subjects మాత్రం పెట్టుతున్నారు. మళ్లీ వాళ్లు pass అయినతరువాత కూడా ఉద్యోగము దొరకటము కష్టమే. లేదా, ఇంకొక training కు అయినా వెళ్లడం కష్టమే. ఆ విధంగా జరుగుచున్నది. ఏదోసులభంగా పాసుఅయ్యే subject తీసుకొనటానికి చేర్పు

తున్నారు కాని అటువంటి విద్య ప్రయోజనములేదు ఇంకా subjects ఎక్కువగా పెట్టితేనే, అది ఒక కాలేజి అని అనిపించుకుంటుంది లేకపోతే ఏదో out of necessity వుద్యోగముకోసం అందులో చేరిపోతున్నట్లుగా కనబడుతున్నది లేకపోతే తరువాత అయినా అడగబోయేపనికి కావలసిన subjects కు చదువు కొనేవారు ఆ విధంగాచేస్తే బాగావుంటుంది Colleges మనకు యిప్పటికి వున్నవి చాలుననుకుంటాను కాని మనకు Technical Institutions ఏమీలేవు ప్రభుత్వము Technical Courses కొరకు colleges ను ఏర్పాటు చేయడం చాలా అవసరం దీనికి ముఖ్యమంత్రిగారు యేమిచెబుతారో చూడాలి

తరువాత మనకు State లో ఆస్థానకవులు విషయము యీ బడ్జెటు స్పీచ్‌లో యెక్కడ కనబడలేదు ఈ కవులకు ప్రభుత్వము encouragement యివ్వాలి. మన State కు గూడా యీ ఆస్థానకవి వుండవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. వారి యొక్క services వుపయోగించటానికి వీలు వున్నదో లేదో, యిదివరకెవరైనా ఆస్థానకవులు వున్నారా, ప్రభుత్వము యిదివరలో అట్టివారిని యెవరినైనా యేర్పాటు చేశారా, అనే విషయాలు మంత్రిగారు చెబితే సంతోషిస్తాను తెలుగు భాషా సమితి యింకను మద్రాసులోనే వున్నది దాన్ని యిక్కడ మన ప్రాంతాలకు తీసుకొనివస్తే బాగుంటుందని నేను అభిప్రాయపడుతున్నాను. ఇంకను మన ఆంధ్రకవులు చేసిన పుస్తకాలు ఎన్నోవున్నవి. ఈ సంగతి మన మెంబర్లు చాలా మందికి తెలుసు, చెప్పారుకూడా.

University Education కూడా తెలుగులోనే జరగాలని చాలా మందిచెబుతున్నారు. కాని, నా అభిప్రాయము మాత్రము అదికాదు Subjects English భాషలో వున్నాగూడా, High School Classes వరకు తెలుగులోనే నేర్పుతున్నారు కాని Students S S. L.C.ప్యాసు అయి College Studies కు వెళ్ళినప్పుడు మాత్రం చాలా యిబ్బంది పడుతారు ఇంగ్లీషు భాషలో అన్ని పుస్తకాలువున్నవి మొదటి నుంచి యింగ్లీషు భాషలోనే చదివితే, దానివల్లవచ్చే యిబ్బంది యేమిటో నాకు అర్థము కావడములేదు. దానివల్ల యేదో ready made గావున్న పుస్తకాలు వున్నవి. అవి చదువుకోవాలేగాని, సగము తెలుగు, సగము English యేమి ఉపయోగము ? ఇంతవరకు యింగ్లీషుభాష బాగా అలవాటు అయినవారు వున్నారు చదువుకునే విద్యార్థులు English భాష కష్టమని చెప్పేవారు నాకు ఎక్కడగూడా కనబడడములేదు కాబట్టి Medium of Instruction English భాష High School Classes వరకూ గూడా వుంచే, అది మనపిల్లలకు ఎక్కువ వుపయోగముగా వుంటుంది Medium of Instruction English వున్న చోటికే మాపిల్లలను పంపించుదామనే నాకుఅభిప్రాయం వున్నది. అయితే యిప్పుడు మనకు రానురాను తెలుగులోకే పోతున్నాము. కాని తెలుగు మనకు ఎలాగైనా వస్తుంది. క్రొత్తభాష రావాలని అంటాను. ఇంగ్లీషు చదివితే తప్పు ఏమిటో నాకు తెలియడంలేదు. మాపిల్లలను మద్రాసునుంచి తీసుకొని వచ్చి యిక్కడ చేర్పించినప్పటికినీ, తెలుగువాళ్ళుగనుక వాళ్ళు యిక్కడ తెలుగుకుసరిగా సరిపోయారు. సరీగా చదవనిచే గూడా సరిపోయారు మనము యితరభాషల్ని నేర్చుకొని ఎక్కువ విషయాలు నేర్చుకోవడంలో గొప్పవున్నదికాని, అన్యభాష

పోనుకొని ఒక్కతెలుగునే నేర్చుకోమని చెప్పడం అది అంత పెద్ద విద్యకాదని అనుకొంటున్నాను.

తరువాత సంస్కృతము, హిందీని గురించి చాలామంది చెప్పారు Hindi ని గురించి ఎక్కడాగూడా controversy లేదు. 1957వ సంవత్సరములో హిందీలో S. S. L. C. pass అయివుండాలి అని, అది compulsory అయిందికాబట్టి దాన్ని గురించి నేను ఎక్కువగా చెప్పవలసిన అవసరములేదు Sanskrit మనకు పూర్వకాలపు భాష అందులో చాలా పురాతనగ్రంథములున్నవి Religion అంతా సంస్కృతము మీదనే ఆధారపడివున్నది సంస్కృతభాషకు అంతవ్యతిరేకత వచ్చింది అంటే, అది నాకు చాలా ఆశ్చర్యముగా వున్నది.

నిజంగా యీరోజులలో మనబిడ్డలు మనకంటె అనేక విధాలుగా ఎక్కువ తెలివి గలవారుగా వుంటున్నారు మనము ఎంతనేర్పినా, నేర్పించినా, నేర్చుకోటానికి సిద్ధంగావున్నారు అంటేపదో S S L C. లో పాలకొల్లు Girls High Schoolలో ఎవరూ ప్యాసుకాలేదని, ఆవూరులో వున్న Girls హైస్కూలును వుదాహరణగా తీసుకొనిరావడం బాగాలేదు నిజంగా ఆ Girls High School లోని పిల్లలకు Zero percent వచ్చిందంటే అక్కడి పరిస్థితులేమిటో, అక్కడి teachers ఎవరో ఆ వివరాలు అన్నీ తెలుసుకోవాలంటే, అందుకు ఒక కమిటీనివేసి విచారణచేయ వలసివున్నది. కాని అదిఒక example గా మాత్రం తీసుకుని రావటానికి వీలులేదు. ఈనాడు పిల్లలకు ఎంతవరకు విద్య నేర్పిస్తే, అంతవరకూగూడా చదువుకోటానికి, వాళ్లుతయారుగా వున్నారు మనHindu culture అంతాగూడా సంస్కృతములో యిమిడి పుస్తకాల రూపములో వున్నది సంస్కృతములో చాలామూల గ్రంథాలు వున్నవి ముందు జర్మనీకి వెళ్ళవలసిన పరిస్థితులలో పడ్డాము అంటే నేనుకొన్ని రోజులుగా సంస్కృతము అంటే ఎలావుంటుందో, తెలియదు అలాంటి పరిస్థితులు వస్తాయిఅంటే దాన్ని revise చేసుకోకపోతే, చిక్కువున్నది

ఇక స్త్రీలకు యింటిలోవుండి, ప్రజాసేవ చేయటానికి వీలుగా వుండేది పెద్ద చదువుఏదీ అంటే, medical course ఒక్కటే తరువాత after life లో గూడా అది చాలా వుపయోగించుకోవచ్చు. దీనికి మించినది యింక యేవిద్యగూడా నాకు కనపడలేదు కాని life లో పనికివచ్చేది medical course ఒక్కటే అని నాఅభిప్రాయము

The Hon. Sri B. GOPALA REDDI —After-life? (laughter).

SRIMATHI C. AMMANNA RAJA :—After life అంటె, after their studies.

అన్నివిధాల స్త్రీలకు వుపయోగపడేది మెడికలు కాలేజి ఒక్కటే. యింకా కొంచెము ఎక్కువసీట్లు వారికి మెడికల్ కాలేజీలో యివ్వాలి దానిఆర్గ్యుమెంట్లు ఎన్నైనా గబగబా చదువుతారు చాలామంది పెళ్లిళ్లు చేసుకొని చదువు మానేస్తారు. ఇది వృధా అవుతుంది. పురుషులకు లేకుండా స్త్రీలకు యిచ్చినందు వల్ల ఏమీ ప్రయోజనములేదు. ఇది గవర్నమెంటుకు నష్టము అని చెప్పిన ఆర్గ్యు

మెంట్సు చాలావిన్నాను. లాభము వచ్చినంతవరకే లాభము పొందడానికి మీరంతా సంసిద్ధులై వుండాలని మిమ్మల్ని కోరుతున్నాను. ఇంజనీరింగు కాలేజీలో సీట్లు యివ్వమని మిమ్మలను అడగము. ఎక్కడఅయినా ఒకళ్లిద్దరు వస్తే యివ్వవచ్చు లేకపోతేలేదు మెడిసిన్‌లో సీట్లు కావాలని మాహక్కుగా అడుగుతున్నాను. మెడికలు కాలేజీలో ఎక్కువమంది స్త్రీలు డాక్టర్లుగా తయారయితే తప్ప ఈ మెడికలు డిమాండుమీద చర్చ జరిగేప్పుడు గ్రామాలలో ఎంతమంది మెడికలు aid లేకుండా బాధపడుతున్నారో, ఎంతమంది స్త్రీలు ఈనాటికి పురుషుల వద్దకు వెళ్ళడానికి సిద్ధపడరో అందరు తెలుసుకోవాలి మాకేకాదు. కాబట్టి ఎక్కువగా మెడిసినులో స్త్రీలకు ఎక్కువగా సీట్లు కేటాయించాలి.

చాలామంది A. C C., N C. C. లను గురించి చెప్పారు. ఆక్సులరు కోరు, నేషనల్ కేడేట్ కోరు-అది చాలామందికి వుపయోగమే చిన్న చిన్న పిల్లలను ఎట్లాపంపడమా అనుకుంటూ పంపినప్పుడుకూడా అందులో వాళ్ళు సమర్ధులైనవారు అవుతున్నారు ఆ ట్రైనింగు చాలా అవసరము నేను దానిని ప్రత్యేకంగా ఎందుకు mention చేస్తున్నానంటే ఇదిఒక స్కూలులో వుంటుంది మరొక స్కూలులో యుండదు మామూలుగా ట్రాన్‌స్ఫర్ అయ్యేవాళ్ళు యింకొక స్కూలుకు వెళ్లేప్పటికి అక్కడ నేర్చుకొన్నది అంతా వృధాఅయి పోతుంది వాళ్ళుకుట్టించుకున్న యూనిఫారములు అన్నీకూడా వృధాఅయి పోతున్నాయి ప్రతిస్కూలులో సాధ్యమైనంతవరకు దానిని ఏర్పాటుచేసినట్లయితే పిల్లలు వుత్సాహవంతులుగా, సంతోషముగా అభ్యసించేందుకు వీలవుతుంది అందువల్ల ఇదిచాలా అవసరము అని వాళ్లు అనుకొంటున్నారు. ఈవిషయంలో ప్రభుత్వం తగినశ్రద్ధ తీసుకోవలయును. ఈ అవకాశం నాకు కల్పించినందులకు అధ్యక్షులవారికి నా అభివందనలు తెలుపుచున్నాను

Sri A C SUBBA REDDI —అమ్మన్నరాజాగారు ఒకవిషయము మాత్రము నిజము మాట్లాడినానని చెప్పారు అది ఏమాత్రము ధర్మమో నాకు తెలియడములేదు కనీసము నిజము అబద్ధము అనిచెప్పి అంతా అబద్ధముచెప్పి నానని చెప్పడానికి ఆమెకు, నాకు ఏమీపరిచయములేదు. ఎలాచెప్పారో? ఏమన్నా అపాలజీ యిస్తారా లేదా అని personal explanation అడుగుతున్నాను.

Mr. DEPUTY SPEAKER :—బయట మీసంభాషణలు అక్కడక్కడ విన్న తరువాత ఇక్కడ నిజము చెప్పినారని అనుకొన్నారు

SRIMATHI C. AMMANNA RAJA — ఆయన అపాలజీ సీరియస్‌గా అడుగుతున్నారని నేను అనుకోవడములేదు అయినా నేను అన్నప్పుడు ఆయన ఇక్కడలేరు. నేను అన్నది వారికి తెలియదు

Sri B. RAMA REDDI —ఉపాధ్యక్షా! లలిత కళాప్రియులైన మన ముఖ్యమంత్రిగారి స్వాధీనములో మన విద్యాశాఖ వున్నందుకు చాలా సంతోష దాయకంగా వున్నదని మన మిత్రులు చెప్పినారు కాని వాటన్నింటిని సమన్వయము చేసినా కళాప్రియుడైన ముఖ్యమంత్రిగారి చేతుల్లో వున్నది. కాబట్టి సంతోషమని చెబుతున్నాను.

విద్యా విషయం ఈ ప్రపంచచరిత్రను క్షణక్షణము తన పంథాలమధ్యా తీసికొని పోతున్నటువంటి ఈ శక్తిని ప్రసాదించవలసివుంది ఇటువంటి విజ్ఞానాన్ని మనిషికి సంపాదించి పెట్టినటువంటదానికి కారణ భూతమైనది విద్య. ఇట్టి విద్యకు పునాదివంటిది ప్రాథమికవిద్య. ఇటువంటి ప్రాథమికవిద్యా విధానము ఎంతవరకు సరియైన పద్ధతులలో వున్నది, ప్రాథమిక వుపాధ్యాయులు ఎంతవరకు మన బాల బాలికలకు వుపదేశించడానికి నేర్పరులుగా వున్నారు, ఈ కార్యక్రమమును నెర వేర్చే దానికి వారు ఏవిధమైనటువంటి హూందా కలిగివున్నారు అన్నవిషయం మనము ముఖ్యంగా ఆలోచించాలి.

పూర్వకాలములో గురువులకు శివ స్థానము ఇచ్చివున్నారు తల్లి తండ్రి వెనుక గురువు శివ వాడుగా దైవాన్ని నిర్ణయించి వున్నారు. అటు వంటి మూడవ దైవము అన్నగురువుకు పూర్వకాలంలు ఎక్కువ గౌరవము వుంటూవుండేది. మన అమ్మన్నరాజాగారుఅన్నట్లు బ్రతుకలేకపోతే బడి పంతులు అన్నటువంటి విషయము సార్థకమైనది ఎందుకంటే మనయొక్క విద్యావిధానములో మార్పే అందుకు కారణం ఇప్పుడు ప్రైవేటు aided school వుంచకూడదా అని ఒక విషయము వచ్చిందిగాని నా అనుభవాన్నిబట్టి చూస్తే ప్రైవేటు స్కూల్సు వుంచకూడదు అనిచెప్పడం కాదు. ప్రైవేటు మానేజిమెంట్సు వుపాధ్యాయులకు సరిగా జీతాలు ఇవ్వడములేదన్న నెపముపైన ఆ ఉపాధ్యాయు లందరు ప్రభుత్వాధీనంలోకి స్కూళ్ళు వచ్చినట్లయితే వాళ్ళ జీతాలు సరాసరి ముట్టు తాయనే ఆశచేత ఆందోళన చేస్తున్నారేగాని వేరే ఉద్దేశంతోకాదు. పోనీ జిల్లా బోర్డులలోవున్న వుపాధ్యాయులకు జీతాలు సరిగా ప్రతినెల ముట్టు తున్నాయా? అదికూడా అట్లావుంది వారు చాలా పొరపాటు పడుతు న్నారు సాధారణంగా అది అప్రస్తుతము ఇప్పుడు విద్యావిధానములో అందు వల్లనే ఎలిమెంటరీ స్కూళ్ళ వుపాధ్యాయులకు ఇచ్చేటటువంటి జీతము చాలదు. ఎవరు అయినా ఒక కారణాన్ని సక్రమంగా నెరవేర్చాలంటే ముందు కడుపు చల్లనయితేగాని వాడి మెదడుకూడా చల్లనవ్వదు అప్పుడు వాడు తన విద్యుక్త ధర్మమును, ఆసక్తిని చూపేదానికి అవకాశం ఏర్పడుతుంది. ఎప్పుడయితే వానికడుపు మాడుతూంటుందో, ఒక విధమైనటువంటి నిస్పృహ కలుగుతుందో నిరాశ వున్నప్పుడు విద్యావిధానముకూడారాదు. చెప్పడానికి అవకాశములేదు మనది తెలుగు దేశము. మనవారందరుకూడా తెలుగు భాషలోనే నెరవేర్చాలని కోరుతున్నారు అటువంటప్పుడు మనవిద్యకు పునాదిరాళ్లుగా నున్నటువంటి ప్రాథమిక విద్య బోధించే మనగురువులకు తెలుగు ఎంతవరకు వచ్చు అనేది నాసంశయము. కల్లూరి సుబ్బారావుగారు ఉపాధ్యాయులందరికి ప్రభవలు రావన్నారు. పెద్దవాళ్లకుకూడా ఎంతవరకు ప్రభవలు వచ్చు అన్నది నా సంశయము. ఈ విషయంలో మన ముఖ్యమంత్రిగారుకూడా నాతో ఏకీభవిస్తారని నమ్ముతున్నాను. ఎందుకు ఈ అధ్వాన్నత్వము వచ్చింది? విద్యా విధానములో ప్రాథమిక విద్యావిధానంలో తెలుగుభాషపైన ఒక విధమైనటువంటి

నిరాదరణే అని నా భావము. ఏదో మూడవఫారము ప్యాసుఅయి హయ్యరుగ్రేడు పరీక్ష అయినారు. స్కూల్‌ఫైనలు ప్యాసు కావాలని సెకండరీగ్రేడు పాసు కావా లని అన్నారు. ప్రాథమిక విద్యావిధానంలో నిపుణులు అయినటువంటి వారిని మాత్రమే ఉపాధ్యాయులుగా వేస్తే బాగుంటుందని అనుకొంటాను. మనకు కావ లసింది తెలుగు. పూర్వపు పయాల్ స్కూలులో అన్నీ నేర్చుకొని హయ్యరు గ్రేడు పాసైవచ్చిన వాళ్ళలోనే తెలుగు బాగావచ్చినవాళ్ళున్నారు. ఈనాడు ఎలిమెంటరీ స్కూళ్ళలో చేరిన పిల్లలు 5 సంవత్సరములు వారియొక్క పవిత్రమైన కాలాన్ని వృథాచేస్తే బయటకు వచ్చేప్పటికి చూస్తే కాకి నల్లగా యుండును, కుక్క మొఱుగును, పిల్లి మ్యావు మ్యావు అనును, పాలు తెల్లగాయుండును ఇంతవరకు వాళ్లు నేర్చుకొనిఉంటారు 5వ తరగతి ప్యాసుఅయి వస్తే ఇంతమట్టుకు వస్తుంది. అంతకుమించి ఒక అక్షరముగూడా లేదు. ఈనాడు ఏమైనా ప్రాథమిక విద్యలో ఎలి మెంటరీ స్కూళ్లలో భారతం, భాగవతము, బాలరామాయణము, ఆంధ్ర నామ సం గ్రహం అదిచదివించమంటే వీల్లేదు అంటారు ఎందుకు అంటే అది అయ్యావారికి రాదు. కాబట్టి అది పనికిరాదు ముఖ్యంగాప్రాథమిక విద్యావిధానంలో తీసుకో వలసినది III Form. S. S. L. C. ప్యాసుఅయి ట్రైనింగు అయినవాళ్లను కాదు. తెలుగులో విద్వాన్ పరీక్ష అంతకుసరియైన పరీక్షలు అయివుంటే మన బాల బాలికలు ముందుముందు తెలుగుభాషలో వృద్ధికివచ్చేవిధంగావారికి నేర్పేశక్తిసామ ర్థ్యాలు కలవారిని మాత్రమే ఉపాధ్యాయులుగా పెట్టినట్లయితే ప్రాథమిక విద్యా విధానము బాగుంటుంది. కాని అటువంటి పద్ధతిఏమీలేదు. అయినా ఈaided స్కూ ళ్ళలో ఈ మేనేజర్సు చేసేటటువంటి దుండగాలు వల్లనే ఈ టీచర్ల ఈ విద్యావిధాన ముకు ఈ గతిపట్టింది. కొన్ని మిషను స్కూళ్ళలో G. M. S. మొదలైనటువంటి వాటిలో ప్రతిటీచరుదగ్గర మతబోధన క్రింద 1/12. వ భాగము విధిగావసూలు చేస్తున్నారు. కొంతమంది ఉపాధ్యాయులు నాకుచెప్పివున్నారు దానికి అడ్వాన్సుగా ప్రభుత్వమువారు ఏవిధముగా వారినుండి డబ్బు తీసుకో కూడదన్నారట గాని, ఇప్పుడు వేరొక తంత్రము పన్నినారు. వాళ్ళ జీతము వాళ్ళ చేతుల్లోపెట్టి మీ యిష్టము వచ్చినంత ఖచ్చితంగా ఇస్తే ఇవ్వవచ్చు అనేది మూడు రూపాయలు పట్టుకొనేది కనుక ఇటువంటి లోపాలు సవరించినట్లయితే ఈ aided స్కూళ్లు ఎక్కువగా ప్రజలకు బాలబాలికలకు ఉపయోగకారిగా వుంటాయని భావిస్తు న్నాను ఆ విషయం అంత ముఖ్య విషయంగాకూడా నేనుభావించడంలేదు పైగా మన విద్యావిధానంలో యింకామార్పు చేయాలి

అయిదవ తరగతి pass అయిన విద్యార్థులను High School లో first form కు చేర్చుకొనుటకు మరల పరీక్ష పెట్టుచున్నారు ప్రభుత్వము recognise చేసిన స్కూలులో 5వ తరగతి pass అయిన వారలను సరాసరి 6వ తరగతిలో చేర్చు కొనడానికి ఆక్షేపణ ఏమిటో నాకర్థము కావడములేదు. అందువల్ల కొందరు District Board schools లో 5 వ తరగతివరకు చదివి ఒక సం॥ ప్రైవేటు చదివి

మరల 6 వ తరగతి పరీక్షకు కూర్చొనుచున్నారు కాన 5 వ తరగతి ప్యాసయిన వారందరికి వేరే పరీక్ష లేకుండా సరాసరి First Form లో ప్రవేశించులాగున చేసినట్లయిన దానివల్ల చాలా క్రొత్తపరిస్థితి ఏర్పడుతుందని నేను మనవిచేస్తున్నాను కాని ఆ విధముగాచేయుటకు ప్రభుత్వమునకు ఆర్థిక స్తోమతు లేదంటున్నారు సన్నకారు రైతులకు పన్నులు తగ్గించమంటే ఆర్థిక లోపము, నష్టము, ఉపాధ్యాయులకు జీతములు పెంచమంటే ఆర్థికలోపము ప్రతిదానికి ఆర్థికలోపమని చెప్పుచున్నారు మనిషికి 1 రూపాయి చొప్పున జీతము పెంచిననూ కొన్ని లక్షలు ఖర్చగును ప్రభుత్వము ఇబ్బందికూడా నేను చూస్తునేఉన్నాను కానీ అదేమికర్మమోగాని జీతము చాలక ఉదరపోషణ చేసుకోలేనివారలకే బిడ్డలు ఎక్కువమంది పుట్టుచుండిరి కాబట్టివారికి జీతములు పెంచకపోయినప్పటికి, కనీసము ఉదరపోషణ జరగనివారలకు ఏదోకొంత limit పెట్టి ఆ limit కంటె పిల్లలు పుట్టకూడదనే నిషేధము చేసిన బాగుండునని నేను కోరుచున్నాను కాని ప్రభుత్వము ఈ ఉపాధ్యాయుల మనస్సును సంతృప్తి పరచిననాడే వారు వారి వృత్తియందు ఆపేక్షచూపించి వారు చేయవలసిన కార్యములందు నిమగ్నులగుదురని కళాప్రియులైన మన ముఖ్యమంత్రిగారికి విన్నవించుచుంటిని అటువంటప్పుడు మాత్రమే మన బిడ్డలు బాగా చదువుకొని వృద్ధిలోనికి రావడానికి అవకాశమున్నది. మన బిడ్డలు బాగుపడితేగాని దేశము బాగుపడదు.

* Sri G. JAGANNADHA RAJU -అధ్యక్షా! గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు ప్రతిపాదించిన ఈడిమాండును నేను బలపరుస్తున్నాను. కాని నేను కొన్ని సూచనలు చేయదలచితిని ఈ బడ్జెటులో కేవలము University కి 17 లక్షల 15 వేలు, కాలేజీలకు 44 లక్షలు, secondary education కు 44 లక్షలు, primary education నిమిత్తము 2 కోట్ల 34 వేలు కేటాయించినట్లు కన్పడుచున్నది ఇంతమొత్తము ఖర్చు పెట్టినప్పటికి ఈమొత్తము చాలదనియు ఇంక హెచ్చు ఖర్చుపెట్టినగాని మనము విద్యయందు ఎక్కువగా పురోగమించుటకు అవకాశము ఉండదేమోనని ప్రభుత్వమునకు మనవిచేయుచుంటిని బడ్జెటు speech లో చూచినట్లయిన 11 సం॥ to 14 సం॥ పిల్లలు చదువుచున్నవారు 100 కి 8మంది మాత్రమే ఉన్నారు. 14 సం॥నుంచి 17 సం॥వరకు ఉన్నపిల్లలు బడికి పోవువారు 100 కి 6 గురు ఉన్నట్లు కన్పడుచున్నది కాని మనము కేవలము విద్యకోసము 2 కోట్లు ఖర్చుపెట్టుచున్నాము అని ఆనందించుట నిష్ప్రయోజనము. ఆవిధముగా చూచిన సుమారు 100 కి 6గురుకు మాత్రమే మనము విద్యాభ్యాసము చేయగల్గుతున్నామన్నమాట మనరాజ్యాంగ చట్టములో 10 సం॥నుంచి 11 సం॥వరకు పిల్లలకు నిర్బంధవిద్య గరపవలయుననిఉన్నది. ఈలక్ష్యాన్ని సాధించడానికి మనము వేసిన పథకము సరిపోదని నానమ్మకము. ఈవిద్యావిధానములో చాలా మార్పులు రావలసియున్నవి. ప్రస్తుతము 18 వేల పాఠశాల లున్నవి. అందులో 1572 స్కూల్సును ఈపంచవర్ష ప్రణాళికలో ప్రారంభించవలెనని అనుకుంటే ఇప్పటికి 571 స్కూల్సు మాత్రమే ప్రభుత్వముచే ప్రారంభింపబడినవి. Aided schools విషయములో చాలా వాదోపవాదములు వచ్చినవి కొంతమంది private management తో నడుపబడు పాఠశాలలు చాలా లోపభూయిష్టముగా నున్నవనియు మరికొందరు ఈ పాఠశాలలు private management వాళ్ళ

చేతులలోనే ఉండవలెను, Government తీసుకొనకూడదు, చాలా progressive గా ఉన్నవని చెప్పినారు నేను మనవి చేయునదేమనగా అన్ని స్కూల్సును ప్రభుత్వము తీసుకోకుండా లోపముగానున్న పాఠశాలలను మాత్రమే ప్రభుత్వ అధీనములోకి తీసుకొనవలసినదిగా కోరుచున్నాను Kuppuswamy Committee report లోని 41 సిఫార్సులను అంగీకరించి, 7సిఫార్సులను ప్రభుత్వము అంగీకరించలేదు మిగిలినవాటిని ఆలోచిస్తున్నామన్నారు మధ్యాహ్నంసమయమున పేదవిద్యార్థులకు భోజనవసతి ఏర్పాటుచేయవలెననియు, వారికి పుస్తకములు తదితర పరికరములను ఉచితముగా ఏర్పాటు చేయవలెననియు నేను ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేసుకొనుచున్నాను

తరువాత ఉన్నత తరగతులను చూచినట్లయిన మన రాష్ట్రములో 600 High Schools ఉన్నవి కేంద్ర ప్రభుత్వము ఈ హైస్కూళ్ళ నన్నిటిని multipurpose schools క్రింద తయారు చేయుటకు అంగీకరించినది అట్లు convert చేసిన వాటికి recurring grant 66%, non-recurring grant 25% యిస్తామని వాగ్దానము చేసిఉండిరి కాని ప్రభుత్వమువారు ఇప్పటికి15 schools ను మాత్రమే ఇట్లు convert చేసినారు మిగిలిన పాఠశాలలను కూడా convert చేయవలెనని కోరుచున్నాను. కాని ఈ పిల్లల విషయములో విదేశాలలోవలె వేసంగి శిబిరాలు ఏర్పాటుచేసి excursions కు తీసుకువెళ్ళడము అక్కడ ఆటలు, పాటలు, వ్యాయామములందు ఆరితేరిన వారిగా తయారు చేయడము ఎంతో అవుసరము. దానినిగురించి ప్రభుత్వము ఆలోచిస్తున్నదని ఆశిస్తున్నాను.

తరువాత University grants హెచ్చుగా యిచ్చినట్లు యీ బడ్జెటులో సూచించబడింది Private Colleges కు ఎక్కువ సహాయము ఉన్నప్పటికి సమయానికి సహాయం అందడములేదు. University Grants Commission వారు కేవలము Universities కు డబ్బు యిచ్చుచున్నవిగాని private colleges కు యివ్వడములేదు. కాబట్టి ప్రభుత్వమువారు University Grants Commission ద్వారా వీరికి తగు సహాయం చేయించెదరని ఆశిస్తున్నాను. చాలా colleges లో National Cadet Corps ప్రారంభించారు ఇంకా అన్ని colleges లో కూడా ప్రవేశపెట్టాలని కోరుచున్నాను కాని ఉపాధ్యాయుల వేతనములు పెంచక పోవుటవలననే మన బాలుర విద్యలో లోపము జరుగుచున్నదని అందరు గుర్తించవలెను.Directors of Public Instruction meeting లో ఉపాధ్యాయుల వేతనము 50 రూపాయలకు తక్కువ ఉండరాదని pass చేసినారు. దానిని Madras Government అంగీకరించినది. ఆ ప్రకారము ఆంధ్ర ప్రభుత్వము కూడా అంగీకరించి ఉపాధ్యాయుల స్కేల్సు పెంచవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాను.

Scholarships ఇవ్వడములో కూడా కొన్నిలోపాలు జరుగుచున్నవి. తల్లిదండ్రులు లేనివారికి, వారుకులము చెప్పలేనివారిక్కి scholarships యివ్వమని నిరాకరించుచుండిరి కాని అందరి బీదవిద్యార్థులకు కూడా scholarships యివ్వవలసినదిగా కోరుచున్నాను. అంతేకాక పిల్లలకు వ్యవసాయ వృత్తిలో కూడా, కొంత అనుభవమును కల్గించుట ముఖ్యమని నా ఉద్దేశ్యము, ఉన్నత పాఠశాలల్లో కూడా కొన్ని [illegible] కొన్ని ఎకరములు మెరక, [illegible]

కేటాయించి ఈ కృషియందు వారికి అలవాటు చేయుట ఎంతేని లాభదాయక మని మనవి చేయుచున్నాను విద్యా విషయములో మనము 5 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుచున్నప్పటికిని మనము పూర్తిగా విద్యను అభివృద్ధి చేయుటకు యీ మొత్తము చాలదు కనుక యితర పద్దులనుండి కూడా దీనికి కొంతసొమ్మును తరలించి విద్యాభ్యాసమునకు ఎక్కువగా ఉపయోగించాలని నేను కోరుచున్నాను యీ సందర్భములోనే Excise విషయములో మనము హెచ్చుగా కృషి చేస్తున్నాము

Excise విషయంలో మనం హెచ్చుగా ఖర్చుచేస్తున్నాము Electricity క్రింద 13 కోట్లు ఖర్చుచేస్తున్నాం Highways విషయంలో రెండుకోట్లు ఖర్చు చేస్తున్నాం. విద్యకంటె electricity కి గాని రహదారులకు గాని ఎక్కువ ప్రాముఖ్యత పొందడానికి లేదు ముందుగా విద్యకు ఎక్కువ కేటాయించి తరువాత మిగతా విషయాలు చూసుకోవాలని నేను మనవిచేస్తున్నాను మనం ఎన్నోపథకాలు వేస్తున్నాము ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఎన్నోపథకాలు వేసి ఇతర ప్రభుత్వాలనుంచి కేంద్రంనుంచి అప్పుగా తెచ్చుకుని ఖర్చుచేయడానికి సిద్ధంగావున్నాం. ఈసందర్భంలో విద్యావిషయంలో ఆవిధంగా ఎందుకు చేయకూడదు అని నేను ప్రభుత్వంవారిని అడుగుతున్నాను ఒకవిషయం మాత్రం మనవిచేసి సెలవు తీసుకుంటున్నాను ముఖ్యమంత్రిగారు సంస్కృతం విషయంలో కొంతవరకు ప్రకటనలు చేశారు. హైస్కూలులో ఇప్పటికే మూడు భాషలు నిర్బంధం చేయడంవల్ల పిల్లలు తికమకలై పోతున్నారు కారణం విద్యా ప్రమాణం కూడా మేధాప్రమాణాన్ని బట్టి వుండాలి. ఇప్పటికే మూడుభాషలు ప్రతిస్కూలులో నిర్బంధంగా వుండగా సంస్కృత భాషను వారినెత్తిమీద రుద్దడం అన్యాయం అని, బుద్ధికుశలురు కెవరికైనా ప్రత్యేకంగా కావాలంటే వారికి ప్రత్యేక ఏర్పాట్లు చేయించడం సబబు అని, కేవలం నిర్బంధవిషయంగా సంస్కృతాన్ని స్కూళ్లల్లో ప్రవేశపెట్టడం సమంజసంకాదని, ఈ సూచన ఆలోచించి డిమాండు అంగీకరించవలసిందిగా ప్రార్థిస్తూ సెలవు తీసుకుంటున్నాను

Sri N. CHENCHURAMA NAIDU .— అధ్యక్షా, ఈ రోజున 1955-56 వ సంవత్సరం బడ్జెటు విద్యాశాఖ డిమాండుమీద ముఖ్యమంత్రి, ఆర్థికశాఖ మంత్రి, విద్యాశాఖ మంత్రి అయిన బెజవాడ గోపాలరెడ్డి గారు 5 కోట్ల 83లక్షల రూపాయలకు ప్రవేశపెట్టి sanction ఇవ్వాలని కోరినారు. రివెన్యూమొత్తంలో 20% ఈ విద్యాశాఖకు కేటాయించినందుకు వారిని అభినందించవలసిన అవసరంవున్నది. మనదేశానికి స్వరాజ్యంవచ్చిన తరువాత విద్య విషయంలో దేశంలో అమిత ప్రాముఖ్యమైన పరిస్థితులు ఏర్పడినాయి. మారుమూలల వుండేప్రజలుకూడా విద్యావిషయమై చాలాకుతూహలపడుతూ ప్రతి గ్రామంలో స్కూల్సు కావాలని—సెకండరీ స్కూల్సు కావాలని ప్రాథమిక స్కూల్సు కావాలని ఆందోళనజరిగింది. తత్ఫలితంగా జిల్లాబోర్డులు సెకండరీ స్కూల్సును స్థాపించాయి. జిల్లాబోర్డులకు సరిఅయిన ఆర్థికపరిస్థితి లేని కారణం వల్ల అనేకచోట్ల హైస్కూల్సు తెరిచినా దానికికావలసిన teachers, equipment లేని కారణంగా efficiency ఎక్కువగా లేక పోయింది. అనేక స్కూల్సులో ఈ

నాటికి efficiency విషయమై సరిఅయిన standard లేక పోయింది సరి అయిన తరిఫీదు పొందిన Headmasters ను—అనుభవంగలవారిని—ప్రస్తుతపరిస్థితుల్లో ఏర్ప రచడం చాలాఅవసరం ముఖ్యంగా High Schools లో retire అయిన Headmasters లో కొంతమందిని తిరిగి re-employ చేయడం చాలాఅవసరం ప్రస్తుతంచాలా High Schools లో Senior Assts. గావున్నవారికి 10సంవత్సరాల అనుభవంకూడాలేదు కనీసంఇవుడు G O మార్చి 7సంవత్సరాల అనుభవం పెట్టినా ఆ 7 సంవత్సరాల అనుభవంగలవారు కూడా Headmasters పదవులకు జిల్లాబోర్డులలో లేకుండా వున్నారు అందుచేత అనుభవము గడించిన Senior Headmasters ను re-employ చేయడం అవసరం ఈవిషయంలో ముఖ్య మంత్రిగారితో అనేకసార్లు విన్నవించుకున్నాము. వారుకూడా ఈఅభిప్రాయంతో ఏకీభవించియున్నారు. Retired Headmasters ను వీలయినంతవరకు employ చేస్తే High Schools సరియైన స్థాయిలో ఉంచడానికి వీలగునని చెప్పుతు న్నాను High Schools విషయంలో buildings చాలా కొరతగా వున్నాయి. High Schools maintain చేయడానికి ఆర్థికఇబ్బందులు వున్నచోట buildings కట్టించడానికి అనేకమంది దాతలు ముందుకువచ్చారు. కొన్ని స్కూళ్ళలో దాతలు ఇచ్చిన ద్రవ్యంచాలక కొన్నిస్కూళ్ళకు గవర్నమెంటు ½ grant ఇవ్వా లని జిల్లాబోర్డులవారు కోరుతూ వచ్చారు. నెల్లూరుజిల్లా ఉలవపాడు గ్రామంలో వుండే స్కూలుకు half grant ఉవ్వాలని 1953వ సంవత్సరంలో Government వారిని కోరివుండగా, దానిని ఇవ్వడానికి వాగ్దానం చేసినప్పటికి, ఇప్పుడుకూడా ఆ building కు grant ఇవ్వడానికి provision ఇవ్వలేదు ఈ budget లో కాకపోయినా కనీసం రేపువచ్చే supplimentary grants లో అయినా ఇప్పిం చాలని కోరుతున్నాను. ఈ building లో ఇప్పటికి దాదాపు సగం పనికి పైగా పూర్తిఅయినది. Government grant ఇవ్వనిదే పూర్తి చేయడానికి వీలులేదు ఈ grant ను ఇచ్చి school building పూర్తిచేయడానికి సహాయం చేస్తారని నేను నమ్ముతున్నాను. ప్రాథమిక విద్య ఈ నాడు చాలా మహోన్నత మైనదిగావుంది స్వరాజ్యం వచ్చినతరువాత ప్రతి మారుమూలలనుంచి ప్రతి గ్రామంనుంచి విద్య నేర్చుకోవలసిన అవసరం హెచ్చింది ఈప్రాథమిక స్కూళ్లలో అనేకరకాలైన స్కూళ్ళు ప్రతిగ్రామంలోను వున్నాయి అనేక agency ల ద్వారా అవి జరుపబడుతున్నాయి. ఈవిషయంలో చాలా బేధాభిప్రాయాలు వున్నాయి. మారుమూలల వుండే ఈస్కూళ్ళు ఎలాపనిచేస్తున్నాయో పట్టణాల్లో వున్నవారికి తెలియదు; ఈఅనుభవం వారికిలేదు ఇటువంటి స్కూల్సు వారు చూడడానికికూడా అవకాశం వుండదు అందువల్ల అక్కడవుండే సాధకబాధకాలు వారికి తెలియవు. Towns లో aided schools సక్రమంగా జరుగవచ్చును కాని పల్లెటూళ్ళలో aided schools సక్రమంగా జరగడానికి అవకాశంలేదు. వీటన్నిటికంటె, జిల్లాబోర్డు స్కూళ్ళు పూర్తిగా సక్రమంగా నడవకపోయినా కొంచెం మెరుగ్గా పనిచేస్తున్నాయి. ఈ agencies ఒకగ్రామంలో 2, 3 స్కూళ్ళు నడుపుతూ గవర్నమెంటువారి డబ్బును దుర్వినియోగం చేయడం జరుగుతోంది. ఈస్కూళ్ళను అన్నింటినీ ఒకే agency క్రింద నడిపితే economic గా వుండి అప్పుడే ఆ డబ్బు సద్వినియోగం అవడానికి వీలుగావుంటుంది. అనేకచోట్ల

aided schools, labour schools మొదలైనవి అవసరంలేనిచోట ఉండడం అనేకమందిని ఉపాధ్యాయులను వాటిలో maintain చేస్తూ అవి సక్రమంగా జరగకుండా వుండడం గ్రామాల్లో నివసించేవారికి తెలుసు ఒక కమిటీని వేసి ఈ స్కూళ్ల మంచిచెడ్డలు విచారించి న్యాయముగా అందరికి సక్రమమైన మార్గంగా వీటన్నింటిని కలిపి ఒక agency ద్వారానే నడిపితే బాగుంటుంది మన దేశంలో రేపుపరిపాలకులు కాబోయేవా రందరూ విద్యార్థులే కాబట్టి విద్యలో సరియైన standard రావడానికి—ముఖ్యంగా ప్రాథమిక విద్యలో—తగిన శ్రద్ధను తీసుకొని ఒక standard వచ్చేట్లూ చేయడానికి గవర్నమెంటువారు శ్రద్ధ తీసుకుంటారని విశ్వశిస్తున్నాను.

* Sri K. VENKATARATNAM —అధ్యక్ష మహాశయా, ఈనాడు education grant క్రింద ప్రత్యేకంగా elementary education క్రింద 2 కోట్ల 34 లక్షల పైచిల్లర ప్రధాన మంత్రిగారు Government grant కోరారు. దానిని బలపరుస్తున్నాను కాని కొన్ని విషయాలు మాత్రం చెప్పవలసివున్నది. ఈనాడు 2 కోట్ల 34 లక్షల రూపాయలు elementary education కొరకు ప్రత్యేకంగా గవర్నమెంటు ఖర్చుపెట్టుతున్నది ప్రతి జిల్లాలోనూ education cess క్రింద జిల్లాబోర్డులకు ప్రజలు శిస్తుయిచ్చుచున్నారు.—ఒక్క క్రిష్ణా జిల్లాబోర్డును లెక్కతీసుకుంటే 15 లక్షల రూపాయలు సెస్సు యిస్తున్నారు. అదే విధంగా అన్ని జిల్లాలలో చాలావరకు education cess క్రింద లక్షలకొలది డబ్బు బోర్డులకు వస్తున్నది. ఈనాడు 2 కోట్ల 34 లక్షల రూపాయలు aided schools కు జిల్లా బోర్డు స్కూల్సుకు గవర్నమెంటుగ్రాంటు యిస్తూవున్నది ఇందులో కోటి 75 లక్షల రూపాయలు ప్రత్యేకంగా aided schools కు యిస్తున్నారు జిల్లాబోర్డుకు 51 లక్షలు పంచాయితీ బోర్డుకు 2 లక్షలు యిస్తున్నారు. ఈ విధంగా యిస్తున్న యీ grant సద్వినియోగం అవుతున్నదా లేదా అనే విషయంలో చాలమంది గౌరవ సభ్యులు మాట్లాడారు ఎలిమెంటరీ ఎడ్యుకేషను మానేజిమెంటు గవర్నమెంటు తీసుకోవాలనే విషయములో కొంత అభిప్రాయభేధం కూడ వున్నది. ఈనాడు ఒక జిల్లాబోర్డు లెక్క తీసుకుని, క్రిష్ణా జిల్లా ఉదాహరణ చెబుతున్నాను. క్రిష్ణా జిల్లాలో 15 లక్షల రూపాయలు aided schools grant యిస్తున్నారు. 15 లక్షలు రూపాయలు జిల్లాబోర్డుకు ఎడ్యుకేషను సెస్సు క్రింద ఆదాయము వచ్చుచున్నది ఈ 30 లక్షల రూపాయలూ ఖర్చు పెడుతున్నా 30 లక్షలు మాటలు రావడములేదంటే అతిశయోక్తి కాదు. ఈవిధంగా అన్ని జిల్లాలు లెక్కతీసుకుంటే ఎలిమెంటరీ విద్యకు కొనికోట్లు ఖర్చు అగుచున్నది. ఒక గ్రామం తీసుకుంటే ఆ గ్రామములో డిస్ట్రిక్టు బోర్డు స్కూలువున్నది. అదేగ్రామంలో aided schools 1, 2, వున్నాయి. ఎంత డబ్బు దూబరాగా ఖర్చు అవుతున్నదో ఆలోచించండి Aided Schools సరైన స్థితిలో కట్టుదిట్టముగా ఎదోచెప్పుతున్నారు అని గౌరవసభ్యులు A. C. సుబ్బారెడ్డిగారు చెప్పారు నిజంగా అది వారి idea అని నా అభిప్రాయం నెల్లూరు టవునులో ఆఫీసర్లు తనిఖీ చేస్తారని జాగ్రత్తగా చెప్పవచ్చు. కాని మారుమూల గ్రామాలలో జరుగుచున్న విషయము చూస్తే ఒకే మానేజరు క్రింద అనేక స్కూళ్లు వ్యాపార లాభముగా జరుగుచున్నవి. నేడు2 కోట్ల రూపాయలు గవర్నమెంటు, కోటి రూపాయల పై

చిల్లర జిల్లాబోర్డులు elementary education కు ఖర్చు పెడుతున్నారు. వాటికి తగినంత ప్రతిఫలం రావడంలేదు. ఇవన్నీ ఒకే agency క్రిందకు తీసుకువచ్చి ఒకే management క్రింద చేస్తే ఆందోళనకరంగా వున్న స్కూలు మాస్టర్ల జీతాలు పూర్చవచ్చు. ఈ మాస్టర్ల కిచ్చేటటువంటి జీతాలకు ప్రతిఫలంగా సక్రమ మైనటువంటి విద్యకూడా యిప్పించవచ్చు ఒక్కొక్క గ్రామంలో 4, 5 private schools, 2, 3 aided schools వున్నాయి జిల్లాబోర్డు స్కూళ్లు న్నవి. దీనిక్రింద డబ్బువృధాగా నష్టపోతున్నది కాబట్టి ప్రైమరీ education విషయంలో పెట్టేఖర్చు 3 కోట్ల పైచిల్లర సద్వినియోగం కావాలంటే ఒకే management క్రింద పెట్టవలసియున్నది ఒకే management క్రింద పెట్టి నప్పుడు యీ నాడు ఎక్కువ జీతాలివ్వడానికి ఈ డబ్బుతోనే సరిపెట్టవ చ్చును అంతేకాదు. Text books సంగతి ప్రధాన మంత్రిగారు యింతకుముందు శలవిచ్చారు, వారి రిపోర్టులో కూడా వున్నది ప్రభుత్వమే యీ text books ను ప్రచురిస్తే అయిదారు లక్షల ఆదాయం వస్తుందనే అభిప్రాయము సెలవిచ్చారు కనీసం 20 లక్షల రూపాయలు ఆదాయం రావడానికి అవకాశం వున్నదని నా అభిప్రాయం.

The Hon. Sri B. GOPALA REDDI :— పుస్తకాలు చౌకగ వస్తున్నవా ?

Sri K. VENKATARATNAM :— పుస్తకాలు చాల చౌకగా వస్తవి. మంచిఅనుభవముగల స్కూలుమాస్టర్లచే ఎలిమెంటరీ—సెకండరీ విద్యకు పుస్తకాలువ్రాయించినట్లతే కొన్నిలక్షలరూపాయలు ఆదాయంవస్తుంది. మాస్టర్లుకు జీతాలు పెంచవచ్చు. విద్యార్థులకు పుస్తకాలు సకాలములో చౌకగా అందజేయ వచ్చు గాన ఎలిమెంటరీ సెకండరీ ఎడ్యుకేషన్ బాగుపడాలంటే గవర్నమెంటు text-books ను అచ్చువేయించాలి. దానికి ఒకకమిటీని వేసినందుకు సంతోషంగా వున్నది కాని దానినిగురించి వెనుకాముందు ఆలోచించకుండా drive చేసి త్వరగా నడిపించండి. అట్లాచేస్తే త్వరగాస్కూళ్లకు text-books అన్ని స్కూళ్లలో పెట్ట డానికి అవకాశం వున్నది ఇంతకుముందు మంత్రిగారు శలవిచ్చారు క్రిష్ణాజిల్లాలో సెంకడరీ స్కూళ్లలో యింకా పుస్తకాలు రాలేదని. ఈనాటివరకు యింకా సెకండరీ స్కూళ్లలో పుస్తకాలు రాలేదంటే విద్య ఏమి వస్తుందో ఆలోచించండి ఈ text books విషయంలో అనేక చిక్కులు వస్తున్నాయి అందుకని ప్రధానంగా ఆలోచించవలసినవి రెండు ఒకటి text books ప్రభుత్వం ప్రచురించడం రెండోది గ్రామాల్లోవున్న అన్ని ఎలిమెంటరీ స్కూళ్లను ఒకే ఏజెన్సీక్రిందకు తీసుకువస్తే లాభంవస్తుందని ఎక్కువ యుపయోగంగా వుంటుందని మనవిచేస్తూ శలవు తీసుకుంటున్నాను.

Sri T. JALAYYA:—అధ్యక్షా, విద్యాశాఖ మంత్రిగారు ప్రవేశపెట్టిన యీ విద్యా అంచనాలను నేను మనస్ఫూర్తిగా ఆమోదిస్తున్నాను. ఐతే 5 కోట్ల రూపాయల పైచిలుకు పెట్టదలచిన విషయం కూడా చాల ఉత్తమమైనది అయినా ఇట్టి మొత్తం చాలదని నా వుద్దేశ్యం. మనకు వచ్చే వరుంబడిలో నూటికి 30 వ

భాగముకు తక్కువలేకుండా విద్యకు ఖర్చుపెట్టడం కనీస ధర్మమని నా అభిప్రాయం ప్రపంచంలో మానవుడికి విజ్ఞానం, ఆరోగ్యం చాల ప్రధానమైనవి. ఈ రెండూ లేకపోతే మిగతావన్నీ వున్నా ఎక్కువమేలు చేయలేవు అని నా వుద్దేశము. అందుకని యీమొత్తం పెంచవలెనని కోరుచున్నాను. మనయొక్క elementary education నూటికి 40 54% private management క్రింద 45 per cent District Board, Municipal management క్రింద వున్నవని రిపోర్టులో కనబడుతున్నది ముఖ్యంగా యీ ఉపాధ్యాయులు డిస్ట్రిక్టుబోర్డు ఉపాధ్యాయులుగాని, మ్యునిసిపలు ఉపాధ్యాయులుగాని చదువుబాగుగా చెప్పడంలేదని నా అభిప్రాయము అయినను District Board, Municipality లు యదార్థముగ విద్యార్థులకు లైజను ఆఫీసర్లుగా పనిచేస్తున్నారు తప్ప ఏ విధంగా అధికారాలు లేవని నాకు నమ్మకం. మీకు ఒక విషయంలో పనిచేయాలంటే D. E O. ఉత్తరవులేనిదే చేయలేరు మునిసిపాలిటీలు, డిస్ట్రిక్టుబోర్డులో తగాదాలు పెంచి అటు నుంచియిటు యిటునుంచి అటు పంతుళ్లను పంతులమ్మలను మార్చడానికి వినియోగ పర్చుట తప్ప విద్యా విషయంలో శ్రద్ధ కలుగుటలేదని అందుచేత compulsory గా గవర్నమెంటు వారు, యీ డిస్ట్రిక్టుబోర్డు మునిసిపలు స్కూళ్లను వారి management క్రిందకు తీసుకుని విద్యా సదుపాయాలు చేయించగలరని ఆశిస్తున్నాను. ముఖ్యంగా ఉపాధ్యాయుల జీతం తక్కువని నమ్మవలసి యున్నది. కడుపునిండ అన్నంలేనిదేవిజ్ఞానం కావాలనడం వారికే కష్టంగా వుంటుంది దేశ భవిష్యత్తు కుపయోగించే మన పిల్లలకు ఎంత బాగుగ విద్య గరిపితే అంతమంచిది విత్తనం ఎంత జాగ్రత్తగా పెట్టుకుంటే అంతబాగా పండుతుంది గుంటూరు గ్రామంలో హిందూ హైస్కూలు, హిందూ కాలేజీవున్నవి ఈ హిందూ కాలేజికి గ్రాంటు యింతవరకు ఏవిధంగానూ ముట్టచెప్పలేదు మేము కాలేజికి హాస్టల్సు పెడుతున్నాం కనుక ఆ కాలేజికి తగిన గ్రాంటు యిప్పించమని కోరుచున్నాను. ఆ కాలేజి ఆదాయం లక్ష రూపాయలు ఇప్పుడు కానీకూడలేదు అని తమకు నేను మనవి చేస్తున్నాను. కాలేజికి పోగామిగిలిన డబ్బుతో రెండు హైస్కూళ్లు ఒకటి యిప్పుడు women కి ప్రత్యేకంగా ఆరుండల్పేటలో స్థాపించదలచుకున్నాము. స్థలంలేదు. 15 వేల రూపాయల గ్రాంటు దానికి గాను ప్రభుత్వాన్ని కోరుచున్నాను. శారదా నిలయమును తీసుకుని పరిపాలిస్తున్నందుకు నేను మంత్రిగారిని మరీమరీ గుంటూరు ప్రజలతరఫున అభినందనలు తెలుపుతున్నాను.

ఏది ఎట్లయినను లేని తెగువకంటే ఉన్న మొండి మేలు అన్నట్లుగా విద్యాశాఖ మంత్రిగారు పరాయి వారైనట్లయితే తనయొక్క ఉద్దేశములను నెరవేర్చుట కష్టముగ ఉండును కనుక ఆర్థికమంత్రి, విద్యామంత్రి ఒకరైనందువల్ల లేని తెగువకంటే ఉన్న మొండిగా ఉద్దేశానికి తగిన డబ్బును సమకూర్చి విద్యాశాఖను ఎక్కువగ వృద్ధిపరచగలరని నేను కోరుచుచున్నాను ముఖ్యంగా అందరి విన్నపం ఏమంటే పదిరూపాయల శిస్తుమినహాయింపు తీర్చుటకు వీలులేదని గవర్నమెంటువారు ఉత్తరవు పెట్టినారు. గనుక (interruption) అయ్యా మీరుఅడ్డం పెట్టబాకండి నా ఉద్దేశం నేను చెప్పుకుంటాను. పదిరూపాయలు శిస్తుగల రైతుల బిడ్డలకు atleast S. S. L. C. వరకు ఉచితవిద్య నేర్పేవిధానమును గవర్నమెంటు వారుఅనుసరించితే, అంటేదాంట్లో ఒకటిఉంది. దానంఇవ్వకుండా బయటికి పొమ్మన

శమున్ను, కొద్దో, గొప్పో నోటితో వేయడంకన్న చేతితో వేయడం బాగుంటుంది అని నా ఉద్దేశం. నోటితో వేయడంకన్న చేతితో వేయడంవల్ల కొంతవరకు తృప్తి ఉంటుంది గనుక ఆ పదిరూపాయల శిస్తుగల రైతులకు పిల్లలకు S. S. L. C. వరకు ఉచితవిద్య చేర్పించగలరని, అందుకుగాను ఏర్పాటుచేసి ఈ గవర్నమెంటు ఇంకా కొత్తదోవచూపి, ఎక్కువఖ్యాతి పొందగలదని నా యొక్క ఉద్దేశం. ముఖ్యంగా ఇంకొక విషయం కొద్దిసంగతితో, నేను విరమిస్తున్నాను. వావిలాల గోపాల కృష్ణయ్యగారు మలబారుకు పోయి ఎంతోమంది విద్యార్థులను చూచానన్నారు. వాస్తవమే ఆ గ్రామ పద్ధతులు వారికి బాగాతెలియవని నా ఉద్దేశం. మనగ్రామాలు లోతుకు లోతుకు ఉంటాయి ఆ గ్రామాదులు రోడ్డువెంబడే ఉంటాయి. పిల్లకాయలు ఒక్క తడవ గట్టిగా కనబడుతారు. మన పిల్లకాయలు గ్రామాదులకు పోతే జాస్తిగా ఉంటారు. అక్కడికంటే మనవిద్యార్థులు బాగా చదువుకుంటారు. బుద్ధిమంతులు వాండ్లకంటే మన ఉపాధ్యాయులు బాగా భోదించగలరని మనకు కూడ మంచి breeding ఉందని, నా అభిప్రాయాన్ని మనవి చేస్తున్నాను. వారు ఆ కమిటీ తరఫున పోయ్యారు గనుక వారికి ఎక్కువ అర్థంకాదు. మేము వ్యాపారం కోసం ఎక్కువగ తిరుగుతుంటాము గనుక అక్కడక్కడి సంగతులు బాగా అర్థంఅవుతాయి కనుక దయచేసి విద్యామంత్రిగారు, ఆర్థికమంత్రిగారు ఒకరైనందువల్లను వారికలం ఎటుపడితే అట్లు ఆడించుటకు వారికి శక్తిసామర్థ్యాలున్నవి గనుకను, విశాలమైనవిద్యావంతులు, పండితులు గనుకను కళావిషయాలలో కూడ ఎక్కువ అభిలాష ఉందిగనుకను విద్యావిధానములో తగిన కృషిచేసి మన ఆంధ్రరాష్ట్రానికి ఖ్యాతి లభించే లాగున చేయగలరని ఆశిస్తూ ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులకు నమస్కారం చేస్తున్నాను.

Sri RAJA SAGI SURYANARAYANA RAJU:- అధ్యక్షా, మన ముఖ్యమంత్రిగారైన Education మంత్రిగారు ఈవేళ ఉదయం నాపేరు వెల్లడి చేస్తు విశాఖపట్టణం జిల్లాలో స్కూలుఫైనలు open చేశారు, IV Form close చేశారు అని నేను చెప్పినవిషయం వారు గుర్తుకుతెచ్చుకొని, మామూడు స్కూళ్ళలో కూడ మళ్లీ 4th Form reopen చేసినందుకు కృతజ్ఞతాభివందనములు అర్పిస్తు ఉన్నాం తరువాత నేనున్ను, చోడవరం M. L. A. గారు జగన్నాథంగారు అంతావెళ్ళాగా వెళ్లిన వెంటనే వారు చర్యతీసుకొని మామూడు స్కూళ్లకు కూడ అవకాశం ఇచ్చినందుకు చాలా సంతోషించు చున్నాను తరువాత చాలమంది మన మంత్రిగారిని కళాకారులు కళానిధులు జగత్ విఖ్యాతి పొందిన మంత్రులు అని ఎందుచేత వారంతా ఈలాగు అభినందిస్తున్నారో ఒకనిమిషం ఆలోచించాను నేనుకూడ అభినందించవలసిన అవసరం ఉందని గ్రహించాను. ఏమిటంటే కారణం (1) ఏ Chief Minister అయినా సరే నాకు తెలిసినంతవరకు ఏ రాష్ట్రంలో కూడ విద్యాశాఖను తీసుకోలేదని నేను అనుకొంటున్నాను. రెండవది, ఇపుడు ఈకొత్త బడ్జెటులో Development of Art and culture ఒకటి adopt చేశారు ఇది ఒకటి చాల [illegible] నిదర్శనం అని తోచింది. మూడవది ఏమంటే మంచివిద్యాంసులు,

కవులు అని చంద్రమౌళిగారిని మన cabinet లో వేసుకున్నారు నాలుగవది ఏమంటే కళానిమలు అవునో కాదో నాకు తెలియదు గాని కళావారిని కూడా వేసుకొన్నారు ఈ అన్ని కారణాలను బట్టి వారు జగిత్విఖ్యాతి పొందిన ముఖ్యమంత్రులు అనిచెప్పి ప్రార్థించవలసిన అవసరం ఉందని నేనుకూడ అభినందిస్తు న్నాను...ఇపుడు School Final పరీక్ష విషయంలో ఈ రాయలసీమలో మంచి మార్కులు వచ్చినవారు ఎక్కువ ప్యాసుఅయినవారు ఉన్నారని, ఆమధ్య జిల్లా లలో తక్కువ మార్కులు వచ్చి, తక్కువమంది ప్యాసైనవారు ఉన్నారని సెలవు ఇచ్చారు కాని మా విశాఖపట్టణం జిల్లాలో మాత్రం అటుకాకుండా ఇటుకాకుండా moderate గా ఉంది ఒకవిధంగా ఇదిమెరుగగా ఉందని నేను చాల ఆనందిస్తూ ఉన్నాను. తరువాత ముఖ్యంగా నేను మనవిచేసేది ఏమంటే ఈ elementary education మంచిది అని కొందరు అభిప్రాయ పడ్డారు .దానిలో చెడ్డ ఉన్నది, సరిగా నడవడంలేదని కొందరు వ్యతిరేకించారు కాని నా ఉద్దేశం ఏమిటో నేను మనవి చేస్తున్నాను ఇపుడు elementary విద్యేకాదు School Final pass అయిన పిల్లలు కూడా, ఏ మయ్యా మీ తండ్రికి ఉత్తరం వ్రాయడం ఏలాగా అంటేమాత్రం తెలియదు నేను ఎందు చేత తెలియదు అని చెప్పగలిగానంటే నేను ఆలాగు 4, 5 ఎల్లలను ప్రశ్నించాను. నీ తండ్రికి ఏలాగా ఉత్తరం వ్రాస్తావని అడిగితే, "ఫలానా వారికి ఫలానా వారు వ్రాయడం ఏమనగా", అని అన్నారు. 'నమస్కారం' అనేముక్క అయినా మన మాస్టరు చెప్పలేదా అనుకున్నాను ఈ రెండు సంవత్సర ముల బట్టి మా Basic Training School లో Selection Board లో నన్నుకూడ ఒక మెంబరుగా వేశారు చాలమంది సెకండరీ గ్రేడు విద్యార్థులు వచ్చారు Higher Grade కు 8th Standard pass అయినవారు వచ్చారు. వస్తే వారిని ఏమయ్యా మీరు చదువుకొన్న పద్యాలలో ఒక పద్యం చదువమంటే మాకు పద్యాలు రావని చెప్పారు ఈ విధం సంస్థలలో మన education ఉంది అందుచేత ఇపుడు ప్రస్తుతం మన విద్య ఎందుకు నశిస్తుందంటే, ఇదివరకు బ్రిటిషు గవర్నమెంటు ఉన్నపుడు నాలుగుముక్కలు నేర్చుకుంటే ఏదో ఉద్యోగం దొరుకుతుందనే అభిప్రాయంకొద్దీ స్కూళ్లను తేలికచేశివేశారని నా అభిప్రాయం. అందుచేత పూర్వం మన పెద్దబాలశిక్ష చదివితే ప్రపంచ జ్ఞానమంతా ఒకదానిలో ఇమిడిఉండేది. ఇప్పుడు మనము రోజుకూడ స్కూలుబుక్సు మార్చడంవల్ల అనేక మంది పండితులకు అవకాశం ఇవ్వడంతప్ప మరేమి ప్రయోజనం లేదు. మన వెను కటి శతకాలు పెద్దబాలశిక్ష వగైరా గ్రంథాలు తీసుకొనివచ్చి వాటిని ప్రోత్సహిం చామంటే elementary education చాల అభివృద్ధి పొందుతుంది అనినేను ఆశిస్తు న్నాను. తమరు bell కొట్టితే ఇకనేను మాట్లాడలేను. అందుచేత రెండు నిమిషాలు టైము ఇప్పిస్తే నేను చాల ఆనందిస్తాను మా నర్సీపట్నంలో high school ఒకటి ఉంది. దానిని District Board వారు run చేస్తున్నారు. District Board పరిస్థితి మీచేతిలోనేఉంది. ఏలాగుఉందో మాకు తెలుసును అందుచేత హరి జనులకు గిరిజనులకుకలసి ఒకే high school స్థాపించబడింది తరువాత గోపాల రెడ్డి హరిజన హాస్టలు అనిచెప్పి హాస్టలుకూడ వారిపేరనే స్థాపించాం. అది హరిజన్ గిరిజన్ హాస్టల్, ఆపేరు కూడ తమకేదక్కింది. అందుచేత తమటైములోనే సంవ

ప్సరానికి ఒక స్కూలు గవర్నమెంటు స్కూలుక్రింద తీసుకొంటున్నారు అందు చేత వూ నర్సిపట్నం high school కూడ గవర్నమెంటు స్కూలు క్రింద తీసుకొని గవర్నమెంటు గ్రాంటు ఇచ్చి స్కూలు బిల్డింగుకు ఎక్కువ అవకాశం చేయిస్తారని నేను చాలా నమ్ముతున్నాను విశాఖపట్టణంలో ప్రేమ సమాజం అని ఒక సమాజం నడుస్తుంది ఆ సమాజంలో అనేకరకముల పిల్లలు ఉన్నారు, తల్లి ఎవరో, తండ్రి ఎవడో తెలియదు అనేక జాతుల వారు అందులో ఉన్నారు చాలమంది contribution ఇస్తున్నారు కాని స్కూలులో మాత్రం జీతాలు వారందరిదగ్గర పుచ్చుకొనుచున్నారు. అందులో హరిజనులున్నారు గిరిజనులున్నారు. బ్రాహ్మణులు, క్షత్రియులు ఉండవచ్చును తల్లి తండ్రి తెలియనివారు జాతులన్నిటికన్న హీనం గనుక వారికి మాత్రం తప్పకుండా స్కూలులో జీతం లేకుండా తమరు అవకాశం ఇప్పిస్తారని నమ్ముతున్నాము తరువాత సంస్కృతం విషయంలో చాలమంది మాట్లాడారు. స్త్రీలు ముగ్గురు మాత్రమే మెంబర్లుగ ఉన్నారు. అందులో ముఖ్యంగా అమ్మన్న రాజాగారు ముగ్గిరి తరపున ఒకరే పైముతీసుకొని మాట్లాడుతారు. వారు మన సంస్కృతానికి చాల అనుకూలంగా సెలవిచ్చారు చాలమంది పండితులు, చాల మంది పెద్దలు, చాలమంది M. L. A లు కూడ చాల అనుకూలంగా సెలవిచ్చారు. కాని జగన్నాధరాజుగారు మాత్రం కొంత వ్యతిరేకంగా సెలవిచ్చారంటే నేను దానికి కొంత చింతిస్తున్నాను. కారణం మరి ఏమిలేదు ఎప్పుడూ మనం పొట్ట పోషించుకోడానికి ఆధారం కలిగే విద్యకోసమే మనము పాదపడితే, మనసంస్కృత భాషగతి ఏమైపోతుంది? మనమహర్షులందరు గాలిని, ఎండను, వర్షాన్ని, ఎండి, తడిచి, సుఖించి మనశాస్త్రాలన్ని సంస్కృతంలోనే ఇమిడ్చిఉంచారు. ఇతరదేశస్థులంతా మన శాస్త్రాలంతా పట్టుకుపోయి, అభివృద్ధి పొందుతున్నారు. మనం ఇంకా ఆ విధంగా ఆలోచిస్తే మనము ఎప్పుడూ ముందుకురాలేము గుఱ్ఱాన్ని gallop వదిలివేస్తే ఎంతదూరం gallop పరుగెత్తుతుంది? అందుచేత కొంచెము వెనుక తిరిగిచూచి వెనుక మార్గాల, ముందుమార్గాలలోని మంచి చెడ్డలను చూచికొనిపోతే అభివృద్ధి పొందగలమని ఆశిస్తున్నాను. ఇంత అవకాశం ఇచ్చినందుకు Speaker గారికి అనేక వందనములు అర్పిస్తున్నాను.

* Sri T. VEERA RAGHAVULU:—అధ్యక్షా, ఈవిద్యాDemandను నేను బలపరస్తూ, ఇచ్చినటువంటి కొద్దివ్యవధిలో కొన్ని ముఖ్యమైనటువంటి సవరణలు, సలహాలు మనవిచేయాలని ప్రయత్నం చేస్తున్నాను విద్యావిషయంలో సంస్కరణచేయాలని ఉత్సాహంగాని, అవసరంగాని లేదు అని వాదించేవారు ఎవరులేరు. కాని ఈసంస్కరణపట్ల ఇప్పటివరకు జరుగుతున్నటువంటి కృషిని గనుక మనము సమీక్షచేసినట్లైతే, ఇది లేనిపోని ఉపద్రవానికి దారితీస్తున్నట్లు కన్పడుచున్నది University Education level లో మొట్టమొదట ఒక కమిటీ వేశారు, సంస్కరణలు ప్రతిపాదించడానికి. తరువాత ఉన్నత విద్యాస్థాయిలో మరొక కమిటీ వేశారు ఆతరువాత ప్రాథమిక విద్యాస్థాయిలో మరొక కమిటీని వేశారు. ఇదంతాచూస్తే పైనుంచి క్రిందివరకు దీనిని కొట్టుకొంటువస్తున్నారు

దీనినే J B Kripalini ఒకసారి కొంత చలోక్తితోను హాస్యధోరణితోను "This is a strange piece of engineering" అనిఅన్నారు ఈఅభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను పీటిని ఎక్కువగా నేను చెప్పదలచుకోలేదు ఒకసంగతిమాత్రము నేను మనవిచేస్తున్నాను కుప్పుస్వామికమిటీ చేసినటువంటి సిఫార్సులలో ప్రభుత్వం వారు అంగీకరించినవాటిలో ఒకటి, 8వ తరగతి వరకు చదువుకొని training అయినటువంటి ఉపాధ్యాయిలు, ఉపాధ్యాయునులకు మారుగా Secondary grade trained teachers ను మాత్రము ప్రభుత్వంవారు నియమించుట ఉచిత మని యున్నది. ఆసిఫార్సును అమలు జరుపడానికి అనుగుణంగా ఈసంవత్సరం secondary grade training seats, higher grade training seats ఇచ్చే సందర్భంలో అవి తక్కువగా ఉంచారు ఎక్కువగా చదువుకొన్నవారు చిన్నపిల్లలకు చదువు చెప్పినట్లైతే, విద్యార్థియొక్క మానసిక తత్వాన్ని, వారి మనోవికాసాన్ని బాగా అర్థంచేసుకోగలరు అనేటటువంటి foreign సిద్ధాంతాన్ని అనుసరించే ఆవిధంగా, కుప్పుస్వామి కమిటీ వారైతేనేమి, ప్రభుత్వము వారైతే నేమి, చేశారనుకొంటాను కాని ఇప్పటివరకు మన ఉపాధ్యాయులుగా ఉన్నటువంటి Sri C. V Raman గారైతేనేమి, Sri S. V. Ramamurthi గారైతేనేమి, ఇంకా మనదేశములో ఉన్నటువంటి పెద్దపెద్ద వారైతేనేమి కేవలం పెద్దబాలశిక్ష చదువుకొన్న వారివద్దనే అక్షరాభ్యాసము చేసినటువంటివారు కేవలం పుస్తకాలు చదువుకొన్నవారికే విద్యార్థియొక్క మనోతత్వం అర్థం అవుతుందనేది పొరబాటు అంటున్నాను. ఇప్పటివరకు ఆవిద్య చెప్పుతున్నటువంటి ఉపాధ్యాయులకు, ఉపాధ్యాయినులకు కావలసినటువంటి ప్రావీణ్యతఉన్నది కావలసినటువంటి సహనతఉన్నది కావలసినంత బుద్ధికుశలత ఉన్నది ఈసంస్కరణ తలపెట్టినందువల్ల ఇప్పటివరకు కష్టపడి 8వ తరగతి వరకు చదువుకొని సంపాదించుకోడానికి ఈవృత్తిలో ప్రవేశించా లనుకొంటున్నవారికి, పోయిన సంవత్సరం 8వ తరగతి public పరీక్షలో ఉత్తీర్ణులైనటువంటి వారికి ఎంత ఆశాభంగంగా ఉన్నదో, దీనివల్ల ఎంతనిరుద్యోగం పెరుగుతుందో ప్రభుత్వంవారు గుర్తించవలసి యున్నది. అయితే ఇంగ్లాండులోను, ఇతర దేశాలలోను, ఆరుమందికొక ఉపాధ్యాయుడున్నమాట యథార్థమే. University degree కి తక్కువఉన్నవారిని ఎవరిని పిల్లవానిని ముట్టనివ్వరన్నమాట కూడ నిజమే అయితే, ఆదేశంలో ఉన్నటువంటి డబ్బు, ఆప్రభుత్వానికి ఉన్నటువంటి ఆదాయము, ఆదేశములో పౌరులకు ఉండే ఆదాయము, వాటినిబట్టి వారు ఆ standard ను పెంచుకొన్నారు. కాని మనకు ఇక్కడ ఉన్నటువంటి పరిస్థితులలో, రాజ్యాంగరీత్యా కూడ, అందులో ఉండే ఆదేశాన్నిబట్టి ఉచితవిద్య అందరికి కూడ ఇవ్వవలసినటువంటి బాధ్యత మనపైన ఉన్నది. అటువంటప్పుడు, secondary grade అయితేనేతప్ప మిగతావారందరిని తీసివేయవలెను అనే పద్ధతిలో కుప్పుస్వామి కమిటీవారు సిఫార్సుచేయడం దానిని ప్రభుత్వంవారు కేవలం ఆమోదించడం అనేది మంచిదికాదేమో నని నేను అభిప్రాయపడుతున్నాను వైద్యము చేయడంలో Sri C. R. Reddi గారు జ్ఞాపకం వస్తూఉంటారు, వారు చెప్పిన మాటలువల్ల ఒక్కొక్కప్పుడు మనం చేసేటటువంటి చికిత్సవల్లనో, మనతెలివితక్కువ తనమువల్లనో రోగి చనిపోవచ్చును. అందుచేత ఈసంస్కరణలు చేసేటప్పుడు కొంత జాగ్రత్తగా సమగ్రంగా ఆలోచించినమీదట,

ఒడుదుడుకులు లేని విధానములో మనం నడిస్తే మంచిది కుప్పుస్వామి కమిటీ రిపోర్టు ఈసందర్భంలో ఆమోదించడం మాత్రం చాలా అనర్థదాయకమని నేను మనవిచేస్తున్నాను ఈరోజున విద్యాప్రమాణము కుంటుబడి దిగజారుకున్న దంటె, కేవలం ఆ ఉపాధ్యాయుల యొక్క అసమర్థత అని భావించకూడదు ఈనాడువారు మానసికంగాను, ఆర్థికంగాను, చాలాబాధపడుతూ, జీవన్మరణ సమస్యగా వారిజీవితాలు ఉంటున్నందువల్ల ఆపరిస్థితిలో వారుకావలసినటువంటి శ్రద్ధ తీసుకోలేకపోవచ్చును అంతమాత్రాన వారు అసమర్థులని విద్యార్థులయొక్క మనస్తత్వాన్ని గ్రహించి వారిమనోవికాసానికి తోడ్పడేటటువంటి శక్తి సామ ర్థ్యాలు వారిలోలేవని భావించడం కుప్పుస్వామిగారికి నిజమే మోగాని నేనుదానిని ఆమోదించడంలేదు నేను 5వ తరగతి చదువుకొన్న ఉపాధ్యాయుని వద్ద అక్షరా భ్యాసం చేసుకొన్నాను అంతమాత్రాన నావిద్యా వికాసానికి వారు సుస్థిరమైన పునాదులు వేయలేదనే శంక నాకురాలేదు తరువాత మనప్రక్కనే ఉన్న మద్రాసుప్రభుత్వము ఉపాధ్యాయులకు pension ఇచ్చేపద్ధతిని ఏర్పాటు చేస్తున్నది. విద్యాభిమానంలోను, ఉదారత్వంలోను ఏమాత్రం తీసిపోని మనగోపాలరెడ్డిగారు మనరాష్ట్రంలో కూడ ఆవిధానాన్ని అమలు పెట్టడానికి ప్రయత్నం చేయ వలసిందిగా కోరుతున్నాను

రెండవది multi-purpose high schools స్థాపించవలసిన విషయము గురించి మనవిచేస్తున్నాను గురుకులాశ్రమము పద్ధతిపై ఒకసారి మనదృష్టి వెనుకకుత్రిప్పి వాటిని ఆలోచించితే బాగుంటుంది. ఈ multi-purpose schools లో agriculture మీద bias ఉండేపద్ధతిలో విద్యార్థులను తయారు చేయడం మంచిది ఆంగ్లభాష చదువుకోవడం మహాగొప్ప సంస్కృతి అని, వ్యవసాయమంటె కేవలం మోటుప్రజలు చేసేపని అనే నిరసన భావను దురభిప్రాయము లేకుండా వ్యవసాయము ప్రాణాధారమైనటువంటిది, ముఖ్యమైన జీవనోపాధిని కల్పిస్తుం దనే అభిప్రాయము పిల్లలకు విద్యార్థిదశలో నుంచినీ ఏర్పడే పద్ధతిలో multi purpose high schools ఎన్ని పెట్టినట్లైతే, అంతదేశాన్ని ముందుకు తీసుకుపోగలుగుతాము.

ఇక private schools ఉండాలా, అక్కరలేదా అనేవిషయంలో చాలా నిర్దుష్టమైన అభిప్రాయాలు నాకు ఉన్నాయి ఈ private schools crime centres గా తయారవుతున్నాయని చాలా strong words ఉపయోగిస్తున్నాను. ఎందుచేతనంటె, ఇంతమంది విద్యార్థులు ఉంటేనేతప్ప ఒక single teacher ఉండ కూడదని, మరొక teacher కావాలంటె ఇంత attendance ఉండాలని నిర్బంధించడంవల్ల false attendance చూపిస్తున్నారు. ఇకవచ్చినటువంటి Instructorsకు, Inspectors కు, D. E. O. కు కొంత percentage commission ఇస్తూఉంటారు. Garden grant క్రింద ఒక చింతమొక్కను చూపించి garden grant క్రింద తీసుకుంటారు. ఈ విధంగా private schools లో చాలాఅవినీతి, లంచగొండితనము పెరిగిపోయి, ఒక వ్యాపార సరళిలో జరుగుతున్నాయి. కనుక వాటిని శీఘ్రంగా ప్రభుత్వం తీసుకోవడం మంచిది.

ఇంకొక విషయం మనవి చేయదలచుకొన్నాను. ఉపాధ్యాయులను ఉపాధ్యాయునిలస తరచుగా బదిలీచేయడం జరుగుచున్నది ఉద్యోగస్థులలో ఉండేటటువంటి హృదయ దౌర్బల్యములలో ఇదిఒకటి మూడుసంవత్సరములు ఒకచోట వుంచవచ్చునని rules లో ఉండగా, మూడుసంవత్సరములు కాదుకదా మూడు నెలలుకూడ ఉంచకుండా తరచుగా బదిలీచేస్తూ ఉంటారు. దీనివల్ల ఉపాధ్యాయులకు చాలా అసౌకర్యమే కాకుండా బడికూడ సక్రమంగా నడవకపోవడం జరుగుతుంది. అందుచేత rules సక్రమంగా అమలుజరిపితే బాగుంటుందని ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొనివస్తున్నాను.

*Sri E. AYYAPU REDDI.- అధ్యక్షమహాశయా! ఇటీవల, Engineering, వైద్యకళాశాలలో విద్యార్థుల సెలెక్షన్స్ గురించి Selection Board వారు కొంత ప్రాంతీయ దృక్పథాన్ని పెట్టుకొని ఒకప్రాంతం నుంచి, ముఖ్యంగా రాయలసీమనుంచి, వచ్చిన విద్యార్థులకు ఒకవిధమైనటువంటి నిబంధనలను, వేరే ప్రాంతమునుంచి వచ్చినవారికి ఇంకొకవిధమైనటువంటి నిబంధనలను విధించారు. తత్ఫలితముగా, రాయలసీమనుంచి వచ్చినవిద్యార్థులకు ఎక్కువమార్కులు వచ్చినప్పటికి వారు సెలక్షన్ అయ్యే అవకాశంలేకుండా, ఇతర ప్రాంతాలనుంచి వచ్చిన విద్యార్థులకు, వారికంటె తక్కువ మార్కులు వచ్చినప్పటికీ, admission cards, interview cards వచ్చాయి అనేవిషయము అందరికి తెలిసినదే. అంతేకాకుండా, ఆవిషయమై High Court లో ఒక writ కూడ దాఖలుచేసిన సంగతికూడ అందరికి తెలుసును ఉన్నతమైనటువంటి, ఉదాత్తమైనటువంటి ఆశయాలకు నిలయములుగా ఉండేటటువంటి విశ్వవిద్యాలయాలలో కూడ ఇటువంటి ప్రాంతీయ దృక్పథాలు ఏర్పడడం, ప్రాంతీయ ప్రాతినిధ్యాలు ఇవ్వడం, తత్ఫలితంగా కొంతమంది విద్యార్థులకు న్యాయం జరగకుండాపోవడం అనేది చాలా శోచనీయమైనటువంటి విషయము ఈవిషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకొనివస్తూ, దీని ఫలితంగా రాయలసీమలో చాలామంది విద్యార్థులలో ఆవేదన, ఆవేశము, అల్లకల్లోలము కూడ కొంతవరకు బయలుదేరిందనే విషయాన్ని కూడ ప్రభుత్వ దృక్పథానికి తీసికొనివస్తూ, దీనిని తక్షణమే అరికట్టడానికినీ న్యాయము చేకూర్చడానికినీ ప్రయత్నం చేయవలసిందని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రాంతీయ దృక్పథం అనేది ఎవరిదగ్గర, ఎక్కడ ఉండినప్పటికీ, గర్హించదగినదే ఇటీవల బడ్జెటు సమావేశంలో కూడ ఔచిత్యాన్ని మించిన పరిహాసరస ధోరణిలో కొంతమంది రాయలసీమ ప్రాంతంపైన ఒకవిసురువిసిరారు. వాడ్రేవు గోపాలక్రిష్ణగారు, గౌరవసభ్యులు, తను ప్రాంతానికి ఈప్రాంతానికి అట్టేభేదములేదని, కాని ఈప్రాంతములో గార్ధభాలు, నేపథ్య సంగీతాలు మాత్రం విశేషంగా ఉన్నాయని చెప్పారు కాని ఇటీవలనే S S L. C. Board వారు రాయలసీమ ప్రాంతంలో విద్యార్థులు నూటికి అధికసంఖ్యాకులుగా పాస్ అవుతున్నారని, కోస్తా జిల్లాలలో అంత అధికసంఖ్యాకులుగా పాస్ కావడం లేదనిన్నీ ప్రకటించారు. దీనిని పురస్కరించుకొని, ప్రేక్షకుల గ్యాలరీలో ఉండినటువంటి ఒకమహాశయుడు క్రిందికి దిగివస్తూ S. S L C. Board వారు ప్రకటించినటువంటి ఫలితాలను బట్టి చూస్తే ఈప్రాంతములో గార్ధభాలు ఎక్కువగాలేవు అన్నట్లు కనిపిస్తున్నదని ఒకవిసురు కూడా విసిరారు. ఈవిధంగా ప్రాంతీయ దృక్ప

థాలు, ఏ ప్రాంతంలో ఉన్నప్పటికీ, అవి అంతగా మెచ్చుకోదగినటువంటివి కాదు. ఈ ప్రాంతీయ దృక్పథాలు విద్యావిధానంలో మాత్రం ఎప్పటికీ ప్రవేశించకుండా ఉండడానికి ప్రయత్నం చేయవలసిందని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

విద్యావిధానాన్ని గురించి సూచించవలసిన విషయాలు లెక్కకు మించి నన్ని ఉన్నాయి నవభారత నిర్మాణానికి, నవ్యాంధ్ర నిర్మాణానికి ముఖ్యంగా విద్యావిధానంలో, సంస్కరించవలసిన పద్ధతులు, ప్రాతిపదికలు తయారుచేయ వలసిన అగత్యం ఉన్నది మనరాష్ట్రం వ్యవసాయక రాష్ట్రము. నూటికి 80 మంది వ్యవసాయం ద్వారానే జీవనము జరుపుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో, ఈ వ్యవసాయాన్ని నవీన పద్ధతులలో తీసుకురావడానికే కాకుండా ఉత్పత్తిని అధికం చేయటానికి ఉపయోగించే మార్గముల గురించి కూడ విశ్వవిద్యాలయములలో పరిశోధనలు చేయవలసిన అగత్యం ఉన్నది దీనికి అనుగుణంగా మన విద్యావిధానాన్ని కూడ మార్చవలసిన అగత్యము ఉన్నది అంతేకాక, మనరాష్ట్రం కేవలం వ్యవసాయిక రాష్ట్రంగానే కాకుండా, పారిశ్రామిక, వాణిజ్య రూపంగా కూడ మార్పుచెందవలసిన అగత్యం ఉన్నది ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికల ద్వారా ఈఅభివృద్ధిని మనం సాధించగోరినట్లైతే, విద్యావిధానంలో కూడ తదను గుణంగా, తదను సంబంధమైనటువంటి మార్పులు తీసుకొనిరాక తప్పదు. కాని ఇప్పుడు విద్యావిధానంలో ఉన్నటువంటి నిష్ప్రయోజకత్వాన్ని, నిరుపయోగాన్ని, నిరుద్యోగాన్ని పోల్చిచూస్తే, గోదావరినదిలో ఉన్నటువంటి నీటిని ఎంతభాగము ఉపయోగించుకొంటున్నామో, పాఠశాలలలోను, కళాశాలలలోను విద్యార్థులకు బోధించేటటువంటి విద్య అంతభాగము మాత్రమే ఉపయోగపడుతున్న దని స్పష్టపడును చాలామంది B Sc. students కు B. A. (Hons ) students కు తాము చదువుకొన్నటువంటి విద్య తమకు నిరుపయోగమైందని స్వానుభవంవల్ల తెలుస్తున్నది. నామటుకు నాకు నేను చదువుకొన్నటువంటి Astronomy, Statistics ఇవి ఏమాత్రము నా దైనందిన జీవితంలో ఉపయోగపడలేదని చెప్పు చున్నాను. అదేవిధముగా, సహాధ్యాయులు శాస్త్రజ్ఞులుకూడ దేశానికిగాని, రాష్ట్రానికిగాని, తమకుగాని ఉపయోగకరముగాలేరని వారియొక్క అనుభవము, అంతేకాదు. ఇక కేవలం సాంకేతిక నిపుణులుపొందినటువంటి విద్యనుకూడ మనప్రభుత్వము మన రాష్ట్రములో సద్వినియోగం చేసుకోవడంలేదు అనేది ప్రభుత్వ గుర్తుకు తీసుకు రావలసిన అవసరం ఉన్నది నా మిత్రుడొకడు లండనుకుపోయి పెద్ద Universities లో double Ph D. పొందివచ్చినప్పటికినీ, ఆంధ్రరాష్ట్రములో అతనికి ఏమాత్రము తావులేకుండా పోయింది. అతడు ఇప్పుడు ఇతర విశ్వవిద్యాలయిము లలో కేవలం ఒక reader గా మాత్రమే ఉంటున్నాడు అదే విధముగా Technological Schools లో ఉత్తీర్ణులై వచ్చేటటువంటి వారిని కూడ మనము ఈ దినము సక్రమంగా వినియోగించు కోవడంలేదు వారికొరకు 15 లక్షలు, 16 లక్షలు ఖర్చుపెట్టినా, వారికి ఇచ్చినటువంటి విద్య అంతాకూడ ఈనాడు నిరుప యోగంగా ఉన్నది కనుక, పంచవర్షప్రణాళికతో పాటు విద్యావిధానంలో కూడ ఒక సమగ్రమైనటువంటి ప్రణాళికను, Educational Project ను సమగ్ర మైన దృష్టితో తయారు చేయవలసినటువంటి అవశ్యకత ఉన్నదని ప్రభుత్వానికి

విన్నవిస్తున్నాను. అంతేకాకుండా, ఈ దినము కాలేజీలనుంచి బయటికి వచ్చేటటు వంటి విద్యార్థులలో నిరుద్యోగము చాలా ప్రబలియున్నదని ప్రతి అసెంబ్లీ సభ్యునికి తెలుసును కనీసం 10, 15 మంది నిరుద్యోగస్తులైనా ప్రతి అసెంబ్లీ సభ్యుని చుట్టు ముట్టి ఏదైనా ఉద్యోగం ఇప్పించమని బాధిస్తూ ఉండడం జరుగుతూ ఉన్నది. ఇటీవలనే S S. L. C pass అయినటువంటి విద్యార్థులు ఎంతోమంది వారు ఉన్నత కులస్థులైనప్పటికినీ, మాకు peon ఉద్యోగం ఇచ్చినా చాలును అని అవస్థపడుతూ ఉన్నారు ఈ విధంగా నిరుద్యోగాన్ని మాత్రమే పెంచుతూ ఉన్నది ఇప్పుడు విశ్వ విద్యాలయములో ఉన్న విద్య కేవలం నిష్ప్రయోజకులుగా, నిస్పృహతో ఆరాట పడుతున్నారు విశ్వవిద్యాలయముల నుంచి వచ్చినటువంటివారు వీరికిఉన్న విద్యాజ్ఞానము మిడి మిడి విద్యాజ్ఞానము విద్యలో వీరు వికలాంగులని చెప్పడం ఆశ్చర్యం కాదు, అతిశయోక్తికాదు కనుక ఇటువంటి సందర్భములో colleges నుంచి బయటికి రాగానే, ఒక జాతీయ దృక్పథంతో వీరిని సద్వినియోగం చేసుకోడానికి, బీహార్ యూనివర్సిటీలో ప్రయోగించుచున్న పద్ధతిలోనే వీరిని కూడ Community Projects అయితేనేమి, National Development Schemes అయితేనేమి, National Extension Service Schemes అయితేనేమి, వీటిలో నిర్బంధంగా పనిచేసేదానికి ఉపయోగించ వలసిందని ప్రభుత్వాన్ని కోరుకున్నాను. ఏవిద్యార్థి అయినప్పటికీ, పట్టభద్రుని degree తీసుకొనే పూర్వము కనీసం ఒక సంవత్సరం ఈ జాతీయ ప్రణాళికలలో పనిచేయనిదే degree ఇవ్వకూడదనే ఒక సిద్ధాంతాన్ని ప్రభుత్వము అమలు చేయడం అత్యావశ్యకము ఈ దృక్పథంతో, సదాశయంతో విశ్వవిద్యాలయాల నుంచి వచ్చే విద్యార్థులు ఉత్తేజంతో ఉత్సాహంతో జాతీయ ప్రణాళికలలో, నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొని ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా చేయడానికి వారు సిద్ధహస్తులై ఉంటారు. గనుక వీరిని ఉపయోగించడానికి తగినటువంటి కార్యక్రమాన్ని ప్రభుత్వము ప్రవేశపెట్టవలెనని విజ్ఞప్తి చేస్తూ, మీరు ఈ అవకాశాన్ని ఇచ్చినందుకు మీకు అభినందనలు తెలియజేస్తూ విరమిస్తున్నాను.

Sri B. RATNASABHAPATHY SETTY.— అధ్యక్షా, నేను నా cut motion మీద మాట్లాడేముందు ముఖ్యమంత్రిగారికి నాకృతజ్ఞత తెలుపవలసి యున్నది ఈరోజున వారు demand ప్రతిపాదిస్తూ రాష్ట్రములోని high schools లో వచ్చిన results ప్రస్తావన, అందులో ముఖ్యంగా మా బద్వేల్ High School results ను గురించి పొగుడుతూ ప్రస్తాపించారు నేను బద్వేల్ నియోజకవర్గము నుంచి గెలిచి వచ్చాను గనుక మా బద్వేల్ High School ను గురించివచ్చిన ప్రసంగానికిగాను వారికి నాకృతజ్ఞతను తెలుపుచున్నాను కేవలం యిక్కడ ఎసెంబ్లీలోచేసిన ప్రశంసకంటె ఆస్కూలువారికి ఏదైనా బహుమానం పంపిస్తే చాలాబాగావుంటుంది. ఇదిగాకుండా మిగతాస్కూల్సుకు కూడా దీనివల్ల ఒకఉత్సాహమును కలిగించటానికి అవకాశము వుంటుంది గన్కు బద్వేల్ స్కూలు హెడ్ మాష్టరుకున్నూ, అందరికంటె ఎక్కువగా మార్కులు వచ్చిన విద్యార్థికున్నూ, బహుమానసూచకంగా యీ ఎసెంబ్లీలో ఒకతీర్మానంచేసి దాన్ని ఒక message రూపంలో వారికి పంపితే బాగుంటుందని నేను సలహాయిస్తున్నాను.

VOTING OF DEMANDS FOR GRANTS—(Contd.)

DEMAND XV EDUCATION

(Sri B. Ratnasabhapathy Setty) [20th July 1955

మా కడపజిల్లాలో ఉపాధ్యాయుల ఆరవమహాసభలో వచ్చిన విషయాలు ముఖ్యమంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. అందులోవున్న విషయాలు చదువు తున్నాను—

ప్రాథమిక పాఠశాలలలో నేడు అమలులోవున్న పాఠ్య ప్రణాళికలు విద్యార్థులవాస్తవికవిద్యా విజ్ఞానాలను పెంపొందించుటకు ఉపకరించేవిగాలేవు. రెండవది తాలుకాలో తాము నివసిస్తున్న ప్రాంతాలలోనే పాడిపంటలుసీతోష్ణస్థితి మొదలగువిషయాలు తెలియకపోయినా సరే, సహారా ఎడారినిగురించి, దక్షిణాఫ్రికాలోని నీగ్రోలను గురించి, తెలియజెప్పాలి భారతస్వాతంత్ర్యాన్ని కుట్రలద్వారా కూలద్రోసి భారతప్రజలను బానిసామయపరిస్థితులకు గురిచేసి క్లైవ్, వారన్ హేస్టింగ్సు భారత దేశానికి మహోపకారము చేశారని మేము 5 వ తరగతిలో చరిత్ర పాఠం చెప్పాలని ప్రభుత్వం ఆమోదించిన పాఠ్య ప్రణాళికలు మిమ్ములను నిర్బంధిస్తున్నవి. వ్రాత, చదువు, లెక్కలపై ప్రధానంగా కేంద్రీకరిస్తూ విద్యార్థులకు దేశభక్తి, వాస్తవికత, సత్యం, న్యాయం అందు అభిరుచి కలిగించి వారిని ఉత్తమ పౌరులుగా తయారుచేసే ప్రాథమిక ప్రణాళికలు ప్రవేశపెట్టటానికి ప్రభుత్వము వారు శాయశక్తులా కృషి చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

ఇటువంటి పాఠాలు కలిగిన పుస్తకాలు యీ రోజులలో కూడా మన పాఠశాలలో అమలులో పెట్టబోతున్నారని తెలియజేశారు ఈ విషయము యిప్పుడు విద్యాశాఖా మాత్యులకు తెలియజేస్తున్నాను ఇది కేవలము కాలదోషం పట్టినప్పుడు యీ రోజులలో యిటువంటి విషయాలు చెప్పినంత మాత్రాన మన పిల్లలకు భవిష్యత్తులో వారికి కావలసిన విజ్ఞానాన్ని, విద్యను మనము చేకూర్చలేమేమోననే అనుమానం నాకు కలుగుతున్నది గనుక ఆ పాఠాలు అన్నీ మార్చి ప్రస్తుతం 20 వ శతాబ్దములో విద్యార్థులకు కావలసిన చరిత్ర విజ్ఞానానికి కావలసిన పాఠాలు చేకూర్చే ప్రయత్నం చేస్తారని నేను ఆశిస్తున్నాను తరువాత యీ రోజు ఉపాధ్యాయులకు కలుగుతున్న అనుమానాలు సభ్యులు చెప్పలేరు. ఒక విషయం మాత్రం నేను ప్రొద్దునవిన్నాను. ఒక్క సభ్యుడు అయినను దాని ప్రశంస చేయలేదు. ఈ ఉపాధ్యాయులు యిందులో కనబరచిన address లో ఒక ముఖ్యమైన అన్యాయం కనపరచాను అది ఒక్కటిమాత్రం మంత్రిగారికి చదివి వినిపించాలని అనుకుంటున్నాను.

"బ్రిటిషు ప్రభుత్వ హయాములో నిర్మించిన మద్రాసు Education Rules నేటికి యింకను అమలులో వున్నవి రాజ్యాంగ చట్టమునకు సంబంధించిన అనేక విషయాలు యిందులోవున్నవి ఈ రూల్సును ఆధారం చేసుకుని సంజాయిషీ విచారణ కాకుండా suspend చేసిన Teacher's Certificates యిప్పటికి ఆరు సంవత్సరాలు కావస్తున్నప్పటికినీ, వాటిని ప్రభుత్వమువారు పునరుద్ధరించలేదు. ఇలాంటి చర్యలు చెల్లనేరవని యిటీవల గుంటూరు హైకోర్టు తీర్పుయిచ్చినా కూడా ప్రభుత్వము మిన్నకుండా వున్నది. పునరుద్ధరణతోబాటు రాజ్యాంగ చట్టానికనుగుణంగా ఆంధ్ర విద్యార్థి రూల్సును రూపొందించవలసిందిగా వారు కోరారు. ఇది చాలా ముఖ్యమైన విషయము. మా జిల్లాలో చ చాలావిషయాలు జరిగి

నవి ఆవిషయాలు కలెక్టరుకు, Special Officerకు తెలియచేశాను కాని విచారణ కేవలం ఒక అర్జీపైననే, లేకపోతే పలుకుబడి వున్న ఒకవ్యక్తి ఒక ఉపాధ్యాయుని పైన వున్నకసితో ఒక రిపోర్టుచేయడం, ఆ రిపోర్టు మేరకు ఆఉపాధ్యాయుని suspend చేయడం, విచారణలేకుండా కొన్ని సంవత్సరాలుగా ఆయనను suspension లోనే Certificates తో సహా పెట్టకమువల్ల మరియింకొక వుద్యోగమును ఎక్కడనూ చూచుకోకుండా వేరు అవకాశము లేకుండా చేయడం జరుగుచున్నది మా జిల్లాలో ఒకటి, రెండు కేసులు యిటువంటివి జరిగినవి ఇవిగూడ అతిత్వరలోనే మంత్రిగారి దగ్గరకు వస్తాయని అనుకుంటున్నాను ఇటువంటి anomolies రూల్సులో వున్నవి గనుక అవిలేకుండా rectify చేస్తారని మంత్రిగారిని కోరుతున్నాను.

తరువాత ఉపాధ్యాయ సంఘంవారు మంత్రిగారికి తెలియజేస్తారని అనుకుంటున్నాను ఇటీవల Higher Grade Training పాఠశాలను ఎత్తివేయడానికి ప్రభుత్వం నిర్ణయించి నందువల్ల యీ సంవత్సరమే కొన్ని పాఠశాలలు ఎత్తివేశారు. కనీసము విద్యాయోగ్యత S S L. C అని ప్రభుత్వము నిర్ణయించింది. నూటికి 50 మంది వరకైనా నోచుకోలేకుండా వుంటే పేదవిద్యార్థులు S S L.C. వరకూ చదివి training అయి రావడం అసాధ్యము. ఉచిత వున్నత విద్యా సౌకర్యములు కలుగజేయాలంటే, ప్రభుత్వానికి ఆర్థిక స్తోమతులేదని తెలియజేస్తున్నారు కాని ప్రజలకుగాని ప్రభుత్వానికిగాని స్తోమతు చేకూరేవరకూ యథావిధిగా యీ Higher Grade Training వుంచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాను కుప్పుస్వామి కమిటీవారి సిఫార్సులకు యిది వ్యతిరేకముగా వుండవచ్చు మంత్రిగారు దీన్ని దృష్టిలో పెట్టుకొని సవినయము చేయవలసిందిగా కోరుచున్నాను

ఈ రోజున Education Demand పైన చర్చ కేవలం కుప్పుస్వామి కమిటీ recommendations పైననే ఎక్కువగా జరిగింది. అందులో నిన్నమాకు అందజేసిన యీ కుప్పుస్వామి కమిటీవారి సిఫార్సులు 80 యింటిలో 41 సిఫార్సులు ప్రభుత్వమువారు అంగీకరించామని తెలియజేశారు. ఇందులోని ముఖ్యమైన సిఫార్సులను త్రోసిపుచ్చి సామాన్యంగా ప్రతిస్కూలులో యిప్పుడు జరుగుతున్న సిఫార్సులు మటుకు ప్రభుత్వంవారు అనుసరిస్తున్నట్లుగా వున్నది List of recommendations గవర్నమెంటు ఒప్పుకుంటున్నది. ప్రభుత్వము ఒప్పుకున్నవి, ఒప్పుకోని వాటికి మధ్యకొన్ని వున్నవి ప్రభుత్వము అవి ఒప్పుకున్నట్లు తెలియడం లేదు. ఒప్పుకోనట్లుగూడా తెలియడంలేదు. అందులోనివి ముఖ్యమైనవి ఉపాధ్యాయుల వేతనాలు ఎక్కువచేయడం కాదు ఈ సిఫార్సులు ప్రభుత్వమువారి ఆలోచనలో వున్నట్లు అర్థమా, లేకపోతే ప్రభుత్వము వాటిని త్రోసిపుచ్చినట్లు అర్థమా, ఏ విషయముగూడా తెలియడంలేదు కాని మాకుసంబంధించి నంతవరకు ఏవి త్రోసిపుచ్చకుండా అన్నీ ప్రభుత్వము ఒప్పుకుంటే చాలా బాగుంటుందని అంటున్నాను.

ఈరోజున ప్రభుత్వమువారు సభ్యులకు అందజేసిన statement లనుముఖ్యంగా compulsory education గురించి ప్రస్తావన చేసి, దానివిషయంలో ప్రభుత్వం

శ్రద్ధతీసుకుంటున్నదా, లేదా అనేది ఏవిషయము తెలియకుండా వారిస్టేటుమెంటులో చూపించారు Compulsory Education విషయంకూడా మొన్న వచ్చిన debate లో కూడా నేను ప్రస్తావనచేశాను ఇది చాలా సంవత్సరాల నుంచి మన నాయకులు, కాంగ్రెసు సంస్థ దానికొరకు ఆందోళన చేస్తూవచ్చింది బ్రిటిషువారి హయాములో వున్న గోపాలకృష్ణగోకలేగారి హయామునుంచి కూడా దీన్ని గురించి ఆందోళన చేయడం, దాన్నిగురించి కొంతమటుకు కృషిచేయడం కొన్ని సంస్థలద్వారా జరుగుతూ వచ్చింది Gaikwar of Baroda 1893 సంవత్సరములో కొంతవరకూ అమలు పెట్టటానికి వారి సంస్థానంలో ప్రయత్నించారని తెలుస్తున్నది కాని అది చాలావరకు చేకూరిందని చరిత్ర చెబుతున్నది

మనకు స్వాతంత్రయము వచ్చిన తరువాత మన కాంగ్రెసునాయకులు చెబుతున్న మాటలు అన్నీ చూస్తే, ఎందుకు అమలు జరపలేక పోయారోగాని కేవలం ఆర్థికస్తోమతు దృష్టిలో వుంచుకొని దానికి protest గా సాగిస్తున్నారు కాని సాధ్యమయినంతవరకు అయినా కొన్నిస్థలాలలో నైనా ప్రయత్నించినట్లు చూపించబడలేదు Compulsory education మాత్రము కేవలం ఆర్థికస్తోమతు వున్న వారికే education ఒక privilege గా కాకుండా, ఆర్థికంగా ఏ ఆధారములేని వారికికూడా education యిచ్చే అవకాశము, యింకా యితర సౌకర్యాలు అంటే కొంత ఆహారము, midday meals, యివన్నీ ఏర్పాటుచేస్తూ పేదవారికి మంచి అవకాశము చూపించటానికి వారి వుద్దేశ్యము గనుక దీని విషయంలో మంత్రిగారి ఉపన్యాసంలో కూడా యీప్రస్తావన రాకపోవడం చాలా శోచనీయం. ముఖ్యమంత్రిగారు దీనివల్ల కొంతడబ్బు అయినా ఖర్చుపెట్టటానికి ప్రభుత్వము ప్రయత్నించడములేదు.

Adult education ను రామకృష్ణమిషన్ మొదలగు ప్రైవేటుసంస్థలకే యిచ్చామని మంత్రిగారు తెలియచేశారు. ఇప్పుడు మనకు ఎంతజనాభావుంది? ఎంత percentage of literacy వున్నది? ఎంత percentage కి litarecy లేదు అనే లెక్కలు ఇందులో కనబరచివుంటే చాలబాగుండేది మన adult education పురోభివృద్ధిచెందిందా అనితెలుసుకోడానికి అవకాశమువుండదు. ఇవన్నీ మనకు తెలియకపోగా కేవలం 5 వేల చిల్లర జనాభాకు ఇప్పటికి ఈ adult education వుపయోగపడింది, దీనిని అమలుపెట్టాలనేవారు స్టేటుమెంటులో ఇచ్చారు. ఇదికేవలం ప్రైవేటుసంస్థలకు ఇచ్చినందువల్ల పురోభివృద్ధి చెందడానికిఅవకాశాలు లేకపోయింది అనేదిమాత్రం దృష్టాంతరంగా కనపడుతున్నది ఈ adult education విషయంలో మనకుస్వాతంత్ర్యం వచ్చినప్పట్నుంచి శ్రద్ధతీసుకోవలసింది మనకు స్వాతంత్ర్యము వచ్చి 7, 8 యేండ్లు అయినా కూడా దానియందు ఎక్కువ శ్రద్ధ తీసుకోకపోవడము విచారకరము దీనియందు యికనైన గవర్నమెంటు తగిన శ్రద్ధతీసుకోగలరని ఆశిస్తున్నాను.

Basic education ను మీపార్టీ ప్రణాళికలో ప్రధానోద్దేశ్యములలో ఒకటిగా తీసుకున్నారు. దీనిని గురించి కాంగ్రెసుపార్టీ ఎక్కువగానే చెప్పుతున్నది. గాంధీగారి సిద్ధాంతముగా తీసుకొన్నారు ఇప్పుడు ఒక్కకమ్యూనిష్టు పార్టీ తప్పితే మిగిలిన పార్టీలు అన్నీ ఈ basic education అవసరమనే చెబుతున్నారు

కేవలము దీనిని గురించి మీబడ్జెటు స్టేటుమెంటులో చూస్తే ఇప్పటికి దీనికొఅకు 13195 స్కూళ్లు వున్నాయని, ఇందులో ట్రైనింగు స్కూళ్లు 18 వున్నాయని తెలుస్తున్నది ప్రస్తుతము 4 aided స్కూళ్లు వున్నాయని, యింకా ఈసంవత్సరము 3 తెరువబోతున్నారని కూడా తెలియజేశారు మొత్తం 25 ట్రైనింగు స్కూళ్లు వున్నాయని తెలియజేశారు మనరాష్ట్రంలో ఉన్నటువంటి స్కూళ్లు అన్నికూడా ఈ basic education ను introduce చేయాలని మీఉద్దేశ్యము అయితే మొత్తం 17,164 స్కూళ్లు వున్నాయి ఈ స్కూళ్లు అన్నింటికికూడా ఈ స్కూళ్లుంచుటకు కావలసిన వుపాధ్యాయులను basic training schools తయారు చేయగలవా అని నాకు సంశయముగా నున్నది మరిఆలోచించి చూస్తే ఈ 25 schools, వాటికి కావలసిన వుపాధ్యాయులను తయారుచేసి యివ్వలేవు. అందువల్ల ఇంకా schools ఎక్కువకావలసిన అవసరము ఉన్నది కాబట్టి యింకా స్కూల్సు ఎక్కువచేయాలి

హైస్కూళ్ళలో ఈ రోజు contributions వల్లకొన్ని schools తెరిచారు. ఆ schools కు buildings ఏవిధంగా వుండాల్సినది ఇంజనీర్లు తయారు చేసినటువంటి schemes ప్రకారం designs ప్రకారం చేయాలి అంటున్నారు. చాలా జిల్లాల్లో కొన్ని schools లో ఎక్కువమంది విద్యార్థులు లేకపోయినా ప్రతి school కు 12 గదులు కావాలని, 6 గదులు కావాలని insist చేయడము జరుగుతోంది అక్కడవున్న strength ను బట్టి ఎన్ని గదులు కావాల్సిఉంది, ఎటువంటి గదులు కావలసింది నిర్ణయిస్తే అయ్యేఖర్చు గూడా చాలా తక్కువ కావడము, అందువల్ల ప్రజలు ఇచ్చే contribution లో కూడా తగినంత వసూలుచేసి ఎక్కువ బాధలేకుండా ప్రజలు contribution లు యివ్వడానికి అవకాశము వుంటుంది దాని ప్రకారం మీరు ఏస్కూలులో ఎంత strength వున్నది, ఎన్నిరూములు కావాలి నమూనాలువేసి ఇంజనీర్లకు యిస్తే చాలాతక్కువ ఖర్చు అవుతుందిగదా? ఒక సంవత్సరమే మొత్తం contribution లు అన్నీ యివ్వవలసిందిగా ప్రజలను బలవంతముచేసి, ఇవ్వలేకపోతే స్కూళ్లు మూసివేయడము అన్యాయము కాబట్టి ఆవిధంగా అయితే ప్రతిసంవత్సరము కొంతకొంత వసూలు చేయవచ్చును దానిని మీరు ఆలోచించాలని కోరుతున్నాను. 20% మేము బడ్జట్టులో దానిక్రింద ఖర్చుపెట్టుతున్నారు చాలా సంతృప్తికరంగా వున్నదన్నారు. Education అన్నిటికంటె ముఖ్యం గనుక 20% దీనిక్రింద ఖర్చుపెట్టుతున్నాము అనే దానికన్నా ముఖ్యంగా ఏఏశాఖలో ఏ educational aspect ముఖ్యమో దానిపైన ఎక్కువ ఖర్చుపెట్టితే basic education, technical education పిల్లలపైనఎక్కువఖర్చుపెట్టడమే మంచిది కేవలము కాలేజి education వరకే technical education insist చేసినారు ఇంజనీరింగు కాలేజీల్లో, మెడికలు కాలేజీల్లోను కొంతమంది కాలేజీ Education చదివేందుకు ఆర్థిక సంపత్తివుండి చదవలేనివాళ్లు కొందరువుంటారు. ఆర్థికసంపత్తిలేక చదవలేనివారు చాలామంది వుంటారు. వారు హైస్కూలు వరకే చదివి మానుకుంటారు. కనుక హైస్కూళ్ళు కూడా వాళ్ళ వాళ్ళ avacations కు సరిపోయేటటువంటి Technical విద్యను వాళ్ళకు బోధించే అవకాశాలను కల్పిస్తే బాగుంటుంది. హైస్కూల్సులో కూడా technalogical కోర్సులను వాళ్ళు హైస్కూల్సు

...ను చాలించగానే వెంటనే వుద్యోగము చేసుకోడానికి వీలుగావుంటుంది గవర్నమెంట్లులో వుద్యోగము దొరకకపోతే కూడా వాళ్ళు స్వంతముగా ఏదైనా ఒకవృత్తి చేసుకొని జీవించడానికి అవకాశాలు చూపించేందుకు కూడా తగునటువంటి విద్య వాళ్ళకు ఏర్పాటుచేస్తే దానిమూలంగా నిరుద్యోగ సమస్య కొంతవరకు తగ్గుతుంది

ఇన్నాళ్ళ స్కాలరుషిప్పులు, సగము జీతములు, ఎక్కువ మతాధారముపైన ఇస్తున్నారు కొన్ని కులాలు కొన్ని తరాలుగా వెనుకబడి వుండటమువల్ల వాళ్ళకు కన్సెషను ఇవ్వడము న్యాయమేమో అని తోస్తోంది మిగతా అన్నికులాల్లోకూడా చాలామంది వెనుకబడినవారు వున్నారు వాళ్లకు తగిన సౌకర్యాలు లేకపోవడమువల్ల మనము చూస్తూనేవున్నాము అటువంటప్పుడు ఈ గవర్నమెంటు ఇచ్చే కన్‌సెషన్సు వాళ్ళకు అన్వయించకుండా, వాళ్లు వుపయోగించుకోడానికి అవకాశాలు లేకుండా పోతున్నాయి. ఇకమీద అయినా గవర్నమెంటు cast basis పైన కాకుండా ఆర్థికపరిస్థితిని బట్టి class చేసినపైన స్కాలర్‌షిప్పులు ఇస్తే బాగుంటుంది మెరిట్‌పద్ధతికూడా పెట్టడము అంత న్యాయముకాదు ఆర్థికంగా వాళ్లపద్ధతులను ఆలోచించి ఏ బేసిస్‌పైన స్కాలర్‌షిప్పులు ఇవ్వడమో నిర్ణయించాలి ఇంగ్లండులోను ఇంకా ఇతరదేశములలోను వారి ఆర్థికపరిస్థితిని బట్టే దీనిని ఇస్తారుగాని మెరిట్‌నుబట్టి ఇవ్వడములేదు మనము కూడా అవిధంగానే చేయాలి.

The Hon. Sri B. GOPALA REDDI :— అధ్యక్షా! ఈడిమాండు పెద్దది అయినా అందరుకూడ విమర్శనలు సుహృద్భావముతోచేసి మొత్తముమీద ఈ డిమాండులో యింకా ఎక్కువ అడిగినప్పటికి మేము ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామని సూచనలు అన్ని పక్షములవారుకూడా చేసినందుకు చాలా సంతోషము. ఈ విద్యావిషయంలో ప్రతివాళ్ళు ముఖ్యంగా తలిదండ్రులుఅయినటువంటి వాళ్ళువారిబిడ్డలయొక్క చదువువిషయమై ఆలోచిస్తూవుండటముసహజము బాలబాలికలకు అన్నిచోట్ల పల్లెటూళ్ళలోను, పట్టణాలలోనుకూడా, విద్యావిషయకంగా కొంత సౌకర్యం కలిగి భారతదేశానికి ఇకముందు వారు సేవచేయడానికి వీలుగా వుంచేదిఅందరూకూడా సంతోషించవలసిన విషయము ఎలక్ట్రిసిటీ, ఇరిగేషనులలో మాదిరిగా ఇందులో అభివృద్ధి ఒక పర్యాయము మనకు కనిపించదు. వచ్చే 15 సంవత్సరములకుగాను, 20 సంవత్సరములకుగాను మనము ఏమిచేస్తున్నాము. ఏ స్కూల్సు పెట్టుతున్నామో ఏ కాలేజీ పెట్టుతున్నామో దానియొక్క లాభము అంతా 10 యేండ్లకు, 15 యేండ్లకు మనకు కన్పడుతుంది అటువంటిపెద్దడిమాండు ఇది. అందులో ఇది సర్వతోముఖమైన విషయము. ఇది ఎక్కువ సాహిత్యంకాదు. సంస్కృతముకాదు, మన సంగీతము కళలు అన్నీకూడా ఇందులో వున్నాయి. ఇంకా వాలంటీర్ల విషయం. Scout movement, N. C. C. ఇవన్నీ కూడా దీంట్లోనే వున్నాయి. క్రమశిక్షణకావాలి అందరూకూడా తర్ఫీదు కావాలి. అనేక విషయాలు అంతా చర్చించబడ్డాయి వాటితోపాటుphysical cultural collegeని కూడా గవర్నమెంటువారు తీసుకోవాలని చెబుతున్నారు శరీరవ్యాయామము ముఖ్యముకావాలి. ప్రతిస్కూలులోను సరియైనడ్రిల్లుమాష్టరు కావాలి. దీనికోసం మీరు

ఏమిసహాయము చేస్తున్నారు అన్నవిషయం కూడా చెప్పినారు. ఈరకంగా మొత్తం డిమాండుమీద అట్టేరాళ్ళు పడకుండా అక్షంతలు పడ్డందుకు చాలా సంతోషము.

ఒకటి రెండు విషయాలలో భేధాభిప్రాయాలు ఉన్నవి కొంతమంది private schools బాగున్నవని. కొంతమంది అవిలోప భూయిష్టంగా నున్నవని, అందువల్ల అవి ప్రభుత్వంవారి ఆధీనములోకి తీసుకొనవలెననియు, ఎవరికి తోచినట్లు వారువారి అభిప్రాయములను తెలిపినారు కాని సుబ్బారెడ్డిగారు మొదలైనవారు private schools ను ప్రభుత్వము తీసుకొనుట మంచిదికాదు సరిగా work చేయనివాటిని మాత్రము ప్రభుత్వము తీసుకొనవలసినదని చెప్పినారు. అయితే అన్ని private schools చాలా నికృష్టముగా నున్నవని చెప్పటకు వీలులేదు Manage-ment చేయుటలో లోపమువల్ల ఆ private schools సరిగా పనిచేయుటలేదు. అందులోని ఉపాధ్యాయులకు జీతములు యివ్వక పోయిననూ లేకపోతే లేనిపోని రాజకీయములు పెట్టుకొని విద్యార్థులకు సరిగా విద్య గరపకపోవడమువల్ల అన్ని schools కూడా fail అయినవి అని చెప్పడము కేవలం న్యాయము కాదని చెప్పుచున్నాను. ఈ విషయములో దర్యాప్తు చేయవలసిన అవుసరము ఉన్నది కాని ఛాలచోట్ల అన్నిరకముల schools ఒక్కచోటనే ఉంటున్నవి బోర్డు స్కూలు, Municipality school, Agency school, Missionary school ఇవన్నియు ఒకదాని ప్రక్కన మరొకటి ఉంటున్నవి అట్లుఉండుటవల్ల ప్రభుత్వమునకు చాలాఖర్చు అవుచున్నదని చెప్పుచున్నారు కాని అటువంటి overlapping institutions లేకుండా గవర్నమెంటుకు లాభముగా ఉండేటట్లుగా సౌకర్యం కలిగేట్లుగా ఆలోచించి తప్పకుండా ప్రతి తాలూకా దర్యాప్తు చేసి అనవసరపు schools ను రద్దు చేయుటకు ప్రభుత్వము పూనుకొనును Kuppuswamy Committeeసిఫార్సులను అంగీకరిస్తున్నారో లేదో అన్నమాట లేకుండా దానియొక్క మూల సిద్ధాంతము తీసుకొని ఎటువంటి wastage లేకుండా అక్కడక్కడ overlapping లేకుండా elementary education ఇంకా ఎక్కువ పరివ్యాప్తము కావడానికి ఎటువంటి అవకాశము తీసుకొనవలెనో అటువంటి అవకాశము తీసుకొనెదమని నేను చెప్పుచున్నాను నిజముగా ఈ నాడు ఆర్థిక లోపమున్నదని చెప్పటచే మీరు చులకనగా చూస్తారేమో అని భయపడుచున్నాను కుప్పుస్వామి కమిటీ నివేదిక ప్రకారంగా elementary schools కు intial stage లో 27 లక్షలు అవును Ultimateగా 64 లక్షలు అవును మనబడ్జెటులో 366 లక్షల లోటు ఉన్నదని అందరికి తెలిసినదే. కనుక ముందు అ deficit ను భర్తీ చేసుకోవలసిన అవుసరమెంతైనా గలదు మనయొక్క plan size అంతాకూడా మనము ఎంత ఆదాయం చూపించెదమో దానిని బట్టి మన plan ఉంటుంది కాని ఏదో మనకు resources ఉన్నా లేకపోయినా Government of India 200 కోట్లు ఇచ్చెదరు అయినాద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిర్విఘ్నముగా సాగుతుంది అన్నమాట వాస్తవముకాదు. మనము స్వయం సహాయము చేసుకోవలసి యున్నది మనము ఆర్థిక స్తోమతును కలుగజేసుకోవాలి అంతేగాని ప్రతిదానికి కేంద్ర ప్రభుత్వము యిస్తారని భావించరాదు. వారి దగ్గరకూడా ధనములేదు కాని మనము ఏదీ చేసుకోకుండా salaries ఎక్కువ చేసుకొని మన resources ఎక్కువ కాకుండా మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సాగాలంటే అది వీలైన విషయము కాదు. మనము నిరాశ

చెందకుండా వాస్తవమును తెలుసుకొని మన పరిస్థితులను బాగుచేసుకొనుట మంచిదని నా ఉద్దేశంము. 66 లక్ష అనినచో అది చిన్న మొత్తము కాదు. ఈ నాడు మనకు 27 కోట్లు ఆదాయం వచ్చుచున్నది అందులో 4 కోట్లు Government of India యిస్తున్నది. Teachers విషయంలో నేమి, women's education విషయంలోనేమి, N. C C training విషయంలో నేమి, college grants విషయంలోనేమి, high schools కు grants ఇవ్వవలెనా అన్న విషయములోగాని, ఇవన్నీగవర్నమెంటుకు నివేదించకూడదని నేనుచెప్పడము లేదు, కాని ఇవన్నీగూడ మన శక్తినిబట్టి చూసుకోవలసి యున్నది అవి మంచి విషయములే అయినప్పటికి సమయానుకూలంగా మనము సరిదిద్దుకోవలసి యున్నది కాని teachers కు సరైన జీతము ఇవ్వకపోవడమువల్ల విద్యకు లోపము కల్గుచున్నదని నాకు తెలుసు కనుక పరిస్థితులన్నియు నాకు తెలుసు కాని ఒక్కటే బాధ ఆర్థిక లోపము. కాని ఏకారణము చేతనైనా scales of pay పెంచకపోయినట్లయిన మీరు అన్యథా భావించవద్దని ఉపాధ్యాయులకు మనవి చేయుచున్నాను III form వరకు నెలకు రు 100/- కంటె లోపువచ్చు వారిపిల్లలకు ఎంతవిద్య గలిపించాలి నాకు తెలుసు. Travancore Cochinలో ఆవిధముగా జరుగుచున్నదని తెలుసు ఆ విధముగా మనరాష్ట్రములో జరుపుటకు 15 లక్షలు ఖర్చగునని అంచనా వేయబడెను ఆ విషయమై కృషిచేసి సాధ్యమైనంత త్వరలో దానిని సాధించడానికి ప్రభుత్వం పూనుకుంటుంది. కేంద్ర ప్రభుత్వంవారు కూడా మనలను పదే పదే మన financial position ను గురించి అడుగుచున్నారు రేపు అడుగుతారు. వారికి తగు సమాధానము యివ్వవలసి ఉన్నాము.

విద్యాబోధనా విషయములో కొన్ని భేధాభిప్రాయాలు వచ్చినవి ఈ విషయంలో పుచ్చలపల్లి సుందరయ్యగారు మాట్లాడుతూ English compulsory చేయనవసరము లేదన్నారు జగన్నాథరాజుగారు సంస్కృతము compulsory చేయవలసిన అవుసరము లేదన్నారు. కొందరు Ist Form నుండి III వరకు హిందీ compulsory అక్కరలేదన్నారు మరి కొందరు IV ఫారము నుండి హిందీపెట్టిన బాగుండునేమో నన్నారు. కొందరు two periods చాలునని మరి కొందరు చాలదని యీ విధముగా భేదాభిప్రాయాలు వెలబుచ్చినారు. ఈ విషయములో ఇతర రాష్ట్రాలలో ఏమిచేస్తున్నారో గమనించి తరువాత మన విధానమును నిర్ణయించు కొనుట మంచిదని అనుకొనుచున్నాను కాని School final పరీక్ష pass అయేటప్పటికిహిందీ బాగారావలెననే దానిలో ఏ ఒక్కరికినీ భేధాభిప్రాయములేదు కనుక దానికి ఎంతవరకు చేయడానికి వీలుంటుందో అంతవరకు ప్రయత్నము చేసెదను.

Physical training స్కూలు గురించి కొందరు చెప్పారు కేవలం physical training school మాత్రమేకాదు 20, 30 సంవత్సరాల క్రితం ప్రతి గ్రామంలో కూడా తాలింఖానాలు వుంటూవచ్చాయి నాకు తెలుసును బందరు, నెల్లూరు వగైరా పట్టణాల్లో ప్రొద్దున్నే అందరూ పోవడం, దండాలు తీయడం చేస్తూవచ్చారు. ఈదినాల్లో కాలేజీ విద్యార్థులు high school విద్యార్థులు వీటి మీద ఎక్కువ అసక్తి చూపించడంలేదు. వాళ్ళకుకూడా వ్యాయామము మొదల

